# తెలుగు జన సాహితి

[1984 అక్టోబరు నుండి 1985 సెప్టెంబరు వరకు జరిగిన సారస్వత వేదిక ఉపన్యాసాల సంకలనం]


సంపాదకుడు

కె. కె. రంగనాథాచార్యులు



ఆంధ్ర సారస్వత పరిషత్తు

తిలక్ రోడ్, హైదరాబాద్.

ప్రథమ ముద్రణ : మార్చి 1990

ప్రతులు : 500

వెల : రూ. 18/-

తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహకారముతో.

ప్రతులకు :
**ఆంధ్ర సారస్వత పరిషత్తు**
తిలకురోడ్డు, హైదరాబాదు.

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
హైదర్‌గూడ, హైదరాబాదు - 500 029

# ఇందులో


1. తెలుగు జనసాహితి (సంపాదకీయ వ్యాసం)
— కె. కె. రంగనాథాచార్యులు — vi

2. ఆదిమకళగా కవిత్వం
— ఎ. బి. కె. ప్రసాద్ — 1

3. జానపదులు - పని - పాట
— జయధీర్ తిరుమలరావు — 17

4 జానపద వాఙ్మయంలో స్త్రీ
— నాయని కృష్ణకుమారి — 37

5. జానపద సాహిత్యం - పౌరాణిక గాథలు
— రావి ప్రేమలత — 56

6. జానపద గేయాలలో కవిత్వం
— ఎస్. గంగప్ప — 88

7. జానపద సాహిత్యంలో ఆచారాలు - నమ్మకాలు
— నాయని కోటేశ్వరి — 95

8. సామెతలు, పొడుపు కథలు - సమాజం
— వి. వి. యల్. నరసింహారావు — 149

9. లిఖిత జానపద సాహిత్యం
— ఆర్వీయస్. సుందరం — 168

10. ప్రచార సాధనాలుగా జానపద కళారూపాలు
— ఎల్లోరా — 178

11. ఆధునిక యుగంలో జన (జానపద) సాహిత్యం
— దేవరాజు మహారాజు — 186

# ఇందులోని రచయితలు

**కె. కె. రంగనాథాచార్యులు** - తెలుగుశాఖ, హైదరాబాదు (కేంద్రీయ) విశ్వ విద్యాలయం, హైదరాబాదు - 500 134.

**ఎ బి. కె. ప్రసాద్** - సంపాదకులు, ఆంధ్రభూమి, సికింద్రాబాదు.

**జయధీర్ తిరుమలరావు** - లలితకళా కేంద్రం, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

**నాయని కృష్ణకుమారి** - తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

**రావి ప్రేమలత** - తెలుగు లెక్చరర్, రామచంద్ర కళాశాల, హైదరాబాదు.

**ఎస్. గంగప్ప** - తెలుగుశాఖ, నాగార్జున విశ్వవిద్యాలయం, గుంటూరు.

**నాయని కోటేశ్వరి** - ఆంధ్రసారస్వత పరిషత్తు ప్రాచ్య కళాశాల, తిలక్ రోడ్, హైదరాబాదు.

**వి.వి.యల్. నరసింహారావు** - ప్రచురణ విభాగం, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

**ఆర్వీయస్ సుందరం** - తెలుగు విభాగం, కన్నడ అధ్యయన కేంద్రం, మైసూరు విశ్వవిద్యాలయం, మైసూరు.

**ఎల్లోరా** - పాత్రికేయుడు, హైదరాబాదు.

**దేవరాజు మహారాజు** - జంతుశాస్త్ర శాఖ, న్యూసైన్సు కాలేజి, నారాయణగూడ, హైదరాబాదు.

# మా మాట

ఆంధ్ర సారస్వత పరిషత్తు నిర్వహిస్తున్న సాహిత్య కార్యక్రమాల్లో **'సారస్వత వేదిక'** ఒకటి. ఈ వేదిక పక్షాన ప్రతినెలా మొదటి ఆదివారం సాహిత్య సమావేశం జరుగుతుంది. ఈ కార్యక్రమంలో ఆ సంవత్సరానికి ఎన్నుకున్న ప్రధాన విషయానికి సంబంధించిన పన్నెండు అంశాలపై ఆయా రంగాలలో నిష్ణాతులైన విద్వాంసులచే పన్నెండు ఉపన్యాసాలు ఏర్పాటు చేయడం జరుగుతుంది. ప్రధానవక్త ఉపన్యాసం తరువాత చర్చ సాగుతుంది.

సారస్వత వేదిక '1984-85' సంవత్సరంలో జానపద సాహిత్యాన్ని ప్రధానవిషయంగా తీసుకొని పన్నెండు ఉపన్యాసాలు ఏర్పాటు చేసింది. జానపద సాహిత్యంలో విశేష కృషిచేసిన విద్వాంసులు ఈ ఉపన్యాసాలు చేసినారు. ఆ ఉపన్యాసాల సంపుటియే ఈ గ్రంథం.

సారస్వత వేదిక నిర్వహించిన కార్యక్రమాల్లో పాల్గొని, ప్రసంగించి తమ వ్యాసాలను ఈ సంపుటిరూపంలో వెలువరించడానికి సహకరించిన విద్వాంసులకు పరిషత్తు పక్షాన కృతజ్ఞతలు.

ఈ గ్రంథాన్ని ముద్రించడానికి యథోచితంగా ఆర్థిక సాహాయ్యం అందించి తోడ్పడిన తెలుగు విశ్వవిద్యాలయంవారికి సారస్వత పరిషత్తు పక్షాన కృతజ్ఞతలు.

'సారస్వతవేదిక' కార్యక్రమాలను నిర్విఘ్నంగా, సమర్థంగా నిర్వహించిన ఆచార్య కే. కే. రంగనాథాచార్యులుగారికి కృతజ్ఞతలు.

**ఆర్. శ్రీహరి**
కార్యదర్శి
ఆంధ్ర సారస్వత పరిషత్తు

## సంపాదకీయ వ్యాసం

# తెలుగు జనసాహితి

—కె. కె. రంగనాథాచార్యులు

ఒకవైపు ఆధునిక వైజ్ఞానిక యుగంలో జానపద సాహిత్యానికి కాలం చెల్లిందని కొందరు భావిస్తుంటే, మరోవైపు ఆ రంగంలో జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో విస్తృతంగా పరిశోధనలు సాగుతున్నాయి. రోజురోజుకీ జానపద సాహిత్య పరిశోధన మరింత ప్రాధాన్యతను సంతరించుకుంటున్నది. జానపద విజ్ఞానానికి, సాహిత్యానికి కొత్త నిర్వచనాలు ఏర్పడుతున్నాయి. కొత్త అర్థాలు వెలువడుతున్నాయి. మానవ విజ్ఞానశాస్త్రం, సమాజ శాస్త్రాల పరిధిలో జానపద విజ్ఞాన పరిశోధన కొత్త దృక్కోణాలతో ముందుకు సాగుతున్నది. ఆధునిక నాగరికత, ముద్రణ అనేకరకాల లిఖిత సాహిత్య ప్రక్రియల వ్యాప్తి, వికాసాలకు కారణం అవుతున్నా, కొత్త రూపాలలో జానపద సాహిత్యమూ వస్తున్నది. సమాజంలో వచ్చిన మార్పులను కలుపుకుంటూ అది ఆశువుగా ప్రవహిస్తూనే ఉంది. భాష, భాషేతర రూపాలలో కనిపించే జానపద కళలలో జానపదుల వస్తు సంస్కృతి, భౌతిక జీవనం, తత్త్వం, విశ్వాసాలు, న్యాయం, చట్టం, వైద్యం మొదలైన అంశాలన్నీ కలిసిపోయి ఉన్నాయి. ఈ అంశాలనన్నిటినీ సూచిస్తూనే జానపద సంపదకు జానపద విజ్ఞానం అన్న పేరు వాడుకలోకి వచ్చింది. ఇది ఇంగ్లీషులో Folklore కి సమానంగా తెలుగులో వాడుతున్న పదబంధం. Folklore అన్నది ఇంగ్లీషులో కూడా చాలా ఇటీవల వాడుకలోకి వచ్చిన పదం. 1846 లో మొదటిసారిగా విలియం థాంస్ అనే బ్రిటిష్ విద్వాంసుడు ఈ పదాన్ని ఉపయోగించాడు. తరువాత ఆ పదం వ్యాప్తిలోకివచ్చి ఆ రంగంలో విస్తృతమైన పరిశోధనలు జరిగాయి. అంతకుముందే పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభ దశలోనే ప్రసిద్ధ జర్మన్ చారిత్రక, తులనాత్మక భాషా శాస్త్రజ్ఞుడు జాకబ్ గ్రిమ్ జర్మన్ పురాశాస్త్రం మీద చేసిన పరిశోధనలు జానపద విజ్ఞాన పరిశోధనకు నాంది పలికాయి. జానపద పరిజ్ఞానం చరిత్ర పూర్వదశనుండి

కొనసాగుతున్నదే అయినా దాన్నొక ప్రత్యేక అధ్యయన రంగంగా స్వీకరించడం సుమారు నూటనలభై సంవత్సరాల క్రితం మాత్రమే ప్రారంభమైంది. భాష, సాహిత్యం, నృత్యం, సంగీతం, మతం, విశ్వాసాలు, ఆచారాలు, వేషభూషలు, గృహ నిర్మాణం, ఇతర మానవావసరాలైన వృత్తిపనులు, క్రతు గీతాలు, వివాహాది కర్మకాండల సందర్భంలో పాడే పాటలతోపాటు పురాణ గాథలు, అద్భుత కథలు, వీరగాథలు, ఐతిహ్యాలు, ఇతర రకాలైన గేయాలు, మౌఖికంగా తరతరాలుగా సంక్రమించిన సామెతలు, పొడుపు కథలు, జానపద విజ్ఞానంలో భాగంగా పరిశోధన విషయాలుగా విస్తరిస్తున్నాయి. ప్రస్తుతం మన అధ్యయనం సాహిత్యంలో భాగంగా మౌఖిక వాగ్రూపకళ అయిన సాహిత్యానికి మాత్రమే పరిమితం.

జానపద సాహిత్యాన్ని అందులో భాగమైన వివిధ ప్రక్రియలను ఉత్పత్తి, అభివృద్ధి, వికాస, విస్తరణ, పరిణామ రూపాలలో అధ్యయనం చేసే పద్ధతులింకా తెలుగులో అభివృద్ధి చెందలేదు. ప్రక్రియాపరంగా గేయ గాథలు, వీరగాథలు, సామెతలు, పొడుపు కథలు, వర్గపరంగా స్త్రీల పాటలు, శ్రామిక గేయాలు, పిల్లల పాటలు వస్తుపరంగా రామాయణ, భారతాది పౌరాణిక గీతాలు, విషయ పరంగా శృంగార, భక్తి, కరుణరసగీతాలు అని స్థూలమైన, కలగాపులగమైన విభజనతో తెలుగు జానపద సాహిత్య పరిశోధనలు జరుగుతున్నాయి. సమగ్ర సమన్విత రూపంలో, చారిత్రక దృష్టితో జానపద సాహిత్యాన్ని అధ్యయనంచేయటం ఇంకా మొదలు కావలసి ఉంది. అలాంటి అధ్యయనం జానపదసాహిత్యం ప్రాధాన్యతను మరింత తేటపరుస్తుంది. కాలక్రమరీత్యా జానపద సాహిత్యాన్ని అధ్యయనం చేసి సమాజంలో వస్తున్న మార్పుల్ని అది ప్రతిఫలించిన తీరుని వింగడించడం జానపద సాహిత్య పరిశోధనలో ముఖ్యమైన అంశం. ఫోక్ అన్నదానికి క్రమంగా అర్థాలు మారుతున్నాయి. ఆధునిక యుగంలో కూడా ఒకే రకమైన శ్రమ, భాష, జీవితం, అలవాట్లు, అనుభవాలు, భావాలు ఉన్న ఏ గుంపునైనా 'ఫోక్' పదంతో వ్యవహరించడం ప్రారంభం అయింది. జనపదాలలో ఉండేవారు జానపదులు అన్న అర్థం నుంచి నగర జనపదులను కూడా ఆ పదం గుర్తిస్తున్నది. పారిశ్రామిక యుగంలో రైల్వే మొదలైన ప్రయాణ సాధనాల రంగాలలో, ఫ్యాక్టరీలలో, ఇతర పరిశ్రమలకు సంబంధించిన రంగాలలో పనిచేసే శ్రామిక జనసముదాయాలను కూడా జానపదులుగా, వారిపాటలను జానపద సాహిత్యంగా గుర్తిం

చడం జరుగుతున్నది. క్వారీ పనివాళ్ళు, రోడ్డు పనివాళ్ళు, గాంగోళ్ళు, వేరే ప్రాంతాలలో పనులకోసం వలసవెళ్ళేవాళ్ళు పాడుకొనే పాటలన్నీ జానపద సాహిత్యం పరిధిలోకి వస్తున్నాయి. జానపద సాహిత్యం, కళారూపాలు ఇంకా కొనసాగుతున్నందువల్లనే సామాజిక, రాజకీయోద్యమాలు జనంలోకి చొచ్చుకొని వెళ్ళటానికి వీటిని సాధనాలుగా గ్రహించటం జరుగుతున్నది. ఎన్నికలు మొదలు కొని రామజన్మ భూమి ప్రచారం వరకు జానపద సాహిత్యరూపాలను ఉప యోగించుకొనడం చూస్తూనే ఉన్నాం. క్రైస్తవ మత సంస్థలు వయోజన విద్యా ప్రచారం మొదలైనవాటికిని జానపద కళారూపాలను ఉపయోగించడం చూస్తున్నాం.

వాణిజ్య ప్రకటనలకు కూడా జానపద సాహిత్యరూపాలు సాధనం అవు తున్నాయి.

ఆధునికకాలంలో కూడా జనాన్ని కదిలించిన ప్రతి సమస్యా, సన్నివేశం, సంఘటనా జానపద సాహిత్యానికి వస్తువు అవుతున్నది. వైజ్ఞానిక పరిశోధనల ఫలితమైన ప్రతి భౌతిక సృష్టి, సమాజంపైన దాని ప్రభావమూ జానపదసాహిత్య వస్తువు అవుతున్నది. విభిన్నచారిత్రక దశలలో, వివిధ సామాజిక వ్యవస్థల ననుసరించి ఏర్పడుతున్న వర్గాలు, ముఖ్యంగా కిందివర్గాలవాళ్ళు కొత్త వ్యవస్థలో జీవన విధానాన్ని అనుసరించి మారుతున్న అనుభవాలను సామూహికంగాను, వ్యక్తిగతంగాను గీతాల రూపంలో అభివ్యక్తం చేస్తూనే ఉన్నారు. ఈ రూపంతో జానపదసాహిత్యం మనసు మార్చుకొని, రూపు మార్చుకొని కొత్త పద్ధతులలో సజీవంగా ప్రవహిస్తూనే ఉంది. పాత నీరుపోయి, కొత్త నీరు వస్తున్నా గోదావరి గోదావరే.సామూహిక సృజన, మౌఖిక ప్రసారం జానపద సాహిత్య లక్షణాలయితే అలాంటి సాహిత్యం ఇంకా కొనసాగుతూనే ఉంది. వ్యావసాయిక ఉత్పత్తి, ఉమ్మడి కుటుంబాలు, భూస్వామ్య సంస్కృతికి సంబంధించిన సమాజంలో ప్రధాన ఉత్పత్తి వర్గమైన రైతుల సాహిత్యమే ఇప్పటివరకు తెలుగులో జానపద సాహిత్య అధ్యయన విషయంగా ఉంటూ వస్తున్నది. కొత్త వ్యవస్థతో పాటు వస్తున్న కొత్త జానపద సాహిత్యంవైపు ఇంకా దృష్టి ప్రసరించలేదు. కర్షకులే కాక పారిశ్రామిక శ్రామిక వర్గం కూడ ఈ రోజున జానపద సాహిత్య వస్తువే. స్థానిక జాతులు, తెగలు వెనుకబడి క్షీణించిపోయి, వివిధ దేశాలనుంచి వలస వచ్చి స్థిరపడిన ప్రజలతో నిర్మితమైన అమెరికా సంయుక్తరాష్ట్రాలకు ప్రాచీన

చారిత్రక దశలు లేవు. దాని చరిత్ర అంతా ఆధునికమే. ఈనాడక్కడ మరుగు దొడ్డి రాతలు, గోడలమీద రాతలను కూడా లిఖిత రూపంలో ఉన్నా Folk literature పేరుతో అధ్యయనం చేయడం జరుగుతున్నది. కాని విభిన్న చారిత్రక దశలు విభిన్న సామాజిక వ్యవస్థల రూపంలో సుదీర్ఘచరిత్ర కలిగిన భారతదేశంలాంటి దేశాలలో జానపద సాహిత్యానికి ప్రత్యేకమైన స్వభావం ఉంది. విభిన్న దశల ననుసరించి భేదక లక్షణాలతోపాటు కొనసాగింపు లక్షణాలు కూడా ఉన్నాయి. లిఖిత సాహిత్య రూపాలను ఆశువుగా అందించినంత మాత్రాన వాటికి జానపద సాహిత్య స్వభావం ఉంటుందని చెప్పటం కష్టమే. అవధానాల రూపంలో వచ్చిన ఆశుకవిత్వాన్ని జానపద సాహిత్యం అనలేం. అట్లాగే ముద్రణ పొందినంతమాత్రాన పుట్టుకలో, ప్రసారంలో ఉండే ప్రత్యేక లక్షణాలనుబట్టి జానపదసాహిత్యం జానపద సాహిత్యం కాకుండాపోదు. జానపద సాహిత్య ధోరణులను లిఖితసాహిత్యానికి దగ్గరగా తీసుకొని వచ్చిన పదకవులు, భక్తకవులు ఉన్నారు.ఆ సాహిత్యాన్ని, దానికి చారిత్రక కారణాలను ప్రత్యేకంగా అధ్యయనం చేయవలసి ఉంది.వర్గ విభక్తమైవిభిన్నచారిత్రక దశలకు సంబంధించిన ఏ సామాజిక వ్యవస్థలోనైనా జనపదాలు, నగరాలు అన్న భేదం లేకుండా కింది తరగతి జనం నుంచి సామూహిక సృష్టిగా మౌలికంగా ప్రసారం పొంది కొనసాగుతున్న సాహిత్యాన్ని ఇక ముందు జన సాహిత్యం అని వ్యవహరించవచ్చు.

మానవ సమాజ పరిణామాన్ని, నాగరికతా వికాసాన్ని గమనించిన పరిశోధకులు మానవ జాతి పరిణామంలో విభిన్న దశలను గుర్తించారు. మానవ జీవితం ఆహార సేకరణమీద ఆధారపడ్డ ఆదిమ దశ, ఆహార ఉత్పత్తి, పశువుల పెంపకానికి సంబంధించిన ఆర్థిక ఆదిమ దశ, శ్రమ జీవులు, వారి అదనపు ఉత్పత్తి మీద ఆధారపడ్డ విశ్రాంతి వర్గం- అని రెండు వర్గాలుగా చీలిన తొలి వర్గ విభక్త సమాజం, పొలాలకు బందీలై భూమి ఆధారంగా ఉత్పత్తి చేసే రైతులు, భూస్వాములు వర్గాలుగా ఏర్పడిన భూస్వామ్య దశ, పరిశ్రమలు, వర్తక వాణిజ్యాలు విస్తరించిన పెట్టుబడిదారీ దశ- విభిన్న చారిత్రక దశలకు సంబంధించిన మానవ సామాజిక వ్యవస్థలు. ఈ సామాజిక పరిణామ క్రమంలో ఆదిమ సమాజం సామూహిక సృష్టిగా ప్రారంభమైన సహకార కళ వర్గ విభక్త సమాజాలలో వ్యక్తి నిష్ఠ కళలుగా, వర్గ కళలుగా

స్వతంత్ర ప్రతిపత్తి గల కళా రూపాలుగా ఆధునిక యుగం నాటికి పరిణామం చెందాయి. ఆదిమ సమాజం అతి సరళం. వర్గరహితం. ఆదిమ మానవుడు ఒంటరిగా పనిచేయలేదు. కలిసి పని చేశాడు. కలిసి శ్రమించాడు. కలిసి ఆహారసేకరణలో ఉత్పత్తిలో పాల్గొన్నాడు. అవసరానికి ఉత్పత్తి, సమానంగా పంపిణీ ఆదిమయుగస్వభావం. ఆదిమయుగంలో సామూహిక సౌందర్య సృష్టిగా, సమిష్టికృషిగా ఆదిమకళ ప్రారంభమైంది. ఆనాటి సమాజం, చరిత్ర, చట్టం, ధర్మం, నీతి, మాయ ఉత్పత్తి కార్యక్రమంతోపాటు లయాత్మక భాషలో ప్రతిఫలించాయి. శుద్ధకళగాని, కవిత్వంగాని ఆరోజు లేవు. ఆధునిక కాలంలో లాగ విభిన్నకళలు స్వతంత్ర ప్రతిపత్తిగల రంగాలుకావు. అవి విశిష్ట వ్యక్తుల సృష్టికావు. అది సమిష్టి నిర్మాణం. అది వారి ఉత్పత్తిలో, జీవన విధానంలో, జీవితానుభవంలో భాగం. అక్కడ వర్గాలులేవు. వర్గ అనుభవాలులేవు, అనుభూతులు లేవు. సామూహిక జీవనం, సహకారం, సామూహిక ఉత్పత్తి కార్యక్రమం, సామూహిక అనుభవాలు, సామూహిక కళాసృజనమాత్రమే ఉన్నాయి. కళ జీవితం కంటే భిన్నమైనదన్న భావనకూడా వారిలో లేదు. ఆదిమానవుడి జీవితానికి, శ్రమకు, కళకు సంబంధం ఉంది. వర్గవిభక్త సమాజంలో విశ్రాంతి వర్గకళలు వ్యక్తి నిష్ఠమైన కళలుగా రూపొందాయి. ఉన్నత వర్గంలో శ్రమకు, కళాసృష్టికి ఏమాత్రం సంబంధంలేదు. ఆదిమ సమాజపు కళలలో ఆనాటి భౌతిక జీవనం ప్రతిఫలిస్తుంది. అమూర్త మతభావాలు, తాత్విక భావాలు వాటిల్లో కనిపించవు. ప్రకృతిని అనుకరించే రూపంలో మాయ (magic) ఆదిమ కళలో ప్రధానమైన అంశం. ఉత్పత్తిక్రమంలో భాగంగా ఉత్పత్తికి కారణమైన ప్రకృతిని అదుపులో పెట్టుకోవచ్చుననే భావన, నిజంగా అదుపులో పెట్టామనే భ్రమ, విశ్వాసమే మాయ. ప్రకృతిని, మేఘాలను, వర్షాన్ని సామూహిక నాట్య రూపంలో అనుకరించటమే మాయ. ఈ అనుకరణలోంచే కళారూపాలువచ్చాయి. అది ఆట, మాట, పాటల సమిష్టిరూపం. పనిముట్లను తయారు చేసుకొనే క్రమంలో మానవుడికి సౌందర్యదృష్టి పెరిగింది. పనిముట్లను ఉపయోగించడంలో, శ్రమపడేటప్పుడు అవయవచలనంలోను, ఉచ్ఛ్వాసనిశ్వాసాల క్రమపద్ధతిలోను లయ పుట్టింది. అందువల్లే ఆదిమసమాజంలో శుద్ధసంగీతం, శుద్ధకవిత్వం, శుద్ధనాట్యం, శుద్ధవాద్యసమ్మేళనం అంటూ లేవు. సమిష్టి జీవితంలాగే సమిష్టి కళే ఉండేది. వర్గవిభక్తసమాజాల క్రమంతోపాటు కవిత్వం, సంగీతం, నృత్యం,

వాద్యసమ్మేళనం, భిన్నమైన స్వతంత్రప్రతిపత్తి కళలుగా విడిపోయాయి. విశ్రాంతివర్గ సాహిత్యంతోపాటు శ్రమచేసే సామాన్యుల సాహిత్యం కూడా వేరు పాయగా కొనసాగింది. సామాజికవ్యవస్థల పరిణామక్రమంతోపాటు పురాణాలు, వీరగాథలు వంటి కథనాత్మక సాహిత్యం తరువాత కాల్పనిక కవిత్వం వచ్చాయి. జంత్రవాద్యాలతోపాటు బృందగానం - గాత్రం, వంతకలిసి వందిమాగధులు పాడిన పాటలు బృందగానం - వంత, సహవాద్యం పోయి - ఒక వ్యక్తి చదివే కేవల కవిత్వంగా మారినవే పురాణాలు. భారతదేశంలో వందిమాగధులు పాడుతుండిన వంశక్రమాలు, స్తోత్రాలు బ్రాహ్మణుల చేతిలో లేఖనబద్ధమై సృష్టిక్రమం మొదలు వంశక్రమాల వరకు ఉండే పురాణాలుగా రూపొందాయి. సమాజం వర్గాలుగా విభజన చెందడంతోపాటు భిన్న చారిత్రక దశలలో భిన్న కళారూపాలు స్వతంత్ర ప్రతిపత్తి గల కళలుగా స్థిరపడ్డాయి. ప్రారంభంలో క్రతుకర్మతో భాగమైన జన సాహిత్యం క్రమంగా క్రతుకర్మల నుండి విడిపోయి స్వతంత్ర ప్రక్రియగా కొనసాగింది. ముద్రణ సౌకర్యం పెరిగిన ఆధునిక కాలంలో ఉన్నత వర్గానికి చెందిన అనేక సాహిత్య ప్రక్రియలు వెలిశాయి. శ్రమ విభజనలాగే సాహిత్యం కూడా పై, కింది వర్గాల సాహిత్యంగా విడిపోయింది. కింది వర్గాలవారి సాహిత్యమే జన సాహిత్యం. జన సాహిత్యాన్ని విభిన్న సామాజిక వ్యవస్థలలో మార్పు పొందిన రూపంలో అధ్యయనం చేయటం చాలా ఆసక్తికరమైన విషయం. అంతేకాదు; ఒకప్పటి మౌఖిక సాహిత్య రూపాలే ఆనాటి కాలంలో ఉన్నత వర్గ సాహిత్య రూపాలుగా రూపొందుతాయి. అయినా మౌఖిక రూపంలో జన సాహిత్యం వర్గాలుగా సమాజం విభజన చెంది ఉన్నంత వరకు కొనసాగుతూనే ఉంటుంది. విభిన్న చారిత్రక దశలతో, సామాజిక వ్యవస్థలతో సంబంధం లేకుండా జన సాహిత్యం అంటే కింది వర్గాల సాహిత్యంగానే గ్రహించాలి.

జన సాహిత్యానికి వెసులుబాటు ముఖ్య లక్షణం. స్వచ్ఛమైన జాతీయ సంపద, సంప్రదాయం జన సాహిత్యం. అది అధిక సంఖ్యాకులకు సంబంధించింది కూడా. సమాజంలోను, సాహిత్యంలోను ఉన్నత వర్గ సంప్రదాయం మార్పును నిరోధించే ప్రయత్నం చేస్తుంది. జన సంప్రదాయ సాహిత్యం మార్పుల్ని కలుపుకుపోతుంది. సామూహికమైన కొత్త అనుభవాలు సాహిత్య విభాగాలలో కొత్త పంక్తుల్ని చేరుస్తాయి. పాతవాటిని కొన్నిటిని వదలిపెడతాయి.

మౌఖిక ప్రసారం, విస్తృత ప్రసరణ, మార్పు జనసాహిత్యం ముఖ్య లక్షణాలు: భూస్వామ్య సమాజంలోను, పెట్టుబడిదారీ సమాజంలోను జనసాహిత్యం వస్తువులోను, రూపంలోను మార్పులు పొందింది. రాట్నాలు, మగ్గాలుపోయి మిల్లులు రావడంతో పాటు శ్రమ స్వరూపం, ఉత్పత్తి విధానం మారినప్పుడు జనసాహిత్యంలో కూడా మార్పులు వచ్చాయి.

ఆదిమ సమాజంలో భాగమైన ఆచారాలు, విశ్వాసాలు వాస్తవంనుండి పుట్టినవే. ఆ మాటకువస్తే జనసాహిత్యానికి వాస్తవమే పునాది. ఆదిమ సమాజంలో ఉత్పత్తి సందర్భంగా వచ్చిన మాయ, క్రతువిధానం, ఉత్పత్తి విధానం అభివృద్ధి చెంది పునాది మారిపోయినా ఆచారాలుగా మిగులుతాయి. ఆ ఆచారాలకు కారణాలు చెప్పలేనప్పుడు కల్పించుకున్న కారణాలే విశ్వాసాలు. ఆదిమ దశలో ప్రకృతిలో సూర్యుడు, వర్షం, గాలి, సృష్టి, మరణం మొదలైన వాటిని గురించి మానవుడు చేసుకున్న ఊహలు కూడా తరువాతి దశలో విశ్వాసాలుగా మారి స్థిరపడతాయి. ప్రజలలో నేటికీ కనిపించే విశ్వాసాలకు మూలాలు ఆదిమదశ మొదలుకొని అనేక సామాజిక పరిణామ దశలలో కూడా కనిపిస్తాయి.

జనసాహిత్యంలో స్త్రీకి ప్రాధాన్యం ఉంది, మాతృస్వామ్య సంస్కృతి ప్రతిఫలనం కొనసాగింపుగా ఇది కనిపిస్తుంది. ఆదిమ సంస్కృతిలో స్త్రీ ఉత్పత్తికి ప్రతీక. అందువల్లనే జన సాహిత్యంలో చాలా భాగం స్త్రీ ప్రధాన వస్తువుగా కనిపిస్తుంది. పురాణగాథలు, పౌరాణిక కథలు స్త్రీల దృష్ట్యా జన సాహిత్యంలో మార్పులు పొందాయి భూస్వామ్య వ్యవస్థలో కుటుంబ జీవనం మొదలైన వాటిలో స్త్రీల సుఖదుఃఖాలు జన సాహిత్యంలో ప్రధాన వస్తువుగా కనిపిస్తాయి. ఒకప్పటి జన సాహిత్యంలో స్త్రీ, పురుష సంబంధాలలో విధి, నిషేధాలు ఇప్పుడున్నంత కచ్చితంగా కనిపించవు. మగడికి తెలియకుండా స్త్రీ ప్రియులను కలుసుకొనే శృంగార కథలెన్నో జన సాహిత్యంలో విరివిగా కనిపిస్తాయి. గాథా సప్తశతిలోని గాథలలో ఇలాంటి సంఘటనల వర్ణన ఎక్కువ. ఆధునిక యుగ సాహిత్యంలో స్త్రీ, పురుష సంబంధాలలో నైతిక బోధలకు సంబంధించిన అంశాలు చోటు చేసుకుంటాయి. సామాజిక సంబంధాలలో వచ్చిన మార్పులు ఆధారంగా విలువలలో కూడా వచ్చిన మార్పులను ఇది సూచిస్తుంది. పాత సమాజాలలో పీడన, పోరాటాలు ఉన్నా అవి జన సాహిత్యంలో

వస్తువులుగా కనిపించవు. ఆధునిక కాలంనాటి జన సాహిత్యంలో పీడన, పోరాటాలు కూడా ప్రధాన వస్తువులుగా కనిపిస్తాయి. ఉద్యమాలకు దోపిడిని, పీడనను చిత్రించే సాహిత్యం ఊపిరి పోస్తున్నది. చారిత్రక పరిస్థితులు జన సాహిత్యం పరిణామాన్ని, దిశను సూచిస్తాయి. దేశచరిత్రలోలాగా జనసాహిత్యం విషయంలో వ్యక్తుల పేర్లు, తారీఖులు స్పష్టంగా తెలియవు. అయినా జనసాహిత్యం సామాజిక స్వరూపంలో వచ్చే మార్పులను స్పష్టపరుస్తుంది. వివిధ సామాజిక రూపాలైన వివాహం, కుటుంబ సంబంధాలు, మొత్తం ప్రజల అస్తిత్వానికి సంబంధించిన అంశాలలో వచ్చిన పరిణామాలన్నీ ఇందులో కనిపిస్తాయి. ఈ రూపంలో జనసాహిత్యం అధ్యయనం చారిత్రక అధ్యయనంకూడా అవుతుంది.

జనసాహిత్యంలోని వివిధ ప్రక్రియలనుకూడా చారిత్రక పద్ధతిలో అధ్యయనం చేయవచ్చు. కథనాత్మక ప్రక్రియలైన పురాణాలు, అద్భుత కథలు, జానపదకథలు, వీరగాథలు, ఐతిహ్యాలు, చారిత్రక గాథలు మొదలైన వాటి పరిణామక్రమాన్ని ఉత్పత్తి, వికాస, వ్యాప్తులను అధ్యయనం చేయవచ్చు. ఈ ప్రక్రియలు గేయరూపంలోను, వచనరూపంలోను కనిపిస్తాయి. దృశ్యకళలైన వీథి భాగవతాలు, తోలుబొమ్మలాటలు మొదలైనవాటి పరిణామంకూడా అధ్యయన విషయం కావాలి. పొడుపుకథలు, సామెతలు జీవనసారాన్ని, అనుభవ సారాన్ని పిండుకొని రూపొందిన జనసాహిత్యరూపాలు. వాటిని నేటికీ మన జీవితంలోని విభిన్న ప్రత్యేక పరిస్థితులలో ఉదాహరణలుగా ఉపయోగించు కుంటూనే ఉన్నాం. మన జీవితంలో ఎదుర్కొనే సంఘటనలకు, అనుభవాలకు ఇంతకుముందు సమాజాలలోని కొన్ని నమూనాలను అవి సూచిస్తాయి. పొడుపు కథలు, సామెతలు ఆయా దశలలోని ఆర్థిక, సామాజిక, కుటుంబ సంబంధాల నుంచి ఎలా పుట్టాయో అధ్యయనం చేయటం కూడా ఆసక్తికరమైన అంశం.

జన సాహిత్యంలోని ప్రతిప్రక్రియా ప్రత్యేక కాలంలో, ప్రత్యేక పరిస్థితు లలో ప్రత్యేక ప్రయోజనంకోసం పుట్టిఉండాలి. ఆదిమ దశనుండి ఇప్పటిదాకా భిన్న వాస్తవాల పర్యవసానంగానే భిన్న ప్రక్రియలు పుట్టి ఉంటాయి. పురాణా లను మానవజాతి బాల్యకాలంనాటి సృష్టి అంటారు. ఒకప్పటి ప్రజల ఆకాంక్ష లకు, ఆశయాలకు, జాతీయ భావాలకు ప్రతినిధిగా కనిపించే నాయకుడి జయాప జయాలు పురాణాలలో వస్తువు. పురాణాలతో పోల్చినప్పుడు అద్భుత గాథలు

తరువాత పుట్టి ఉంటాయి. మధ్య యుగంతోనే వాటి వికాసం ఆగిపోయి ఉండాలి. అద్భుత గాథలతో పోల్చినప్పుడు వీర గాథలు, వాటితో పోల్చినప్పుడు ఐతిహ్యాలు, చారిత్రక గాథలు మరింత అర్వాచీనాలు. కథనాత్మక ప్రక్రియలతో పోలిస్తే గేయాలు (Lyrics) మరింత అర్వాచీనాలు. వ్యక్తిగతమైన ఉద్రేకాలు, అనుభవాలు వీటిలో కనిపిస్తాయి. అర్వాచీనతకు ఇదొక ముఖ్య నిదర్శనం. ఆధునిక యుగంలో కూడా జనసాహిత్యం గేయరూపంలోనే ఎక్కువగా కనిపిస్తుంది. ఈ క్రమంలో జనసాహిత్య ప్రక్రియల ఉత్పత్తి వికాసాలను చారిత్రక, సామాజిక దశల నేపథ్యంలో పరిశీలించవలసిన అవసరం ఉంది. శిష్టసాహిత్య ప్రక్రియలకు జనసాహిత్య ప్రక్రియలతో ఉన్న పునాదిని గుర్తించవలసి ఉంది.

చివరగా మనం కలలుకంటున్న వర్గరహిత సమాజంలో జనసాహిత్యం ఉంటుందా? ఉంటే ఎలా ఉంటుంది అనేది ప్రశ్న. వ్లాదిమీర్ ప్రాప్ చెప్పిన మాటలలో దీనికి సమాధానం చూద్దాం. "It would seem that folklore, which is class phenomenon, should, disappear. However, literature is also class phenomenon, but it does not disappear. Under socialism, folklore loses its specific features as a product of lower strata, since in a socialist society there are neither upper nor lower strata, just the people. Folklore indeed becomes national property. What is not in harmony with the people dies out; what remains is subjected to profound qualitative changes and comes closer to literature."

(Theory and History of Folklore, P. 5)

# సంప్రదించిన గ్రంథాలు

Dundes, Alan (Ed.) 1965. The Study of Folklore. New Jersey : Prentice Hall.

Islam, Mazharul, 1985. Folklore the pulse of the people. New Delhi: Concept Publishing Company.

Propp, Vladimir, 1984. Theory and History of Folklore. (Translation : Ariadna Y. Martin and Richard P. Martin). Manchester University Press.

Thomson, George, 1954. Marxism and Poetry.

New Delhi : People's Publishing House.

Thomson, George, 1985. The Human Essence. Calcutta : New Book Centre.

గార్డన్ చైల్డ్ (తెలుగు అను.)1985. చరిత్రలో ఏం జరిగింది.(అను. వల్లంపాటి వెంకట సుబ్బయ్య) హైదరాబాదు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్.

# ఆదిమ కళగా కవిత్వం

—ఎ.బి.కె. ప్రసాద్

'ఆటా తీరె, పాటా తీరె, కోటలో రామరాజ్యం' అని మనవాళ్లు మాట వరసకు అన్నారేగాని ఆ రెండు అవసరాలు తీరడానికి మానవజాతి ఎన్ని మన్వంతరాలు, ఎన్నెన్ని యుగాలు క్రమించవలసివచ్చిందో, శ్రమించవలసి వచ్చిందో !! మానవకోటి తన ఉసురుకోసం వెచ్చించిన ప్రతి క్షణాన్ని ఒక కళగా భావించాలి, ప్రతి చెప్పపాటును ఒక గొప్ప ఆట పాటగా భావించాలి ! ఈ 'భూమి మీద పడ్డప్పటి' నుంచి మానవుడు తన ఉనికిని సమర్థించుకుంటూ తన రూపురేఖలు దిద్దుకోడానికి పడిన ప్రతి 'పాటూ' మనకు గగుర్పాటు కల్గించేదే. తను 'ఆడింది ఆట, పాడింది పాట'గావడానికి అతడు ఎన్ని వందల కోట్ల సంవత్సరాలు పరిసరాలనూ, జీవన పరిస్థితులనూ, ఎదుర్కొంటూ చక్కదిద్దు కుంటూ రావలసి వచ్చిందో ఒకసారి వెనుతిరిగి ప్రతి ఒక్కరూ ఆలోచించు కోండి. రెండు చేతులు కలిస్తేనే చప్పట్లు, రెండు కాళ్ళు కలిస్తేనే నడక మనిషికి మనిషి చేదోడుగా, వాదోడుగా ఉన్నప్పుడే వాక్కు కూడా 'వేదవాక్కు' అవు తుంది. వేదానికి తొలిరూపం వేదన. ప్రకృతిలో లభించే ముడిపదార్థాలు ఆసరాగా సమాజం అవసరాలకు ప్రారంభమైన ఉత్పత్తి, సామాజికులందరి సహకార ఫలం, సామూహిక శ్రమ ఫలితం. కనుకనే ఆ ఉత్పత్తి క్రమాన్ని అంటిపెట్టు కుని ఉన్న సంఘజీవుల మధ్య కళా సృష్టికూడా సామాజికుల సమష్టి సేద్యం ! గుంపులుగా, గుంపుచింపులుగా ఆహారం కోసం ప్రారంభించిన అన్వేషణ మొదట్లో సమష్టి ప్రయోజనం కోసం, ఆయా తెగల ప్రయోజనం కోసం, అంతేగాని ఆ అన్వేషణ ఒక వ్యక్తికోసమో, వ్యక్తిగత ప్రయోజనంకోసమో జరిగింది కాదు. అందులో భాగంగానే ప్రకృతి సిద్ధంగా రెడీమేడ్‌గా ఉన్న పండ్లు, కాయలు, ఆకూ అలమూ సేకరించడం—("Collection of the ready gifts of nature") ఆహారోత్పత్తి క్రమానికి ఆదిపరిణామంగా భావించవచ్చు. శ్రమ శక్తికి, ఆ శక్తిని ఇనుమడిస్తూ దానికి ప్రతిఫలంగా

ప్రతిఫలానందంగా ఆవిర్భవించిన మాటలకూ, ఆటపాటలకూ చిత్ర, నృత్య గానాది కళల సృష్టికీ మధ్య అవినాభావ సంబంధం కూడా ఈ సమాజ సంపద ఉత్పత్తి క్రమంతోనే ముడిపడి ఉందని గ్రహించాలి. సమాజ పరిణామక్రమాన్ని కొంతవరకైనా అర్థం చేసుకొనకపోతే 'వేదాలు అపౌరుషేయాల'ని, అవి మానవులు రాసినవి కావని, కూర్చినవి కావని చెబితే నమ్మినట్టుగానే-మానవ జాతి శ్రమశక్తికి ప్రత్యక్ష సాక్ష్యంగా మన కళ్లముందు ఆవిష్కరించుకుంటున్న నూతన విజ్ఞానశాస్త్ర, సాంకేతిక, రోదసి రంగాలలోని పరిశోధనా ఫలితాలను కూడా 'అపౌరుషేయా'లని భ్రమించే ప్రమాదం ఉంది! సామాజికుల సమష్టి శ్రమను-అది ఉత్పత్తికి చెందిన క్షేత్ర సృష్టి కానివ్వండి, కళా సృష్టి కానివ్వండి,ఆ శ్రమను కించపరచడాన్ని అనుమతించరాదు. ఈ మాట ఎందుకు చెప్పవలసి వస్తోందంటే 'వేదాన్ని' సర్వానికీ వేదంగా భావించే పెద్దలు కూడా ఆది కాలంలో వేదాలు 'ఒకే రాశిగా' ఉండేవనీ,అవి సమష్టి కృషి ఫలితమనీ గ్రహించక పోరు! ఆ రాశినుంచే ఋక్కు వచ్చింది, యజుస్సు వచ్చింది, ఇతర శాఖలూ వెలశాయి. 'వేదం' సామాజికుల సమష్టి సొత్తుగా అంగీకరించనొల్లని వారు మాత్రమే వేదాలకు మానవులు కర్తలు కారన్నారు. 'అపౌరుషేయాలు' అన్నారు. మంది సహకారపు విలువను మదింపు వేయలేని మందబుద్ధులు తమను తాము కుదించుకుని సమష్టిని కించపరచారు. ప్రతీ 'మంత్రం' వెనుక మానవుని తంత్రం ఉందని పరిశోధకులు నిగ్గు తేల్చుతున్నారు. యజుర్మంత్రాలకు అక్షరపాద నియమం లేదు, అంటే ఛందో నిబంధనా నియమం లేదని పండితులు భాష్యం చెబుతున్నప్పుడు దేశకవితలూ, పద సాహిత్యమూ, పల్లెపట్టుల జీవన సౌందర్యాన్ని, కష్టసుఖాలను తాళయుక్తంగా, రాగశుద్ధంగా, లయహితంగా, గానబద్ధంగా వెల్లడించే జానపదగేయాలను-కవిత్వంగానూ, ఉత్తమకళా సృష్టిగానూ ఎందుకు అంగీకరించలేరు ?

సామాజిక జీవనంలో మానవుల భౌతికావసరాలను తీర్చే వస్తూత్పత్తి, దాని క్రమమూ వారి వారి సాంఘిక, రాజకీయ, ఆర్థిక, మేధాపరమైన సంబంధాలను నిర్ధారణ చేస్తుంది. ఈ సూత్రీకరణను స్థూలంగా అంగీకరించగలవారు కవిత్వం ఆదిమ కళగా ఎలా ఆవిర్భవించి, సామాజికుల రాగద్వేషాలను ప్రభావితం చేయడంలో ఎంతటి కీలకపాత్ర వహిస్తూ వచ్చిందో అర్థం చేసుకో

గల్గుతారు. ఆహార సేకరణ క్రమంలో వేటాడి ఆహారంగా [illegible] పొందిన దశనుంచి, ఆహారోత్పత్తి దశకు ఎదిగి రావడంలో ఆదిమగణ 'సామాజికుల భాష, చిత్రలేఖనం, నృత్యగానాలు, ఆటపాటలు ఎంతటి పాత్ర వహించాయో స్థూలంగానైనా తెలుసుకోవడం అవసరం. కొందరు పురాతత్త్వ వేత్తలు చెప్పుకొనే 'ఆర్‌స్ప్రాచీ' (URSPRACHE = Root-Language) ఆధారభాష అంటూ ఈ మానవకోటికి ఉందోలేదో మనకు తెలియదు. కాని ఆధునిక నరుడయిన నియాండర్తల్ మానవుడుగానీ, అతనికంటే కొంచెం ప్రాచీనుడయిన 'హోమోహాబిలిస్'కానీ చేతిపనిముట్లుతయారు చేసుకోడంలో అప్పటికే అంతోఇంతో 'ఆరిందాం'య్యారంటే (Skilled Tool-makers) భావాల బట్వాడాకు బాదర బందీలేకుండా, నైపుణ్యంతో విని యోగించగల ఒక భాష అంటూ వారికి ఉండి ఉం డాలికదా? చివరికి తొలిమానవుడు క్రీస్తుపూర్వం 4004వ సంవత్సరం అక్టోబర్ 4న పుట్టాడని చెప్పడానికి సాహసించి పుట్టుపూర్వాల కాలపట్టికను తయారు చేసిన జేమ్స్ ఉషీరోకూడా మానవుని నోట తొలిమాట ఎప్పుడు పుట్టిందో, ఆ భాష ఏమిటో చెప్పలేకపోయాడు !! నిజానికి మనిషి భాష పుట్టుక, మట్టి కుండ పుట్టుక (Pottery) ఈ రెండింటి ఆధార చరిత్ర మానవుని పరిణామాన్ని అర్థంచేసుకో డానికి తోడ్పడుతుందంటారు. ఈ విషయం ఆఫ్రికాలోని 'బంటూ' తెగల బంటూ భాష పుట్టుపూర్వాలు పరిశోధించిన తర్వాత డి. డబ్ల్యూ. ఫిలిప్సన్ తేల్చాడు. జీవశాస్త్ర రీత్యా మానవునిలో కలిగే మార్పులకు, భాషలో జరిగే మార్పులకూ, కొంత సామ్యం ఉందని మానుషశాస్త్రవేత్తలు, భాషాశాస్త్రవేత్తలూ భావిస్తున్నారు. జీవశాస్త్రం ప్రకారం, జన్య సంబంధమైన అనువంశిక లక్షణాలు తల్లిదండ్రుల నుంచి ఏకాఏకిన వాళ్ళ సంతానానికి బట్వాడా అవుతాయి. కాగా భాషాలక్షణాలు, ఉచ్చారణ పద్ధతి ఇంట్లో పెద్దవాళ్ళు ఉచ్చరించే తీరునుబట్టి, మాటల తీరునుబట్టి, తరతరాల అలవాట్ల ప్రకారం సంక్రమిస్తూ ఉంటాయి. అలాగే జన్యుసంబంధ మైన కొన్ని స్వతస్సిద్ధమైన అనువంశిక లక్షణాలవల్ల (జినెటిక్ ఫెసిలిటేషన్) మానవుడు శక్తివంతంగా సహజంగానే మాట్లాడడం నేర్చుకొన్నాడు. కాని అదే లెక్కన విద్యకు వచ్చేసరికి (రాతకోతలు) మళ్ళీ జన్య లక్షణాల ప్రభావం కన్పించదు! ఆమాటకొస్తే పెక్కు సమాజాలకు లిఖిత సంస్కారంగల భాషలు లేవు. కొన్నిచోట్ల అక్షరజ్ఞానం ఉన్న సమాజాలలో కూడా చదవలేని, రాయలేని వాళ్ళు పెక్కుమంది ఉన్నారు! వాటికి సాంఘిక కారణాలు, ఇతర కారణాలు

ఉండొచ్చు. లేఖన సంస్కారం వచ్చింది కొన్ని వేల సంవత్సరాలనాడే నని తేల్చారు. వినిపించే మాటల ధ్వనులు చాలా తొందర్లో అంతర్ధానమైపోతూంటాయి. బహుశా అందుకనే కవి టి. ఎస్. ఇలియట్ మాటల గురించి వాటి కదలికల గురించి అందంగా వర్ణించాడు: "పదాలు పురివిప్పుతాయి, సంగీతం కాలంతో కదులుతుంది. బతుకు సాగిసాగి తనువు చాలిస్తుంది! మాటలు, శబ్దంలో నుంచి నిశ్శబ్దంలోకి జారిపోతాయి".*

అయితే ఆ భాష ఏదో అది ఎప్పుడు ప్రారంభమయిందో, మనకు తెలియదు గాని– అది ప్రారంభించిన తరువాత వచ్చిన పరిణామాన్ని కార్లటన్‌కూన్ ఇలా వర్ణించాడు :

"Once our Ancestors had begun hunting, speech was necessary. A hunter needs weapons. Weapons must be made with tools, tools have to be made, and tool-making must be taught. Beyond a certain level of technical skill, teaching requires language. Hunting also requires planning, and planning calls for speech elaborate enough to permit a group of men to talk over, in the evening, what they intend to do the next day."

—("The origin of Races" :<br>
Quoted by **Roy** A. Gallant :<br>
"Man must Speak" : p. 77)

---

* "Words move, music moves only in time<br>
But that which is living can only die<br>
Words, after speech reach into silence."

—Eliot.

అంటే ఇప్పటికి సుమారు అయిదు లక్షల ఏళ్ళ క్రితం (ప్లిస్టోసీనీ పీరియడ్) జావా, పీకింగ్, నియాండర్తల్ మానవులకు ఈ సామూహిక సద్వర్తన, ధారాళంగా భావాలను బట్వాడా చేసుకోవడం సాధ్యపడిందన్న మాట! ఆదిమ మానవుడు ఆహార సేకరణ కోసం జరిపిన వేటలో భాగంగానే తాను వేటాడిన జంతువుల దృశ్యాలను అతడు గుహాముఖాల్లో చిత్రించాడు, ఆనందించాడు, గర్వించాడు. ఇరవై వేల సంవత్సరాల క్రితం వేట దృశ్యాలకు అద్దంపట్టిన ఇలాంటి గుహా ముఖాలు ఫ్రాన్స్, స్పెయిన్, ఇటలీలలో ఉన్నట్లు కనిపెట్టారు. ఆ మాటకువస్తే మొహంజుదారో, హరప్పా శిథిల దృశ్యాలు కూడా నగర కట్టడాలలో సామూహిక కళా సృష్టినీ, ఆ సృష్టి సౌందర్యాన్ని చాటుకున్నాయే గాని కేవలం వ్యష్టి ప్రయోజనాన్ని చాటడం లేదు.

ఆదిమ మానవునికి 'వేట' అంటే మృగయా వినోదంగా మనం అర్థం చేసుకోరాదు. 'పూట బత్తెం పుల్ల వెలుగు'గా ఉండే ఆదిమ మానవునికి ఆహార సంపాదనలో భాగమైన 'వేట' అవసరమూ, ఆవశ్యకమైన తృప్తి మాత్రమేగాని అతనికి అదొక కేవల వినోదంగా భావించరాదు. అంటే ఆదిమ మానవునికి ఆటగానీ, వేటగానీ, విధిగా తన ఉనికికీ, తనవారి ప్రయోజనానికీ ఉద్దేశించిన కార్యకలాపం అవసరంగానే ఉందన్న మాట. దీనినే సామాజిక శాస్త్రవేత్తలు 'యుటిలిటేరియన్ ఏక్టివిటీ' అన్నారు. శ్రమ శక్తి, వినోదం, కళ - ఈ మూడింటి మధ్య సంబంధం గురించి ముచ్చటిస్తూ జి.వి. ప్లెఖనోవ్ అంటాడు :

> "At the stage of development of the lower hunting tribes, hunting and war are essential activities for the maintainance of the hunter's existence and for his self-defence. Both the one and the other pursue perfectly definite Utilitarian aims... Moreover, experts on the life of the savage say that he never hunts for the sake of pleasure alone."
>
> —("Art and Social life". PLEKHA NOV : p. 85)

ఆదిమానవుడు వ్యవసాయం చేపట్టేనాటికే కవితా కళకు కంకణం కట్టాడా? ఇది చిత్రమైన ప్రశ్నే. ఎందువల్లనంటే సుప్రసిద్ధ భాషావేత్త గాలంట్ పరిశోధనలను బట్టి మొట్టమొదటగా లిపికి ఆద్యులు సుమేరియన్లు అని ఒప్పుకున్నప్పటికీ 'తొలి రచయితలు మాత్రం చిఠా అవర్జాదార్లూ, బుక్‌కీపర్లూ, శిస్తు వసూలుదారులు (టాక్స్ కలెక్టర్స్)' అని బోధపడుతుంది గాలంట్ మాటల్లోనే చెప్పాలంటే : "When men learned to work on the land and settled in large communities, they had a need to write. They became property owners and traders of goods. Records had to be kept, taxes had to be computed and paid, and the laws of the community had to be written down. It was also important to know how much and what kind of food were in storage at any given time and how much should be stored for future needs. The physical well being of each member of the group depended on it. The earliest writings we know of deal with such affairs. Poets and historians were to come later. The first writer may well have been the tax collector."

—(Man must speak : P. 91-92)

అందువల్ల 'తొలి రచయితలు' కవులు, చరిత్రకారులు కారు - టాక్స్ కలెక్టర్లు! తొక్కు పలుకులు, కూనిరాగాలు, ఇవాళ్టి వికావు - అవి ఆదిమానవునితో పాటు చిన్నారిపొన్నారుల వరకూ వారి నర్సరీ పాటల వరకూ సంక్రమించాయి. 'చారిత్రిక విభాత సంధ్యలలో మానవకథ వికాస' వీథులలో క్రమంగా సంచరిస్తున్న ఆదిమ మానవులు ప్రకృతిని ఉపాసించి చేసిన పని-ప్రకృతికి లొంగిపోవడం కాదు, దానిని సాధించడం, తనకు కావలసింది సాధించుకోవడం. ఆ భయంకర సంధ్యాసమయాలలో కట్టెనో మట్టినో - దేనినో ఒకదాన్ని కొలిచినా, ప్రార్థించినా సమష్టి ప్రయోజనం కోసమే చేశాడు, ఆడినా పాడినా కూడా అందుకే చేశాడు. సంకేతాలు సంగీతాలయ్యాయి. ప్రకృతిలో

'ప్రతి కదలికలోనూ, ధ్వనికీ స్పర్శకూ మధ్య ఏదో మధుర సమ్మేళనం' ఉందని ("harmony of Sound and Sense") పైతాగరస్, ప్లాటో, హిరాక్లిటస్ మొదలైన తత్వవేత్తలు పోయిన ఊహాపోహలు కొంతవరకు నిజమేనేమో అనిపిస్తుంది. కనుకనే 'ముఖే ముఖే సరస్వతీ' అన్న సూక్తికి-కృత్రిమ కవితల కంటే ఒక ధారగా, అపధారగా జనజీవితం నుంచి అనుభవాల కుప్పగా, అనుశ్రుతంగా, అలవోకగా, అగణితంగా తొలుత గణసమాజం నుంచీ, ఆ తరువాత పల్లెప్రజల నుంచీ జాలువారిన జానపదకళాసంపద వారసురా లయింది.

ప్రాకృతాన్ని సంస్కరించుకొని వచ్చిన భాష సంస్కృతం అన్నప్పటికీ విననివారు, నమ్మనివారూ పదసాహిత్యంనుంచి పద్య సాహిత్యం పుట్టుకు వచ్చిందంటే అసలు నమ్మగల స్థితిలో లేరు! తమ శక్తిమీద నమ్మకం లేనివారే ఎప్పుడూ కల్పిత శక్తిని ఉపాసిస్తారు అలాంటివారే 'భాష'నూ, కవిత్వాన్ని కూడా 'దేవభాషలుగా' చిత్రించి భాషలను జనానికి దూరం చేస్తారు. ప్రజా కళలను కంచికి పంపిస్తారు. పదసాహిత్యం నుంచే పద్యసాహిత్యం ఉద్భవించిన దనడానికి మన జానపద సాహిత్యమే నిదర్శనం. 'పదకవితను ముదిలంజ'గా ఈసడించుకునే ముచ్చులూ, నాలిముచ్చులూ ఇంకా మనలో లేకపోలేదు.

కవిత్వానికి సామాజిక ప్రయోజనం ఉందని అడుగడుగునా గుర్తింప చేయగల సత్తా, అధికారం ఉన్న సంపద జానపద వాఙ్మయం అని మరచి పోరాదు. ఎందువల్లనంటే జానపద సాహిత్యంలో హెచ్చుభాగం కృత్రిమ కవితలు కావు. "గుండె గొంతుకలో కొట్లాడగా" దండితనంగా వెలువడిన కండగల గీతాలివి. అవి అరమరికలు లేని గ్రామీణ ప్రజలలోని కట్టుబాట్లనూ, అలవాట్లనూ, ఆచారాలనూ, విశ్వాసాలనూ మత విశ్వాసాలనూ పల్లీయుల ఆనంద విషాదాలనూ అచ్చమైన ప్రజలభాషలో స్వచ్ఛమైన దేశీయ ఫణితిలో ప్రతి బింబిస్తాయి. పండుగలు, పబ్బాలనుంచి, పచ్చపొడిపింపులవరకూ, కదురుకూ-కవ్వానికీ, కలానికీ-హలానికి, నాగలికీ దాగలికీ, ఏతానికీ, ఏలపాటకు, పగ్గానికి పలుపునకూ, చిక్కాలకూ, చిరతలకూ, ఊడుపులకూ, నూరుపులకూ, దంపుడు లకూ, విసర్రాయి పాటలకూ, మోటబావి పదాలకూ కపిలబావి, చరణాలకూ-జానపద సాహిత్యం రతనాల పేటి. 'ఆటమాణిక్యం పాటమాణిక్యం నట్టింటి

అమ్మాయి రత్నమాణిక్యం' అన్న పదం జానపద సాహిత్యానికి అక్షరాలా వర్తిస్తుంది. భాషవిషయంలో మాదిరే ఆదిమ మానవునికి ప్రకృతితో తాదాత్మ్యంలో 'లయ' ఎప్పుడు కుదిరిందో 'చిందు' ఎప్పుడు పడిందో తబిశీళ్ళు విర్దిష్టంగా చెప్పలేము. వేటసిరి బాగున్నప్పుడూ, పంటసిరి బాగున్నపుడూ ఆనంద నాట్యాలకు అంకురార్పణ జరిగి ఉండాలి. ఆరువేల సంవత్సరాలనాడు ఇప్పటి ఇరాక్ పరిసరాల్లో జీవనం సాగించిన సుమేరియన్లు ఆరితేరిన సంగీత ప్రియులుగా పరిశోధకులు చెబుతారు. అప్పటికే వారు ఆసియా, ఉత్తరాఫ్రికాల లోని ఇతర తెగలను, జనావాసాలనూ తమ సంగీత పరిజ్ఞానంతో ప్రభావితం చేసినట్లు దాఖలాలు దొరికాయి. ఈ ప్రభావం ఈజిప్షియన్లు హిబ్రూలు, గ్రీకుల మీదకూడా ఉంది. ఆరేసిపంచల మంది కలిసి వివిధ వాద్యాలతో (ఫ్లూట్స్, హార్ప్స్, డ్రమ్స్) కచేరి చేస్తున్న దృశ్యాలను సమాధికుడ్యాలపైన ప్రాచీన ఈజిప్షియన్లు చెక్కిన ఉదాహరణలను కూడా పురాతత్వవేత్తలు పేర్కొన్నారు.

కలుపుతీసే వేళ, కపిలతోలే వేళ, కళ్ళం నూర్చేవేళ జానపదుల పెరుగు మీగళ్ళతో పాటు వెన్నలాంటి వారి మనస్సులను హుషారుపరిచే పాటలు మనకు గుర్తుకు రావలసిందే. సమష్టి జీవనానికి ఒకనాటి ఇంగ్లండ్‌లో పల్లెదృశ్యాలు (Pastoral Scenes) ఎలాగో మన జానపద కళాసంపదకూడా, అలాగే అద్దంపడుతుంది. వర్జిల్, బుకోలిక్స్, హెర్బర్ట్ స్పెన్సర్ "Shephered Calander" షేక్స్‌పియర్ "As you like it" మాదిరిగా — మన జానపద సాహిత్యం కూడా వ్యష్టి పరంగానూ సమష్టిపరంగానూ పల్లెవాతావరణాన్ని చిత్రించినవే. ఆంగ్లసాహిత్యంలో జానపద గేయాలకు ప్రత్యక్ష కర్త లున్నంతగా మనకు లేరు, వీటి కర్తృత్వంలో ఇప్పటికీ అజ్ఞాతకవుల సంఖ్యే మనకు ఎక్కువ. వందలు, వేల సంవత్సరాలుగా ఆ నోటా, ఆ నోటాబడి వాటికి వ్యాప్తి వచ్చింది. పల్లె వాతావరణాన్ని థియోక్రిటిస్, వర్జిల్ ప్రసిద్ధంగా చిత్రించారు. దానినే యూరప్‌లో సాంస్కృతిక పునరుజ్జీవన దశలో, ఇటలీలో సనజారో, ఫ్రాన్స్‌లో మొజార్ట్, ఇంగ్లాండ్‌లో స్పెన్సర్ పునరుద్ధరించగలిగారు.

రెక్కాడితేగాని డొక్కాడని బక్కజీవులు ఇప్పటికే పల్లెపట్టులో దేవతలను గానీ, క్షుద్రదేవతలనుగానీ ఉపాసించుతూ వానలు కురిపించడానికీ, వరదలు

ఆపుజేయడానికి కప్పల్ని ఊరేగించుతూనే ఉన్నారు. మనుషులను, పశువులను, పంటలను కాపాడడం - అమాయకులయిన పేద గ్రామీణుల అసలు ఉద్దేశ్యం. కనుకనే నేటికీ, గ్రామాంలోను కొన్ని పట్టణాలలోనూ కప్పను ఊరేగిస్తే వానొస్తుందన్న నమ్మకంతో—

"కప్పల తల్లీ నీళ్ళాడే
కడవల నిండా వానా కురిసే
ఈగల తల్లీ నీళ్ళాడే
వీథులనిండా వానాగురిసే
చేపల తల్లీ నీళ్ళాడే
చెరువుల నిండా వానాగురిసే"

అంటూ 'కప్పలపాట' పాడుతుంటారు. మేఘాలు సృష్టించడానికి 'సోడియం వేపర్'తో కావాలనుకున్నప్పుడు చేలకు వర్షాలు కురిపించుకోవచ్చునన్న శాస్త్ర విజ్ఞానం అనుభవంలోకి రాని రోజుల్లో ప్రకృతి, సూర్యచంద్రులు ఉపాసితు లయ్యారు! 'తమ సోమా జ్యోతిర్గమయ' అనే ఉపనిషత్ వాక్యం దీనినే నిరూపిస్తోంది. అంటే జ్ఞానం కాబట్టి వేదాన్ని 'బ్రహ్మంగా' భావించి దాన్ని "పాతే బ్రహ్మాంజలిః" అని పూజించారు. బహుశా మన పుస్తకాల పూజకు వినాయకచవితికి ఇదే పునాది అయి ఉండాలి. అలాగే, సూర్యోదయాన్ని ప్రాచీనులు :

ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద
త్తిష్ఠ గరుడధ్వజ
త్తిష్ఠ కమలా కాన్త
త్రైలోక్యం మంగళం కురు"

అంటూ ఉపాసించారు.

మనకు మొదటి దుక్కు 'ఏరువాక' తో ప్రారంభం. ప్రకృతి ఉపాసన ప్రారంభించి అవసరమైన కోరికలను తీర్చుకోడానికి తెలుగు ఆడ పడుచులు సమష్టి ప్రయోజనం కోసం, పంటసిరి కోసం చేసే ఆరాధన ఎలాంటిదో చూడండి :

"ఏరువాకమ్మ ఏమికావాలి ?
ఎర్ర ఎర్రని పూలమాల కావాలి !
ఎరుపు తెలుపుల మండు టెండకావాలి
ఏరువాకమ్మకు ఏమి కావాలి ?
పొలముగట్టున నిలిచి వేడుకోవాలి...
ఏరువాకమ్మను ఏమి కోరాలి ?
ఎడతెగని సిరులివ్వ వేడుకోవాలి !
పాడిపంటలు కోరి పరవశించాలి".

ఇంతకుముందు పేర్కొన్న ప్లెఖనోవ్ సూత్రీకరణ— "Utilitarian Activity" అంటే ఉపయోగపు విలువకు "ఏరువాక" పాట లక్ష్యం సరితూగుతుంది. అంటే తమ శ్రమకూ, ఆ శ్రమ ఫలితానికీ, అవసరానికి తోడ్పడే ప్రతి సాధనాన్నీ, ఆదర్శాన్నీ మన ప్రాచీనులు లేదా జానపదులు భక్తి భావంతోనూ సమాజప్రయోజనాసక్తితోనూ పూజించారు.

గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో, తరతరాల దోపిడిలో రాపిడిలో నలిగిపోతున్న బక్కరైతు అవస్థనూ, కూలీ దురవస్థనూ ఒక అజ్ఞాతకవి వర్ణించిన తీరు గుండెల్ని పిండుతోంది. శ్రమ ఒకరిది, ఫలమొకరిదిగా ఉన్నదని చెబుతూ:

"ఏటికేతం బెట్టి ఎయిపుట్లు బండించి
ఎన్నడో మెతుకెరుగరన్నా - నేను
గంజిలో మెతుకెరుగరన్నా"

ఇంతకన్నా గుండెల్ని అవియగొట్టి ఈ డాబుదర్పాల సమాజంలో 'అంతరాల పడవ' జోరులను ఎలా మధ్యలోనే ముంచే ప్రమాదం ఉందో ఒక తెలంగాణా అజ్ఞాతకవి అద్భుతంగా చిత్రించాడు: ఒకే నీతికి రెండు కొలబద్దలు చూపించే ఈ సిగ్గులేని సాంఘిక వ్యవస్థను అతను తూర్పారపట్టాడు. ఇది అముద్రిత రచన అని గుర్తించ ప్రార్థన:

పేరినా నేతుల్లు బెల్లపచ్చుల్లు
పేదవారంపితే బేపర్వలాయె !
కరివేప గుత్తుల్లు కావిళ్ళ బెట్టి
కలిగినోరంపితే గాంభీరమాయె !"

మొత్తచూసి పెద్దపీట వేయడం అంటే ఏమిటో ఈ జానపదగేయం గుర్తు చేస్తోంది. ఇందువల్ల ఒక సత్యం వెలుగులోకి వస్తోంది: సామాజిక స్పృహను, సామూహిక ప్రయోజనాన్ని వదులుకున్న వ్యవస్థలుగాని, కళలుగాని, కళాకారులు గాని ఎక్కువకాలం మనలేవు అని.

మన ఊళ్ళల్లో తప్పుడు ప్రతిష్ఠలకుపోయి, ఉన్న ప్రతిష్ఠనుకూడా ఎలా ఊడగొట్టుకుంటారో హాస్యధోరణిలో విశాఖమండలంలోని ఒక జానపదం చెబుతోంది. వ్యవసాయం మొగం ఎరుగనివాడు ఆ వృత్తిని చేపడితే ఎలా ఉంటుందో చూడండి:

"సేసిరి ముగ్గురు ఎగసాయం-
ఒకడికి కాడే లేదు
రెంటికి దూడల్లేవు
కాడి దూడలు లేని ఎగసాయం
పండెను మూడు పంటలూ !
ఒకడికి గడ్డే లేదూ
రెంటికి వడ్లే లేవు
గడ్డీ వడ్లూ లేని పంటా
విశాఖపట్నం సంతలో పెడితే
వట్టి సంతే గానీ
సంతలో జనమేలేరు!"

సరిగ్గా దీనికి ప్రతిగా, శ్రమజీవనసౌందర్యాన్ని ఉగ్గడిస్తూ, శ్రమజీవితోని అభిజాత్యానికి దిలాసాతనానికీ అద్దంపడుతున్న ఒక చైనీస్ కవితకు సరళానువాదం ఇక్కడ ఇస్తున్నాను.

పొద్దు పొడిచిన దాని పనిలోనె
పొద్దు కుంకే దాక పనిలోనె
చెమటోడ్చి తీళాను దొరువు
మంచినీటికి లేదు కరువు

కాడిపట్టి చెలక దున్నాను
కమ్మగా పంటందుకున్నాను
సామంతుడెవడు ? సామ్రాట్టు ఎవడు ?
నాకు పోటే లేడు సరితూగ నెవడు !*

ప్రయివేటు ఆస్తిపై ఆధారపడిన సామాజిక వ్యవస్థల్లో సమష్టి ప్రయోజనం కంటే వ్యష్టి ప్రయోజనానికే ప్రాధాన్యం ఉంటుంది. కనుకనే సామూహిక మంచిని పెంచిన ఆదిమ గణసమాజ వ్యవస్థలు బద్దలైన తరువాత వ్యక్తిగత ప్రయోజనాలు పెరిగాయి. సొంత ఆస్తి చోటు చేసుకొని కళలూ, కళాభిరుచులూ వ్యష్టి ప్రయోజనాన్ని బట్టి పెరుగుతూ వచ్చాయి; సంఘప్రయోజనం పోయింది. చెంబుడు నీళ్ళలో అరగ్లాసు పాలు మాదిరిగా సంఘప్రయోజనాశక్తి కళలకు ఉన్నట్టు కన్పిస్తుంది - అంతే ! సోమరిపోతు వర్గం రెండు విధాలుగా పెరుగుతుంది. కొద్దిమందికి సొంత ఆస్తివల్లా, అందువల్ల హెచ్చుమంది నిరుద్యోగులవడం వల్లా, చౌకబారు కళాఖండాల ద్వారా వారి దృష్టిని మళ్ళించడంవల్లా, శ్రమను, కాయకష్టాన్ని గౌరవించలేని చోట అందుకు సంబంధించిన కళాసంపదను పెరగనివ్వరు. ఎంతసేపని ఎంతగొప్పదైనా లియోనార్డొడావిన్సీ 'మోనాలిసా' ముఖాన్ని చూచి మురిసిపోగలం ? మద్రాసు మెరీనా బీచ్‌లోని దేవీప్రసాద్‌రాయ్ చౌదరి "శ్రమజీవులు" కళాఖండాన్ని ఎలా మరచిపోగలం ? ఉత్పత్తి సృష్టికి, దాని పెరుగుదలకూ ఎవరు కారకులో వారినీ, వారి శ్రమనూ గౌరవించుకోనంతకాలం సామాజిక ప్రగతి సామూహికం కాజాలదు. బహుశా ఈ సూత్రాన్ని ఎవరికంటే ఎక్కువగా గమనించబట్టేనేమో ప్రాచీన ఈజిప్షియన్ కవికి, కళాకారునికి పనిపాట్లలో ఉన్న కష్టజీవే వారి కళాఖండాలకు తరచు కథా వస్తువయ్యాడు ! మనవాళ్ళుకూడా చిత్రించారు కాని ఖజరహో స్థరస్కృతి ముమ్మరించినందున సహస్రవ్యక్తుల సమస్త చిహ్నాలకూ వృత్తిపరంగానూ, వ్యావృత్తి ధర్మంగానూ ఆయా కళాకారులకు న్యాయం జరుగలేదని పిస్తుంది.

* "From Sunrise I work, till sunset when I retire,
I drink the water from the well- That I have dug.
I eat the food from the field - That I have tilled.
Kings and Emperors, What have they to do
with?)"

ప్రయివేటు ఆస్తిపై ఆధారపడిన ధనికవర్గ సమాజం సమిష్టి భావనను పెంచదు, తుంచుతుంది. మతాల వ్యాపారంతో పాటు, కవితా వ్యాపారాలు, కళా వ్యాపారాలు చేస్తుంది సమాజం. ఎందువల్ల? డబ్బువల్ల. అన్ని "బంధాలలోకి పెద్ద బంధం" ఈ డబ్బు అన్నాడు కారల్‌మార్క్స్. అది సమాజాన్ని చెడగొట్టే పెద్ద "రసాయనశక్తి" అన్నాడు, అదొక పుండాకోరుశక్తి, లార్పుడు శక్తి అన్నాడు; డబ్బు చెడును మంచిగా, మంచిని చెడుగా తారుమారు చేస్తుంది. ఇంకా ఇలా పేర్కొన్నాడు :

"Money is the true currency of separation as well as the true means of joining together, the galveno - chemical force in Society... As this transforming power, it manifests itself also against social and other ties which lay claim to being essences. It turns loyalty into disloyalty, love into hate, hate into love, virtue into vice, vice into virtue... nonsense into intelligence, intelligence into nonsense... Money is the inter mediary between need and object, between man's life and his food. But what my life procures for me, the existence of other people also procures for me... I am ugly, but I can buy the most beautiful woman. So I am not ugly, for the effect of ugliness, its repulsive power, is eliminated by money..."

దీనినిబట్టి, సమష్టి జీవనానికి ప్రతిబింబంగా, సామాజిక ప్రయోజనానికి దర్పణంగా ఉన్న ఆదిమకళా రూపాలైన కవిత్వం, నృత్యం, సంగీతం, ధనస్వామ్య వ్యవస్థలో ఇతర నిత్యావసర సరకులతో పాటు సామాన్యునికి అందుబాటులో లేని ఖరీదైన వస్తువులుగా మారిపోయాయని భావించుకోవచ్చు. అవసరమైన విజ్ఞానం అందించకపోగా ఉన్న వినోదావకాశాలను కూడా ఈ సమాజం ధన భారమితితో దూరం చేస్తోంది. సమాజ సంపద ఉత్పత్తిలో పాలు

పంచుకుంటున్న ప్రధాన భాగం చేతులు. కాని ఒక్కొక్కప్పుడు భోజనం దగ్గర కూర్చున్నప్పుడు ఆ చేతులు తనకు ఒక పట్టాన స్వాధీనంలోకి రానప్పుడు ఒక అమెరికన్ కార్మికుడు ఏమనుకున్నాడో ("ఛాలెంజ్") దాన్ని కవితలో చెప్పాడు, వినండి :

"బల్లపై వాలిపోయిన చేతులు
మెల్లగా రోజు పని నుంచి తేరుకుంటాయి
ముడవాలని ప్రయత్నిస్తాను
కదిలించాలని చూస్తాను
అయినా కదలవు !
కళ్ళముందు చేతులు
కంటినంటి పెట్టుకున్న చేతులు
అయినా నావికావు :
మాటలు కూర్చగలవి
అంకెలు పేర్చగలవి
జంకులేని చేతులు
మిద్దెలు కట్టగలవి
అయినా ఈ చేతులు
ఎవరివి? మరెవరివి?
యుద్ధాలకు సిద్ధపడేవి
ట్రిగ్గర్ నొక్కగలవి
సాటిమానవుని
తోటి కష్టజీవి
చేతులు కట్టివేయాలని ప్రయత్నిస్తాయి!
ఈ పనిని పురమాయించింది
ఎవరు? నేనా? నేనేనా?
అప్పుడప్పుడూ తిమ్మిరెక్కి

కదలని, కదలలేని చేతులు
బంధించిన యజమాని గొలుసులు!
అమాయకపు చిరునవ్వుతో
"నాన్న చేతులారా తిండి
పెడతాడ"ని ఎదురు
దారులు కాస్తున్న నా బిడ్డ,
అయినా కదలని చేతులు !
ఒకనాడు సమ్మె జరుగుతుంది
యజమాని మంది మార్బలం
వెంట పశుబలంతో వస్తాడు
సమ్మె చేస్తున్న కూలీలను
బెదరగొడ్తాడు. బెదరగొడతాడు
కష్టజీవులు కూడబలుక్కుంటారు
పిడికిళ్ళు బిగిస్తారు
పిడుగులు వర్షిస్తారు
అబ్బ! అప్పుడు... ఆ క్షణంలో
నరనరాల రక్తం
ప్రవహిస్తున్న చేతులే, ఆ చేతులే
నావి, నిజంగా నావి !
అయినా ——
మళ్ళీ పనిలో ప్రవేశం
మరోసారి భృత్య జీవితం
పొలుసులు ఒలిపించిన
గొలుసులు బంధించిన
చేతుల్ని మళ్ళీతిమ్మిరి ఆవరిస్తుంది !

ఇప్పుడిక తిమురు
తగ్గిపోతుందిలే
నిన్నటి చేతగానితనం
తొలగిపోతుందిలే !
జీవితాన్ని సృష్టించేది పోరాటం
అందుకు తప్పదులే కోలాటం
అది భావికి బాట
ఏదన్నా మాదంటూ నిలబడితే
అది ఒకటే గాట!
ఇవి బలమైన చేతులు
బలపడుతున్న చేతులు !

నిజమైన కళావైభవానికి ఆనవాలు సర్వత్రా సామాజిక వికాసం, సామూహిక ప్రయోజనాల సంరక్షణా. అది సిద్ధించేవరకూ "సర్వకళల వికాసం" అన్న లక్ష్యం, సాధించలేని కుందేటి కొమ్ముగానే ఉండిపోతుంది !

# జానపదులు—పని—పాట

—జయధీర్ తిరుమలరావు

శ్రమ జీవులు ఉత్పత్తికి సృష్టికర్తలు. ఆయా ఉత్పత్తి సంబంధాలను అనుసరించి వారి శ్రమ జీవనం ఉంటుంది. ఈ శ్రమ జీవనం - శ్రమచేసే సమయంలోనూ; ఆ తరువాత కూడా వారి జీవితంలో ఒక ముఖ్యమైన భాగంగా చూడాలి.

శ్రమ ప్రతి పనిలోనూ ఉంటుంది. ప్రతి పనికి పాట ఉంటుంది. ఆ పాటలు ప్రజాసాహిత్యంలో ఎంతో ప్రాధాన్యతగల విభాగం. శారీరక శ్రమలోంచి అమిత కష్టసాధ్యమైన పని పాట్ల రాపిడిలోంచి, జీవిత సంఘర్షణలోంచి వెలువడిన పని పాటల సేకరణ జరుగలేదు. పరాయీకరణచెందిన పాటలనే సేకరించి గ్రంథాలయ బీరువాల్లోనూ బౌండు పుస్తకాల్లోనూ బంధిస్తున్నారు.[1]

పని పాటని కేవలం పాటగా తీసుకోకూడదు. ఆపాట పాడే గాయకుడు, పనీ, భౌతిక పరిసరాలు ఇవన్నీ ముఖ్యం. వాటిని వదిలిపెట్టి కేవలం పాటను చూడ్డం సరైన పనికాదు. బౌండు పుస్తకాల్లో బంధింపబడిన పాటలకి రక్త మాంసాలూ, జననక్రమమూ, అభివృద్ధి, చలనం ఉన్నాయి. ఈ పాటలు ప్రజల జీవితాన్ని సరిదిద్దే ప్రయత్నంలో, ఉపయోగపడే క్రమంలో ఉన్నాయి.

ఈ వ్యాసంలో శ్రమలోంచి పాట ఎలా పుట్టింది, శ్రమకీ పాటకూ మధ్య గల ఉత్పత్తి సంబంధం ఏమిటీ, శ్రమ నుంచి విడివడిన (అంటే పరాయీకరణ చెందిన) పాటల స్వరూప స్వభావాలు ఏమిటీ, వాటి వెనకనున్న సంబంధాలు, శ్రమ జీవనం గురించి తెలియజేయడానికి ప్రయత్నం చేసాను.

తెలుగునాట మూరుమూల గ్రామాల్లో ప్రజలు శ్రమకూ పాటకూగల సంబంధాన్నిబాగా గుర్తిస్తారు. పని పాటలు లేనోడు అంటారేగాని 'పని లేనోడు' అని అనరు పని-పాట నుండి పని దూరమయ్యాక కూడా పాట ప్రజల నుండి దూరం కాలేదు. పనిలేని సమయంలో ముద్దూ ముచ్చట్లలో, ఆచార వ్యవహారాల్లో ఆట పాటల్లో (గ్రామీణ జీవితంలో ప్రతి ఆటకీ పాట ఉంటుంది) కూడా శారీరక శ్రమ ఉంటుంది. ఆ శ్రమను అనుసరించే పాట ఉంటుంది. పాటకి ప్రజల్లో పర్యాయ పదం కైకట్టడం. కై అంటే కవిత-వాళ్ళకు కవితంటే పాటే. కట్టడం అంటే రాయడం కాదు. కూర్చడం. ఈ కూర్పు శ్రమ క్రమంలోంచి వెలువడుతుంది. అంటే పని - పనిపాటని నిర్మిస్తుంది.

పని విధానం మారినప్పుడల్లా కూర్పు ఆయా శ్రమ స్వభావాన్ననుసరించి మారుతుంటుంది. ఈ మార్పులో ఉత్పత్తి సంబంధాలలో ఉపయోగించే భాష, వ్యక్తీకరణ ఉంటుంది. గ్రామీణ ప్రజల జీవన విధానంలో 'పని' ప్రధానమైనది. ఆపనే వారి జీవితాన్ని నడిపిస్తుంది ఆ పనిని నీడలా వెన్నంటి పెట్టుకున్నదే పాట. పని - పాట శ్రమజీవి యొక్క తీవ్రాభి వ్యక్తీకరణ సాధనం.

లయ (Rhythm) సమతూకం (Balance) విరామం (Pause) పనిలో ప్రధానంగా ఉంటుంది. దానికి అనుబంధంగానే పాటల్లో ఈ అంశాలు ప్రతిబింబిస్తాయి. పనిపాటలు పనిలోంచి వెలువడి ఆయా వుత్పత్తి సంబంధాలకు సంబంధించిన దశలకు అనుగుణంగా, ఆ దశల ప్రయోజనాలకు అనుగుణంగా తమ కర్తవ్యాన్ని నిర్వహించాయి. ఐతే పనిపాటల్లో 'పాడటం' ముఖ్యం కాదు. పని ముఖ్యం. పని పాటల స్వరూప స్వభావాలను ఈ దృష్టితోనే చూడాలి.

పని పాటల గురించి చెప్తున్న సందర్భంలో ఓ చిన్న కథ చెప్పడం అవసరం. ఏది పని పాట అంటే-

ఒక నది ఒడ్డున ఉన్న కలప వ్యాపార సంస్థని నడపడానికి కొత్తగా యజమాని అల్లుడు వచ్చాడు. ఇక్కడ నదిలో కొట్టుకొని వచ్చే వట వృక్షాల్ని శ్రామికులు మోసుకుని వచ్చి రంపాలతో ముక్కలు చేసి అవసరమైన చోటికి రవాణా చేస్తారు. పట్టణం నుండి వచ్చిన అల్లుడు గారికి ఆ చప్పుడూ, ఆ వాతా

పరణం చికాకు కలిగించింది. ముఖ్యంగా శ్రామికులు పరుపు లెత్తేప్పుడు చేసే శబ్దాలు, పాడే చరణాలు పిచ్చి కోపం తెచ్చాయి. ఎవరి పని వాళ్ళు చేసుకో వాలనీ, చరణాలు పాడకూడదని హుకుం జారీ చేసాడు. కొరడా చేతబూని గస్తీ తిరిగాడు. వాళ్ళతో పాడటం మాన్పించ గలిగాననీ సంతోషించాడు. కాని వారం తిరక్కుండానే మామగారు వచ్చి నిర్ఘాంతపోయారు. శ్రామికులు చిన్నబోయి ఉన్నారు. అతి మెల్లగా పనులు సాగుతున్నాయి. ఎంతో పని ఆగి పోయింది. లాభాలు తగ్గాయి. అసలు కారణం తెలుసుకుని పాటలు పాడుకోవచ్చని చెప్పాడు. అప్పుడు అల్లుడుగారికి తెలిసివచ్చింది - పాటని శాసించడంవల్ల పని కూడా ఆగిపోయిందని. ఇది పని పాట లక్షణం.

పని పాటల్ని కేవలం అక్షరాల్లో బిగించి చూడ్డం వల్ల వాటిని క్రతు గీతాలు (Rituals)గా, ఆచార వ్యవహారాలకు సంబంధించిన గీతాలుగా భ్రమిం చడం జరిగింది. ఐతే ప్రజలు శ్రమ గీతాన్ని క్రతుగీతాలుగా కూడా పాడు కుంటారు. కాని చాలా తక్కువగా వస్తువునో, పాట శైలినో, రాగాన్నో మాత్రం తీసుకొని పాడ్తారు. అంతేకాని స్వభావరీత్యా, పాట నిర్మాణరీత్యా ఎలాటి సంబంధమూ లేదు.

## ఆదిమానవులు-శ్రమ సంబంధం-పాటలు :-

మానవజాతి పూర్వదశలోని కూతలూ, సంజ్ఞలూ సామూహిక శ్రమలో సమ్మేళనమూ, సమన్వయమూ పొంది ఒక కొత్త భావ ప్రకటనారీతిని రూపొం దించాయి. ఈ కొత్త భావ ప్రకటనారీతిలో బాహ్య ప్రపంచాన్ని సాధారణీకరించ డానికీ, దాన్ని ప్రతిబింబించడానికీ శబ్దం ఏకైక మూలం. పనిముట్లు, భాష, పరస్పర సహకారం ఇవి ఉత్పత్తి శ్రమ అనే ఒక క్రమంలోని భాగాలు. ఇది మానవ సమాజానికే పరిమితం. ఈ క్రమ నిర్మాణానికి కేంద్రం సమాజమే. పనిముట్లని ఉపయోగించడంతో అభివృద్ధిపొందిన "పరస్పర సహకారం"- మానవుని పరిణామ దశలో ఒక ముఖ్య అంశంగా భావించవచ్చు.[2]

శ్రమ-శ్రమతో కలిసిన భాష శ్రమతో అనుబంధితమైన లయ, ఊపు పాటకు మూలంగా ఉంటుంది. ఈ విధంగా పాటని ఉత్పాదక శ్రమలో తన్ను

కున్న వేళ్ళని వెలికితీయాలి. పరికరాలను ఉపయోగించే శ్రమ క్రమంలో శారీరకంగా కండరాల పట్టు-సడలింపులవల్ల గొంతుక నుండి ఒక రకమైన కంఠధ్వనులు వెలువడులాయి.

"As hands became more finely articulated, so did the vocal organs, until the awakening consciousness seized on the reflex actions and eloborated them in to a socially recognised system of communication"[3]

ఆ తరువాత రానురాను భావవినిమయానికీ పనికీ అనుబంధితమైన రూపాలు ఏర్పడ్డాయి. ప్రకృతిని అనుకరించి పంటను వృద్ధిచేయడానికి తమవంతు కృషిని చేసామని నమ్మేవారు. నేతగాడు పాటని చక్రం తిరుగడానికి ఉపయోగ పడే యంత్రంగా విశ్వసించేవాడు. నిజానికి చక్రం తిరగడానికి పాట, కేవలం పరోక్షంగా సహాయపడుతుంది. పాట పాడకుండా నూలు వడకడం అతనికి అసాధ్యం. 'మాయ'అని నమ్మేదశ అందువల్ల, పాట పాడకపోతే చక్రం తిరగ దేమోనన్న అమాయకత అతడిది. ఈ విధంగా మానవుని అభివృద్ధి దశల్లో, ఉత్పత్తి, స్వభావాన్ని అనుసరించి, పాట పెరుగుతూ వచ్చింది.

## శ్రమక్రమం – పాట :

శ్రమనుండి కూత, కూతనుండి పాట పెరుగుతుంది. ఇలాంటి స్వభావం కలిగిందే బరువులు లాగే పాట. ఆదిమ శ్రమవిధానంలో బరువులు లాగడం, బండని పగులగొట్టడం, పనిముట్లని ఉపయోగించడం మొ॥ పనుల్లోదాగిన శబ్ద లయ, శారీరక (కండరాల కదలిక)లయ మాత్రమే. పాటకి ఒక స్వరూపాన్ని కలిగించింది.

"జానపద సాహిత్యం నిజంగా గొప్పది. కష్టంలో కండరాల కదలికలవల్ల ప్రతిపాట రూపుదిద్దుకుంటుంది గనుక! ఎండలో చెమట శరీరాలు మెరిసిపోయి నట్టు; ప్రతిపదం జీవిత సంఘర్షణలో, అనుభవంలో తడుస్తుంది గనుక!!"[4]

పల్లకీ పాటలోగానీ, పడవపాటలో గానీ బరువులులాగే పాటలో గానీ ముఖ్యంగా మనకు వినిపించేది శ్రమకూతలే. గణసమాజంలో ఉత్పత్తి, శ్రమ సామూహికం. ఎన్నోచేతులు కలిసి ఒకేపని చేసేవి. అందరి ఆలోచనలూ, ప్రేరణలూ ఒక్కటే. కాబట్టి శ్రమ కూతకూడా పెద్దగా భేదం లేకుండా ఉండేది. శ్రమ కదలికను బట్టి శబ్ద స్వరూపం ఉంటుంది. స్వరాలు బహిర్గతం కాకుండా పని జరుగదు. వస్తుగతశ్రమ స్వభావం శబ్దాలలో మార్పు తెచ్చింది. ఈ శబ్దాలు ఆశురచనరూపాన్ని (Improvisation) పొందాయి.

* *

శ్రమ స్వభావానికీ లయకీ విడదీయరాని సంబంధం ఉంది. మారోమాటలో చెప్పాలంటే లయ ఆయా శ్రమస్వభావం నుండే వెలువడింది. ఇక్కడ పల్లవి శ్రమ కూతే, స్థూలంగా శ్రమ రెండురకాలుగా ఉంటుంది.

1. శ్రమ విధానం ఒక నియమ క్రమంలో ఉండటం.

2. శ్రమ విధానం నియమ క్రమంలో లేకపోవడం.

మొదటి దానికి ఉదాహరణ పల్లకీ మోయడం. రెండో దానికి బరువులు లాగడం ఉదాహరణగా చెప్పవచ్చు. ఇందుకోసం నాకు లభించిన ఆయా శ్రమకు సంబంధించిన పనిపాటల ఉదాహరణతో నిరూపించవచ్చు.

1. పల్లకీపాట : ఇది పల్లకీ కావొచ్చు లేదా మరో బరువైన వస్తువుని మోసుకొనిపోవడమే కావొచ్చు. కానీ పల్లకీ మోసే చరణాలనే చూద్దాం. ఈ శ్రమలో 'నియమక్రమం' ఉంటుంది. మోసేవారు ఆ శ్రమ చేయడానికి అనుభవంపొంది ఉండటంవల్ల పని సులభంగా సాగుతుంది.

పల్లకీ మోయడానికిముందు వెనుకలుగా సమానంగా వ్యక్తులు ఉంటారు. బరువుని ఎత్తుకున్న క్షణం నుంచి ఉచ్ఛ్వాస నిశ్వాసల ఊపు ప్రారంభమవుతుంది. పదడుగులు పడగానే మోసేవారిలో ఆ శ్రమకు సంబంధించిన క్రమశిక్షణ ఏర్పడుతుంది. ఒకరి అడుగు తరువాత మరొకరి అడుగు అదే వేగంలో ఊపులో పడుతుంది. మోసేవారి 'గుంపు'లో అలసట కూడా అందరికీ సంబం

ధించిందే అన్ని మానవ శరీరాలూ ఒకే విధంగా శ్రమని తట్టుకునే దశకు చేరుకుంటాయి. అడుగులు, నడకవేగం అందుకుంటాయి. వెన్నుపైభాగం (నడుం) నుంచి మోచేతుల వరకు ఒక రకం కదలిక, పాదాల నుంచి నడుం వరకు ఒక రకం కదలిక (బరువులు మోయడంవల్ల కలిగే కండరాల కదలిక). ఆ కదలికతో పాటు ఉచ్ఛ్వాస నిశ్వాసాల వేగం పెరుగుతుంది. ఆ వేగమే ఆహా...ఆహా... అనే కూత హో...హో......హో...హో అనీ, హోహ్హం అనీ మారుతుంది.

బాట, బరువుమోసే పద్ధతిలో (భుజం మార్చుకోవడం) అలసట అనే శారీరక చర్యలవల్ల హహ్హం...హహ్హం......అహ్హోం...... అహ్హాం అని మారుతుంది.

ఈ శ్రమ లయ అందులోని విరామం ఒక కొత్త ధ్వనులకు తావిస్తుంది.

త్వరగా వెళ్ళాలనే సంకేతాన్ని, ఊపునీ శ్రమలయ కనుగుణమైన పద...పద...పద...పద అని గానీ బిర...బిర...బిర...బిర అని గానీ, నడు నడు అని గానీ హెచ్చరించుకోవడం జరుగుతుంది.

ప్రతి మూడు నిమిషాలకో, ఐదు నిమిషాలకో శ్రమనిబట్టి అలసిపోయే కండరాల 'విరామం'లో కొన్ని చరణాలు చేరుతాయి. విరామం ఎక్కువ అవుతున్నట్లు భావించగానే వేగాన్ని పొందడానికి మళ్ళీ అహ్హోం-అహ్హాం-హోహ్హం-హోహ్హ అని పునరుక్తం చేయబడుతుంది. (ఇది పాటకు పల్లవిలా మధ్య మధ్య వస్తుంది).

పల్లకీ పాట

అహా-అహా-అహా-అహా
హో...హో...హో...హో
హొహహో...హొహహో...ఓహో
హహ్హం-హహ్హం-హహ్హం (నడక వేగం పెరుగుతుంది).

పద...పద...పద...పద
బిర...బిర...బిర...బిర
పద...పద...పద...
రాజులు చెక్కిన రంగుల బండీ
పగడం ముత్యం పల్లకి మనదీ (పల్లవి)

కంటికి దూరం
కాలికి దగ్గర
పదరా ముందుకు
పద పద పద పద పద పద
నడు...నడు నడు నడు నడు ...

కడుపుల పేగులు కరకరమన్నా
కాళ్ళకు చేతులు గుంజుకుపోనా
పల్లకీ దించకు
పదరా ముందుకు. పద పద...

ఈ చరణాలను సమూహంలో ఒక్కొక్కరు ఒక్కో సమయంలో ఉచ్చరిస్తారు. మొత్తం చరణాల్ని ఒక్కడే చదవడు. ఎందుకంటే బరువు, బాధ అందరిదీ. పల్లవి మాత్రం అందరూ అందుకుంటారు. అలా అందుకోనివాడు ఆ పని వదలిపెట్టాల్సిందే.

ఈ పాట భూస్వామ్య ఉత్పత్తి సంబంధాన్ని సూచిస్తుంది. శ్రమ సృజనాత్మక శక్తిని కలిగి ఉంటుంది. శ్రమజీవులు తయారుచేసిన రంగుల బండీ, దాని అలంకరణలో ఈ శక్తి కన్పిస్తుంది. వాళ్ళు తయారుచేసిన పల్లకీని వాళ్ళే మోయాలి. అంటే మళ్ళీ వాళ్ళే దాన్ని నడపగలుగుతారు.

ఇంతగా మమేకమైన ఆ వస్తువు 'పగడం, ముత్యం పల్లకి మనవి' అనుకో గలరు. అంటే ఆ వస్తువును తమదిగా భావించుకుంటారు. కాని తమది ఎలా అవుతుంది ప్రస్తుతం అది ఎవరి అజమాయిషీలో ఉంది అనే చైతన్యం మాత్రం లేదు.

శ్రమజీవులు శ్రమచేయడానికి నిరాసక్తులుకారు. కంటికి దూరం, కాలికి దగ్గర అని ధీమా చెప్పుకొని గమ్యాన్ని చేరుతారు. ఆ ధీమా వల్లనే పద పద, నడు నడు బిర బిర అనే భావన వెలువడుతుంది. ఉత్పత్తి సంబంధాల్లో పాల్గొనే శ్రామికుల ఐకమత్యం పనిలోనూ, పాటలోనూ ప్రతి బింబిస్తుంది.

రెండో రకం శ్రమ నియమక్రమం లేని శ్రమ. ఆ పని స్వభావం కూడా ఒక నియమానికి అనుగుణంగా ఉండదు. ఒక పెద్ద చెట్టు పడిపోయింది దాన్ని అక్కడ నుండి లేపి వేయాలి. ఈ పనికి ఒక పద్ధతి అంటూ లేదు. వ్యక్తులు, వారి సంఖ్య, చెట్టు బరువు, అవసరం ఇవన్నీ పరిగణనలోకి వస్తాయి,

ఈ రెండు రకాల పాటల్ని అక్షరాల దృష్ట్యా కాకుండా ధ్వనుల దృష్ట్యా పరిశీలించాలి.

బరువుని లాగే పాట చూద్దాం. లాగే బరువుని బట్టి, పని విధానాన్ని బట్టి, పాట స్వరూపం వుంటుంది. మొదటిది బరువు నియమితంగా లేనప్పుడు పాడే పాట. రెండవది బరువు నియమితంగా ఉన్నప్పటి పాట.

**నియమితమైన బరువులేని పాట :**

a. హాయ్ ... హాయ్ ... పని ప్రారంభం ముందు కదలికలు...సామూహిక కేకలు...పని మొదలు.

హాయ్ ... ఐస్సో
పట్టండీ... ,,
లాగండీ... ,, పని సంకేతాన్ని పదాల్లో చెప్పడం
కొట్టండీ... ,,
ఎక్కండి (వెనక్కి) ,,
ఏయ్ ... హాయ్ ... పని జోరు ఆపేప్పుడు శబ్దాల తీవ్రత తగ్గుతుంది.

b. పనికి మళ్ళీ సిద్ధమైనప్పుడు
హాయ్ ... ఐస్సో వంటి పదాలలో సామూహికంగా దీర్ఘాలు తీస్తారు. ఇది పనిని బట్టి ఉంటుంది. ఈ దశ పూర్తి కాగానే మళ్ళీ కొత్తగా విరామం ఏర్పడుతుంది.

c. ఈ దశలో (పని) బరువు త్వరగా కదులుతుంది. సామూహికమైన వేగం పనిలో ఉంటుంది. పనిని మొదలు పెట్టేవాడు పదాల్ని మొదట పలుకుతాడు.

గున్నా గున్నా, అని ఒక రంటే "హోయేదానా" అని సమూహం అంటుంది ఈవిధంగా ఇలాంటి పదాలు చాలాసార్లు అంటే ఆ దశలోని పని వేగంగా, పూర్తయ్యే వరకు పునరుక్తం అవుతాయి.

d. బరువుని మరో వేపునుండి లాగడం గానీ, పని విధానం మారినప్పుడు గాని దొరికిన విరామంలో పదాలు చరణాలవుతాయి.

చలో చలో అని ఒకరంటే కదలమ్మా అని సమూహం అంటుంది. ఈ క్రమంలో పదాలు పేర్చుకుని ఒక పాటగా మారుతుంది.

చివరిదశలో ఊపు, ఉత్సాహంతో పని ఏకబిగిన సాగుతుంది. ఇక్కడ 'పాట' వేగాన్ని పొందుతుంది.

పని, పని విధానంలోనే పునరుక్తి ఉండటంవల్ల పాటలోనూ ఆ పదాల పునరుక్తి ఎక్కువగా కనిపిస్తుంది. ఈ పాటలో పనిచేసే శ్రమజీవులు శృంగార పదాలు ఎక్కువగా ఉపయోగిస్తారు. అయితే ఈ పదాలను కేవలం శృంగార భావన కోసం మాత్రమే వాడుకోలేదు. పని నడవడానికి సంకేతార్థాలుగానే భావిస్తారు. ఉదా : "నీ చేతకాకపోతే-నా చేతికివ్వు" ఈ పదాలు పని విధానానికే వర్తిస్తాయి. ఐతే వారు శృంగారం కోసమే ఈ పదాలు ఉపయోగించరు. ఆ పని వాతావరణంతో ఏ మాత్రం పరిచయం ఉన్నా అలా భావించుకోరు.

**బరువులు లాగే పాట :**

టెలీఫోను స్తంభాలుగానీ, కేబులు వైరుచక్రంగానీ, కరెంటు స్తంభాలు గాని లాగేప్పుడు పాడేపాట. ఈ పాటని రెండు రకాలుగా పాడుకుంటారు.

| I. భూస్వామ్య ప్రతినిధి ఉన్నప్పుడు | | II. లేనప్పుడు | |
|---|---|---|---|
| a. హే...హే......హై | | a. హే...హే......హై | |
| కోటేసన్న | హై...స్సో | కోటేసన్న | హైసొస్సో |
| పట్ట డ్రం | ,, | పట్ట డ్రం | ,, |
| డ్రం పట్టీ | ,, | డం (మ్మా) పట్టీ | ,, |
| లాగ్గ అన్నా | ,, | లాగ్గ అన్నా | ,, |
| పట్టీ లాగు | ,, | పట్టి లాగు | ,, |
| కేబుల్ పట్టీ | ,, | కేబుల్ పట్టి | ,, |
| లాగీ గుంజు | ,, | లాగీ గుంజు | ,, |
| b. అట్లా పొయ్యో | ,, | b. గేజరు మామ | హైస్సో |
| పోరీ సంట్లు | ,, | వచ్చీనాడు | ,, |
| నిమ్మ పండ్లు | ,, | వచ్చీనాడు | ,, |
| | | గేజరు మామ | ,, |
| | | అట్లా వచ్చె | ,, |
| | | గేజర్ మామ | ,, |
| | | వచ్చీనోని | ,, |
| | | వాడీనోట్ల | ,, |
| | | ......పెట్టు | ,, |

భూస్వామ్య ప్రతినిధి ఎవరైనా ఒకరు కాపలా ఉన్నప్పుడు శృంగార పదాలు పెట్టి పాడ్తారు. అలా చేసి ఆ ప్రతినిధికి ఆనందం కలిగిస్తారు. "జీవితమే శృంగారంగా భావించే" భూస్వామ్య వర్గానికి అది ఆనంద దాయకమవుతుంది. వాళ్ళకోసం, వాళ్ళ సంస్కృతి ప్రభావాన్ని అనివార్యంగా ఆమోదిస్తారు. ఆ ప్రతినిధి అక్కడ లేనప్పుడు ఆపాటలో తమ నిరసనని తెలుపుతారు. అలా నిరసనని తెలపడం కూడా వాళ్ళకి ఆనందమే. అందులో కసికూడా ఉంటుంది. పై పాటలో a, b రెండు భాగాలు ఉన్నాయి. a రెండు పాటలకీ ఒకటే. ఆది పనిలో సమైకం కావడానికి ఉపయోగపడ్తుంది. ఆ పని కొంత జరిగాక లభించిన విరామం. సందర్భం బట్టి b అభివృద్ధి చెందుతుంది. హే. హయ్ శబ్దాలు రాగయుక్తంగా పల్లవిలా మధ్య మధ్య వస్తాయి.

శ్రమనుంచి కూత, కూత నుంచి పాట క్రమంగా అభివృద్ధి చెందింది. కూత రకరకాలుగా కాకుండా ఒకే విధంగా వెలుపడుతుంది. ఎందుకంటే ఇది శారీరకమైన ఇతర చలనాంతో కలిసి ఉండే కంఠ ధ్వనుల ప్రతిబింబ చర్య.

కూతని ఆపుతూ ఆ మధ్య సమయంలో శ్రమకు అనుగుణంగా వెలువరిస్తున్న కేక పల్లవిగా మారడం జరిగింది.

ఈ క్రమంలో పదలయ విశ్రాంతి సమయంతో బాటు పెరిగింది. హై - హెస్సో వంటి శ్రమ ధ్వనులు మాత్రం సమసిపోలేదు. క్రమంగా అవీ ఒక పల్లవిగా మార్పు చెందాయి.

బరువులెత్తేప్పుడు - ఎత్తేముందు 'హ' అని సిద్ధం కావడం - ఎత్తడం - ఎత్తిన తర్వాత ఎత్తిన శ్రమని స్స స్స అని నిశ్వసించడం సర్వసాధారణ శారీరక ప్రక్రియ.

ఇది చాలా రకాలయిన శ్రమకీ - పనులకీ వర్తిస్తుంది. ఈ హ....స్... స్స హా...గా మారి ఐసోగాను. హాస్సోగాను, హైస్సోగానూ......హైలెస్సో గానూ శ్రమ నుంచి పూర్తిగా దూరమైన తర్వాత హుయిలాసగానూ మారింది.

శ్రమ క్రమంలో శ్రామిక పాట శ్రమ తర్వాత అలసట తీసుకునే సమయం మధ్య పాడబడేది ఆవుపు. శ్రమ కూతలో ఆవుపుకు పూర్తి సంబంధం ఉంటుంది.

**వ్యక్తిగత శ్రమ :-** వ్యక్తిగత శ్రమ అంటే శ్రమ (విషయం) వుత్పత్తి సమాజానిదే కావొచ్చు కాని ఆ పనిలో[3] పాల్గొనేది ఒక్క శరీరమే.

ఇందుకు ఉదాహరణగా మోటపాటల్ని తీసుకోవచ్చు. మోట, ఏతాం, గూడుకట్టడం ఇవన్నీ వ్యవసాయానికి సంబంధించినవి. ముఖ్యంగా పొలానికి నీళ్ళు పెట్టేపనికి చెందినవి. రాటుకి, గూడుకి ఏతాంకి ఇద్దరు ఉండగా మోటకి మాత్రం ఒక్కరే ఉంటారు. (దీన్నే కపిల అని రాయలసీమలో అంటారు)

తొండపుతాడు సహాయంతో బొక్కెన బావిలోకి వెళ్ళినపుడు నీళ్ళు నిండుతాయి. ఎడ్లు మోటలాగడానికి 'దిగువ' స్థలం ఉంటుంది. రెండెడ్లను కాడికి కట్టి, ఆ దిగిన స్థలంలోకి ఎడ్లతో సహా మనిషి గబగబా దిగుతాడు. అప్పుడు బొక్కెనతో నీళ్ళు పైకొచ్చి, తొండంలోంచి కాలువలోకి జారుతాయి. మనిషి కొంత విరామంగా వెనక్కి అడుగులు వేస్తూ, ఎడ్లు కూడా వెనక్కి నడిచే విధంగా లాగుతూ ఎగువకు చేరుకుంటాడు. ఆ సమయానికి మళ్ళీ నిండడానికి బొక్కెన బావిలోకి వెళ్తుంది. శ్రమతో కూడుకున్న ఈ పని నిర్వహించే సమయం వేకువ కాలమే. చీకటింకా పోకముందే, చుక్కలింకా కుంకకముందే పని ప్రారంభ మవుతుంది. పై శ్రమ పద్ధతికీ, ఈ వాతావరణానికీ అనుబంధంగానే మోట పాట ఉంటుంది. ఈ శ్రమలో పశువులు కూడా భాగస్వాములే.

ఈ 'ఇద్దరు' మొదట నిద్రను పోగొట్టుకోవాలి. పాట విన్నప్పుడు గుండె జలదరిస్తుంది. పాటలో ఆ రాగం పనికి సంబంధంగానే ఉంటుంది. శ్రమకు దూరమైన పాట నిద్రపుచ్చ గలదేమో గానీ ఇలాంటి పాట మాత్రం నిద్రను దూరం చేస్తుంది. నిద్ర దూరం కావడానికి కూడా ఈ పాట పాడుకుంటారనే వాస్తవం. ఈ పని విరామంతో కూడుకున్న శ్రమను కలిగి ఉంటుంది. మొదట అనుకున్నట్లు శారీరక శ్రమని బట్టి రాగం ఉంటుంది.

"చింతా కిందారో మోటారా
చిగురు మానుంచి ఎడ్ల జోడోయీ
నీ యెద్దుల మెడ మీద మదిర కోడోయీ"[5]

పనినిబట్టి రాగం సాగుతుంటే వాతావరణాన్నిబట్టి ఆకులు కదలడం చెట్లు ఊగడం, చీకటి నెమ్మదిగా తొలగి వెలుగుపరచుకోవడం. పశువులు లయ బద్ధంగా అడుగులేయడం మెడలోని గంటల శబ్దం, బావి గిరక గరగరలాడటం- పనిలోని ఊపునిబట్టి పాట సాగుతుంది.

ఈ శ్రమ స్వభావంవల్ల మాత్రమే శ్రమజీవి 'కడుపులోంచి' పాట రాగయుక్తంగా వెలువడుతుంది. ఇందులో చరణాలు, పాదాలు విరగ్గొట్టడం ఉండదు. పల్లకీ పాటలో చరణాలు పేర్చుకుంటూపోతారు. ఇది సామూహికం. ఈపాట వ్యక్తిగతం కాబట్టి రాగం, పాటపేర్పు పొందికగా ఉంటుంది.

చివికి చిల్లులుపడ్డ తొండం పొక్కెంలోంచి సిప్పకారి పోతుంటాయి. నీళ్ళుపడ్డ శబ్దం మోటగొట్టే రైతు గుండెను కలచి వేస్తుంటది. పొద్దెక్కు తుంటుంది. ఎండ కరకరలాడుతుంటుంది. పశువులు అలసిపోతాయి. ఇలాంటి పరిస్థితిలో శ్రమజీవి తన జీవితంలోని దైన్యపరిస్థితి పాటలో ప్రతిబింబిస్తాడు.

తొండమంతా తొర్రావాయె
బొక్కెనంతా బొర్రవాయె
బొల్లికోడె ఇల్లుసెరె-సిన్నపిల్లగా
పొలం ఎండీ మాడీపాయె[6]

శ్రమ-పనిలో వాతావరణం, పరిస్థితి (Situation) అనే అంశాలు కూడా ముఖ్యం. దీన్నికూడా దృష్టిలో పెట్టుకోవాలి. పైపాటలో కనిపించే దైన్య స్థితి, శ్రమజీవిగల చైతన్యం కాకుండా విపరీత శృంగారం, కర్మ సిద్ధాంతం. మూఢభక్తి విశ్వాసాలను, భూస్వామ్య నీతిని తనకు తెలియకుండానే పాటల్లో గానం చేస్తాడు.

**పాట - పరాయీకరణ** (Alienation)

ఉత్పత్తి పని పద్ధతులు అభివృద్ధి పొందడంతో అనుకరణ నృత్యం శ్రమతో సంబంధాన్ని కోల్పోయి గణ సమాజ సాంప్రదాయాలను తిరిగి చెప్పే వాహికగా సేవ చేస్తూ వినోదం కొరకే పరిమితమయిపోతుంది.

ఇలాంటి పాటలను శ్రమజీవులు పాడుకోవడం జరుగుతుంది. కాని ఈ పాటలు పాలకవర్గ సంస్కృతి దాని అనుకరణ, నీతి, మతం మొ॥ ప్రభావాలతో ఉంటాయి. అంటే ఈ పాట ఎంత మాత్రమూ ప్రజలపాట కాదు.

నిజానికి ఈ శ్రామిక పాటలో శ్రమ, ఆ శ్రమతో పాటకు సంబంధంతో పాటుగా ప్రజలకు సంబంధించిన వస్తువు, వారి జీవితం ఉంటుంది. ఇది శ్రమ జీవుల జీవనానికి, ఆ వర్గానికి అను బంధించి మాత్రమే ఉంటుంది.

ఆధునిక శాస్త్ర విజ్ఞానం వికసించిన కొద్దీ మానసిక శ్రమ-శారీరక శ్రమ లనే కొత్త విభజనకి దారి తీసింది. ఉత్పత్తికి పథకం వేసేవారు పాలక వర్గం-

ఉత్పత్తి చేసేవారు పాలితులు. ఈ కొత్త రకం ఉత్పత్తి సంబంధాలు ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి ఆటంకంగా పరిణమించాయి.

ఫలితంగా సాంకేతిక ప్రగతి స్థాయిలో గమనించదగిన క్షీణగతి - సిద్ధాంతానికీ ఆచరణకూ లోతైన విభజన ఏర్పడింది. పాలకవర్గ సామాజిక వ్యవస్థకు నైతిక సమర్థనలుగా దైవభావన, మతపూజలు విస్తరించాయి. ఈ సంస్కృతి కూడా శ్రామిక పాటల్లో ప్రచారం చేయబడుతుంది.

శ్రమజీవి - ఉత్పత్తి ఫలితాన్ని, తన ఉత్పత్తి శక్తిని, రెంటినీ ఇతరులకు ధారపోస్తాడు. అంటే ఏ శ్రమవల్ల, ఏశక్తివల్ల తను మానవుడవుతున్నాడో ఆ శక్తినీ ఆ శ్రమనీ రెంటిని ఇతరులకు ధారపోస్తున్నాడు.[7]

శ్రమ జీవి ఉత్పత్తి శక్తి ఎంత అధికం చేయబడితే అతడు అంత పరాధీనుడవుతాడు. ఎంత ఎక్కువగా ఉత్పత్తి చేస్తే అంత ఎక్కువగా అదనపు విలువ (సొంత ఆస్తి) పరులకు చెందుతూ ఉంటుంది. ఫలితంగా విరామకాలం ఎక్కువగా గల వర్గం సృష్టింపబడుతుంది. ఆ వర్గానికి శ్రమజీవి తాను చేసిన ఉత్పత్తిని దత్తం చేస్తాడు. తాను మాత్రం భుక్తికి నోచుకోడు.

శ్రమ శక్తి - శ్రమ జీవినుండి వేరైపోయి విరామాన్ని ఒక జీవిత విధానంగా చేసుకున్న వారిని చేరినట్లే, కవిత్వం కూడా శ్రమ విభజన ఫలితంగానే సమాజంలోని కొందరి చేతుల్లోకిపోతుంది. తన స్వాభావిక సమాజ లక్షణాల నుండి దూరమైపోయి వ్యక్తిగత భావావేశానికీ, కృత్రిమతకి ఆలవాలమైపోతుంది. ఈ అంశాన్ని ప్రస్తుతం పాటలు సేకరించినవాళ్ళూ, సేకరిస్తున్నవాళ్ళూ విస్మరించారు. ఈ కోణం లోంచి ప్రజల పాటలను అధ్యయనం చేయడం అవసరం.

ఇక్కడ పని నుండి దూరమైపోయిన ఒక పని పాట (పల్లకీ పాట)ని పరిశీలిస్తే, వాటి స్వరూప స్వభావాలు తెలుస్తాయి.

"ఆ హోయి లేయల్ల హైలేసో
ఆ పిల్లదాన

పెళ్ళిచేసుకుంటే
ఆ పెద్దా కాసుల పేరు
ఆ పెట్టేను గాని
సిరిసిరి మువ్వలు
ఆ సుట్టించి ఒడ్డాణం
నీ సన్ననీ నడుముకూ
రంగమెళ్ళే హే వాడలక్కి
రంగసాని హే మేడలక్కి
సరిపోవ బోలునే
ఆ పెళ్ళికూతురు
బహు పెద్ద మనిసిరా
ఆ సూసి రమ్మంటేను
చేసుకొస్తాదిరా"[8]

ఈ పాటలో పని నిష్క్రమించి పాట మాత్రమే మిగిలింది. అందుకే శృంగారం వస్తువుగానూ, పాట ఒక నిర్మాణతనీ సంతరించుకుంది.

సృజనాత్మకమైన ఉత్పత్తి క్రియ పాటకు ఆధారం. అది శ్రమ జీవిలో తన శక్తిని గురించిన గర్వాన్ని ప్రేమను అతి సున్నితమైన భావాలను కలిగిస్తుంది.[9] ఆత్మ విశ్వాసాన్ని కూడా ఈ పాటలు కలిగిస్తాయి. Ex: పంటసిరి నృత్యం, అనుకరణ నృత్యం.

ఐతే ఉత్పత్తి క్రియలో భాగమైన పాట శ్రమ జీవిని రంజింపచేసి, ఊపు నిచ్చి అతని శ్రమ శక్తిని పెంచడానికి తప్పకుండా ఉపకరిస్తుంది.[10] ఉదా: కలుపు, నాట్లు...దంపుడు, మోట మొ॥ పాటలు.

కలుపు దీసేప్పుడు పాడుకునే పాటనే స్త్రీలు విరామసమయంలో బతుకమ్మ పాటగా కూడా పాడుకుంటారు. విరామ సమయంలో శ్రమ యొక్క అనుభవాన్ని, అనుభూతిని కలగలుపుకుని పాడుకునే పాటల్నికూడా ప్రజల పాటలని అన వచ్చును. పనిలో పాడుకునే పాటలనే కొద్ది మార్పులతో విరామ సమయంలో పాడుకోవడం జరుగుతుంది. విరామసమయంలో పాడుకున్నా పాటలో శ్రమ

స్వభావం ఉంటుంటుంది. Productive labour లో భాగంగానే ఉంటుంది. కలుపు పాటలో కలుపు పని చేసే ఎవరైనా భాగస్వాములే. ఊపు, నిశ్వాసం, పనివేగం వీటినిబట్టి పాట మారుతుంది. పాట విరుగుతుంది పని పెరిగినకొద్దీ ఆశు రచన (Improvise) అవుతుంది. బతుకమ్మ పాటలో శారీరకమైన పని పోయి నృత్యం చోటు చేసుకుంటుంది. కలుపు తీయడమనే చేతుల శ్రమ చప్పట్లు కొట్టడంగా మారింది. తీరిక, ఆనందం అనే అంశాలు బతుకమ్మ పాటలో కనిపిస్తాయి. ఆనందప్రదమైన వాతావరణంలో నృత్యం ప్రధానం. పనిముట్లు గానీ, పనిచేస్తున్న చేతుల శబ్దంగానీ ఇక్కడ ప్రత్యేక సంగీత సాధనమై అకట్టు కుంటుంది. ఈ పాట ఒక కులం, ఒక ఆచారం పాటించే స్త్రీలకే పరిమితమవు తుంది.

పాట రూపంలో, వస్తువులో కొంతమార్పు వస్తుంది. పని పాట - ప్రజల పాటగా మారిపోతుంది. ఈ ప్రజల పాటలోని రూపం, వస్తువు ఇంకా విరామం ఎక్కువైన వర్గం ప్రభావంతో మారుతుంది. ఇది అన్ని రకాల ప్రజల పాటకు వర్తిస్తుంది.

ఉత్పత్తినుండి దూరమైన వర్గంవారి ఆనందం కోసం; లేదా ఆ వర్గం వారిని అనుసరించే వారికోసం; పాట-తన అసలు స్వభావాన్ని కోల్పోతూ క్రమంగా కొత్తదనాన్ని సంతరించుకుంటుంది.

శ్రమజీవులు సృష్టించిన పాటల్ని, కళారూపాల్ని భూస్వామ్యవర్గం వారు మతం కోసం, భక్తిభావన కోసం భూస్వామ్య విలువల్ని ప్రతిష్ఠాపించడం కోసం అనేక రూపాలుగా అనేక మార్గాలలో మలచి మళ్ళీ ప్రజలకు ప్రచారం చేయడం జరిగింది. ఇందులో భాగంగానే భృత్యువర్గం కళలు, కళారూపాలు వచ్చాయి.

విరామం ఎక్కువగా ఉన్న వర్గంవారు పాటలు పాడరు. విని ఆనందిస్తారు. అందుకే వారికి ఒక 'గాయకుడు' అవసరం. ఈ గాయకునికి శ్రమలోంచి వెలువడే గేయం అవసరం. దాన్ని తీసుకుని శిష్ట ప్రీతికోసం సంగీత సాధనా లతో కృత్రిమంగా తన గానానికి పుష్టి చేకూరుస్తాడు. ఈ వర్గం వారికి శృంగారం, దైవభావన అనే రెండు అంశాలు ఇష్టం. ప్రజల పాటల్లో వీటిని

నింపేయడం జరిగింది. ఈ పాటల్లోని రూపం (Form), వస్తువు (Content) రెండూ ప్రజలకు దూరమవుతాయి. ఇలా దూరమైన పాటలు జానపద పాటలుగా పేరు పొంది మళ్ళీ మార్పుకు లోనవుతాయి.

పెట్టుబడిదారీ యుగంలో కళాసాహిత్యాల్లో భారమైన సంగీతం, రెంతర్థాల పదాలు, కృత్రిమ శిల్పం పెరుగుతుంది. నాటకాల్లోనూ, సినిమాల్లోనూ పాట చోటుచేసుకుని, ప్రజావ్యతిరేక సంస్కృతిలో ఒక భాగమవుతుంది. శ్రమజీవులకు శత్రువుగా మారుతుంది.

పని పాటల్లో పని విధానాన్ని రికార్డు చేయడం ఒక లక్షణంగా కనిపిస్తుంది. శ్రామికునికి అనుభవ పాఠంగాను ఉంటుంది. ఉత్పత్తిక్రమంలో ఇలాంటి పాటల ప్రయోజనాన్ని స్వరూప స్వభావాల్ని పరిశీలించాల్సి ఉంది.

నల్లరేగడి ఇరువాళ్ళ దున్ని
దున్నిన రేగళ్ళలో నువ్వులు చల్లి
నున్నటి బండమీద నువ్వులబోసి
ఎండిన నువ్వుల గంపకెత్తి
గంపల నువ్వులు గానుగకెత్తి
గానుక్కు రెండు దున్నలకట్టి
ఎక్కెక్కి కొడితే ఎల్లన్న మల్లన్న[11]

చెప్పులుకుట్టే శ్రమజీవులు చెప్పులుకుట్టే పద్ధతిని ఇలా పాడుకుంటారు.
తోలుతెచ్చినా - అచ్చులుకోసిన
బండకిందేసినా - బేగంబాజు తగురంబోసిన
చెప్పులుకుట్టిన - తయ్యారు చేసిన.[12]

**కుమ్మరి పాట :**

నల్లని గుంటలో నాలుగు తట్టలుతెచ్చి
ఎర్రగుంటలో మన్ను ఏడుతట్టలుతెచ్చి

సల్లగుంటలో నీళ్ళు నాల్గుకుండలుతెచ్చి
ఎఱ్ఱగుంటలో నీళ్ళు ఏడుకుండలుదెచ్చి
ఈమన్ను ఆమన్ను కలరాశిబోసి
పిసికెనే కుమ్మరీ బీరవ్వోలె[13]

**స్త్రీల శ్రామిక పాటలు :**

ఆదిమ సమాజంలో స్త్రీకూడా పురుషునితోపాటు సమానంగా కష్టించి పనిచేసేది. రాను రాను శ్రమ విభజనలో మార్పుల ఫలితంగా స్త్రీల పనులూ, పురుషుల పనులూ బాధ్యతలు వేరయ్యాయి. అధిక శారీరక శ్రమ పురుషుడు చేస్తూ స్వల్ప శారీరక శ్రమ స్త్రీలు నిర్వహించడం జరుగుతున్నది.

| పురుషుల పని పాటలు | స్త్రీల పని పాటలు |
|---|---|
| పడవ పాటలు | దంపుడు |
| పల్లకీ పాటలు | విసుర్రాతి పాటలు |
| బరువులు లాగడం (రోలరు, రైలుపట్టాలు, కరెంటు స్తంభాలు) | కలుపు, నాట్లు, కోతలు. |

పై విభజన చూస్తే స్త్రీలవన్నీ సామూహిక శ్రమ గలవే. ఐనప్పటికి అవి స్వల్ప శ్రమతో కూడుకున్నవి. ఆ శ్రమ కూడా ఒకే రీతి (monotonous) గా ఒకేలా ఉంటుంది. దంపుడు, విసుర్రాయి, కలుపు ఇందుకు ఉదాహరణగా చెప్పవచ్చు. ఈ పాటలు మౌఖిక సంప్రదాయం వల్లనూ, శ్రమననుసరించీ వెలువడ్డాయి.

కేవల మౌఖిక సంప్రదాయం స్త్రీలలో కూడా పురుషులతో సమానంగా ఉంటుంది. కదురు, కవ్వం మొ॥లగు సున్నితమైన పనిముట్లుగల పనికి వాటిని ఉపయోగించే పద్ధతిని బట్టి పాట ఉంటుంది. భూస్వామ్య విధానంలో పురుషాధిక్యం ఉంటుంది. దాని కనుగుణంగానే స్త్రీల హక్కులు జీవన విధానం ఉంటుంది. ఆ ఆలోచనా సరళే వారి పాటల్లో కనిపిస్తుంది. శ్రమనుండి, ఉత్పత్తి నుండి దూరమైన స్త్రీలు వినోద గీతాలకో ఆచారక్రతు గీతాలకో అలవాటు పడ్డారు.

పురుషులకు సంబంధించిన పనులు కొన్ని అధిక శ్రమతో కూడుకున్నవి. ఒకే రకం పని (మోట, ఏతాం) కలిగి ఉంటాయి. మిగిలిన వృత్తి పనులకు సంబంధించిన మగ్గం పాటలు మొ॥లగు వాటిలో పనిముట్లు, చేతులు, మనసు అన్నీ పని మీదే కేంద్రీకరించ బడుతాయి.

భూస్వామ్య సమాజంలో రైతులూ, కూలీలే కాకుండా వృత్తి పనుల వాళ్ళు కూడా తమ శ్రమ ధారపోయాల్సిందే. 'వెట్టి' చాకిరిలో భాగంగా శ్రమ శక్తిని కానుక రూపంలో ఇవ్వాల్సిందే. ఈ ఆంగ్లేయుల రాకవల్ల మిల్లులు పెరిగాయి. రాట్నాలు మూలపడ్డాయి. సాలెవారి వృత్తికి విఘాతం కలిగింది. రాట్నం వడికేప్పుడు, మగ్గం నేసేప్పుడు పాటలు పాడుకునేవారు. ఇందులో ఎక్కువగా తమ దైన్యస్థితిని గురించి పాడుకున్నారు. ఒక పాట చూడండి.

"పంట కాపన్నా పంటెందుకన్నా
కష్టాలు సేస్తారు కరువెందుకన్నా
మిల్లుబట్టలు కట్టి మురిస్తిరన్నా
మాయింటి రాట్నాలు మాకిస్తిరన్నా
మా పొట్టకే కాని తిండి లేదన్నా
పేదాల పొట్టలు కొట్టెదెవరురన్నా"14

ఆధునిక కాలంలో యాంత్రిక వ్యాప్తి శ్రామిక పాటల్ని కొంత తగ్గించ గలిగాయి. శ్రమ స్వరూపం మారుతున్న దశ ఇది. శ్రమనుండి పాట పూర్తిగా దూరం కాలేదు. ఇంకా గ్రామాల్లో భూస్వామ్య విధానంలోనే ప్రజలు జీవిస్తున్నారు.

శ్రమ పరాధీనతవల్ల శ్రామికులలో వైముఖ్యం నిరాశ మొదలైన భావాలు కలిగి అవి పాటల్లో ప్రతిబింబించడం మొదటి నుంచీ జరుగుతున్నది. కాని ఇలాంటి పాటలు ఎక్కువగా రికార్డు కాలేదు.

శ్రమ నుంచి కాస్త దూరమైన పాట ప్రజల జీవితాన్ని చిత్రిస్తూ వారికి అందుబాటులోనే ఉంది. అదేవారి భావ ప్రకటనా రూపం. ఆ భావ ప్రకటనా రూపమే తెలంగాణా రైతాంగ పోరాటంలో ప్రజల పక్షాన నిలిచి ప్రజావ్యతిరేక శక్తులతో పోరాడింది. అదే పాట ఇంకా కొత్త ఉత్తేజంతో వాళ్ళ చేతుల్లో మెరుస్తున్నది. ఎక్కడో ఎగుర్తున్న పక్షి గమ్యానికి చేరక తప్పదు. ఎప్పుడో పరాయీకరణ చెందిన పాట మళ్ళీ ప్రజల సొత్తు కాక తప్పదు. అప్పుడే పని పాటలు, జానపద పాటలు ప్రజల పాటలవుతాయి.

## పాద సూచికలు

1. ప్రజల పాటల సేకరణ గురించి Front Dobie ఇలా అన్నాడు. "Dug up dead bones from one grave yard only to bury them in another".
2. Marxism and Poetry, George Thomson. PPH (1962) P. 12.
3. పై పుస్తకం. పే. 16.
4. ప్రభుత్వ ప్రచురణలో కృతకమైన భాష-దేవరాజు మహారాజు, ఆంధ్ర జ్యోతి (26-10-1975) పే. 6.
5. తెలుగు జానపదగేయ సాహిత్యం. డా॥ బి. రామరాజు, పే. 506.
6. తెలంగాణా గ్రామికగేయాలు. డా॥ జి. లింగారెడ్డి. పే. 50.
7. Human essence. George Thomson. P. 50.
8. ఎల్లోరా. జానపద సాహిత్యం (1983) ?
9. సృజన. జె.సి. భూమితల్లి కడుపు పంట. (1982 జనవరి) పే. 9.
10. —పై పుస్తకం-
11. మిత్రుడు గద్దర్ ఇచ్చిన పాట.
12. పల్లె పదాలలో ప్రజా జీవనం. డా॥ యెల్దండ. పే. 162.
13. పై పుస్తకం. పే. 172.
14. తెలంగాణా గ్రామిక గేయాలు. డా॥ జి. లింగారెడ్డి.

**ఉపయుక్త గ్రంథాలు, పత్రికలు, వ్యాసాలు**

1. సృజన (జనవరి 1982) భూమి తల్లి కడుపు పంట. జె. సి.
2. సృజన. (అక్టోబరు 1982) తెలంగాణా పోరాట పాటలు-ప్రజల పాటలు. జె. సి.
3. Marxism and Poetry. George Thomson. PPH (1963)
4. Human Essence. George Thomson. China Policy Study Group, London. (1977)
5. Illusion and Reality-Christopher Caudwel.

# జానపద వాఙ్మయంలో స్త్రీ

—నాయని కృష్ణకుమారి

జనపదం అంటే మనుష్యులతో కూడుకున్న ప్రదేశం అనే అర్థం నిఘంటువుల ద్వారా సాధించవచ్చు. జనం అంటే మనుష్యులు అనే అర్థానికంటే భిన్నంగా, విశేషార్థం ఒకటి భాసించడం మనకు తెలుసు. రామాయణ కాలం నాటికే 'జనస్థానం' అనే పేరూ, ఆ ప్రదేశంలో ఉన్న జనులు నగర వాసుల కంటే భిన్నమైనవారనే ఎఱుకా ఉన్నది. ఇక్కడి జనం నాగరకులు కారు. సంస్కృతి యొక్క వికాసాన్ని చవిచూచే నగరాలకంటే భిన్నమైన చిన్న చిన్న గ్రామాలలోనూ అడవుల మధ్యా నివసించే వారే ఈ జనం. అనగా ఆ మానుష సముదాయం గ్రామీణుల గుంపో, ఆటవికుల సమూహమో అన్న విశిష్టతను పొందింది. వీళ్ళతో కూడుకున్న వాస స్థానాలు జనపదాలు. జనపదాలకు సంబంధించినదంతా జానపదం.

ఈ వ్యాసం యొక్క ఉద్దేశ్యం, జానపదులైన స్త్రీలను గురించి వివరించడం - పై వివరణను అక్షరశః పాటిస్తే, గ్రామాలలోనూ, అడవుల మధ్యా నివసించే స్త్రీలను గురించి సమాలోచన చేస్తే ఇక్కడ సరిపోతుంచి. కాని, ఆధునికత శత ముఖంగా పెరిగిపోతున్న ఈ కాలాన గ్రామానికీ నగరానికీ మధ్యగల సరిహద్దు రేఖలు చెరిగిపోయి, మసక మసకగా గోచరించడం మనకు తెలుసు రెండింటి మధ్యా విస్ఫుటమైన విభాగ రేఖలు లేవు. అనగా గ్రామీణ యువతులకూ నాగరక యువతులకూ గల ఆంతరమైన, మానసిక పరిణామం కానీ, సంప్రదాయానికి సంబంధించిన ఆలోచనలు కానీ, వారవలంబించే ఆచారాలు కానీ, చాల వరకు పోలికలు కలిగి ఉంటాయే కాని, స్పష్టమైన విభేదాన్ని కలిగి ఉండవు. గ్రామీణ యువతులలో నగర వాసనలూ, నాగర స్త్రీలలో గ్రామీణుల పోకడలూ కనిపించడం కూడా సాధ్యమే.

అందువల్ల 'జానపదం' అనే మాటకున్న అర్థాన్ని మరికొంత విశ్లేషణకు మనం లోను చేయవలసి ఉంటుంది.

ఒక మనుష్యుల గుంపు లేదా జాతి, అతి ప్రాచీన కాలం నుండీ కొన్ని నమ్మకాలనూ, కొంత ఆచారకాండనూ కలిగి ఉంటుంది. తనకు అర్థం కాని విషయాల చిక్కు ముడులను విప్పడానికి కొంత మానవాతీత శక్తి యుక్తులను తానే సృష్టించుకుని, దాని సహాయాన్ని కోరుకుని ఉంటుంది. ఈ నమ్మకాలూ, ఆచారాలు, అతి మానుషమైన ఆలోచనాధార, ఇవన్నీ అతి ప్రాచీన కాలం నుండి కాల ప్రవాహ వేగానికి కొట్టుకుని పోయి కనుమరుగు కాకుండా ఆధునిక కాలం వరకూ నడిచివస్తూ తమ అస్తిత్వాన్ని నిలబెట్టుకుంచే, ఆ సర్వస్వం యొక్క పిండీకృత స్వరూపాన్ని మనం సంప్రదాయంఅని పిలువవచ్చు. ఈ సంప్రదాయం అటు నగర వాసులలోనూ, ఇటు గ్రామవాసులలోనూ, నికరంగా నిలిచి ఉండవచ్చు. ఎక్కడెక్కడ సంప్రదాయంలో ప్రాచీనత, ఆధునికమైన శాస్త్రీయ విశ్లేషణకుకూడా తల ఒగ్గకుండా నిలిచి ఉంటుందో, అటువంటి సాంప్రదాయికులైన మనుష్యులను మనం 'జనం'గానూ, జానపదులుగానూ స్వీకరించవచ్చు. దీనినిబట్టి జానపదులకూ, నాగరికులకూ మధ్య, జనపదం, నగరం, అనే భౌగోళికమైన సరిహద్దులను గీయడం వీలుకాదు - కాబట్టి "జానపదస్త్రీలు" అనగా, అతి ప్రాచీనమైన ఊహ యొక్క ధారను ఆప్యాయంగా పోషిస్తూ, అప్పటి నమ్మకాలనూ ఆచారాలనూ, ఎటువంటి శాస్త్రీయ విశ్లేషణకూ లోనుచేయకుండా, తమ ఆచరణలో బ్రతికించుకుంటూ, సంప్రదాయాన్ని కాపాడుకునే స్త్రీలు అనే అర్థం లభిస్తుంది- అందువల్ల ఈ విశ్లేషణకై మనం, ప్రాచీనతవైపుకు మొగ్గే మానసిక నేపథ్యం కలిగిన నగర స్త్రీలనూ, గ్రామ స్త్రీలనూ ఒకేవిధంగా పరిశీలించవలసి ఉంటుంది.

జానపద స్త్రీలలో మనం, ప్రత్యేకంగా కొన్ని లక్షణాలను గుర్తించి వాళ్ళకు అటువంటి లక్షణాలు పట్టుపడడానికి కారణమైన చారిత్రక నేపథ్యాన్ని కూడా పరిశీలింపవలసి ఉంటుంది. ఆ లక్షణాలు 1. తల్లితనం మీద ఆపేక్ష. 2. ప్రియురాలితనం. 3. కుటుంబంతో పోరాని బంధం.

**1. తల్లితనం మీద ఆపేక్ష** :- 'తల్లి' అనే అర్థాన్నిచ్చే ఏ భాషలోని పదమైనా సరే, దానిచుట్టూ కావలసినంత భావుకత పేరుకుని ఉంటుంది, 'సఫలత'

(fertility) అనే లక్షణం ప్రాచీన మానవుణ్ణి మిక్కిలి ఆశ్చర్యంలో ముంచెత్తిన లక్షణాలలో ఒకటి - ఆదిమ మానవుడు, మొలకెత్తించే లక్షణం కల భూమిని, పిల్లలను కనే శక్తి కల స్త్రీతో, అభేదాన్ని పాటించి కథ అల్లుకున్నాడు. అతనికి తెలిసిన తొలి తల్లి భూమి. తానూ, తనకు తెలిసిన జంతు తతి, వృక్ష సమూహం, అన్నీ భూమిని ఆశ్రయించుకుని బ్రతికేవే. భూమి నుండే తనకు పళ్ళనూ, దుంపల్నీ, ఆకుల్నీ ఇచ్చే వృక్ష జాతి ఉన్నది. మొలక లెత్తుతూ తానెరిగిన పాములూ, చెదలూ, కొన్ని కొన్ని పురుగులూ, మరికొన్ని జంతువులూ అన్నీ భూమిలో బొరియలు చేసుకుని నివసిస్తూ భూమి ఉదరంలో నుండి వచ్చినట్లుగా భ్రమలు కల్పించసాగాయి. అందువలననే మనుష్యుడు కూడా తనను తాను భూమితో సంబంధం కలవాడిగా (Autochthonous) నిర్ణయించు కున్నాడు. అతనికి సంబంధించిన ఎన్నో పురాణ గాథలలో మట్టియొక్క ప్రసక్తి దాని ప్రాధాన్యమూ కథలు కథలుగా అల్లబడి కనిపిస్తుంది.

ఆదిమ మానవుని ప్రవర్తనలో జాంతవ ప్రవర్తన యొక్క లక్షణాలు కొన్ని కనిపించడం మనకు తెలుసు. అతడు కూడా ఉన్నచోట ఉండకుండా ఆహారం దొరికే చోట్లను వెతుక్కుంటూ పోవడం. గుంపు జీవితమే తప్ప వ్యక్తిత్వ లక్షణాన్ని సూచించే కుటుంబ జీవితాన్ని కలిగి ఉండకపోవడం, తొలి రోజుల్లో ఉండేది. ఆ జీవితంలో అతని కుటుంబ బంధం కానీ, కుటుంబానికే పరిమితమైన వ్యక్తిగతమైన బాధ్యతలు కానీ ఉండి ఉండక పోవచ్చు. కుటుంబ భావన అతనిలో తలయెత్తిన మరుక్షణంనుండే అతనికి సంబంధించిన ఆటవిక సమాజం పరిణామ శీలమై ముందుకు సాగిపోవడం ఆరంభించింది. కేవలం, జంతువుకుమల్లే బ్రతికే వ్యక్తికి, ఈ రకమైన కుటుంబ భావన కలగడానికి కూడా అప్పుడతనిలో ఉద్భవించిన రకరకాల (instincts) ప్రేరణలే కారణ మని చెప్పుకోవచ్చు. (1) గుంపు జీవితంవల్ల కలిగిన ప్రేరణ (Group instinct) (2) పైతృకమైన సంబంధాల వల్ల కలిగిన ప్రేరణ (Paternal instinct) (3) తనను తాను రక్షించుకోవాలన్న ప్రేరణ (Self Protection Instinct) (4) లైంగిక వాంఛకు సంబంధించిన ప్రేరణ (Sexual instinct) ఇటువంటివే మరికొన్ని ప్రేరణలు అతనిని వ్యక్తిత్వ పరి ణామం వైపుకు లాక్కుపోగలిగాయి. ఈ ప్రయత్నంలో మనుష్యునికి ఆహార

సంపాదనకై అక్కడక్కడా తిరిగే అలవాటు వెనుక పట్టి, ఆహారాన్ని స్వయంగా తానే ఉత్పాదన చేసుకొనే శక్తియుక్తులు హస్తగతం కానారంభించాయి. అనగా అనగా అతని జీవితంలో ఆటవిక దశ (Savagery) వెనక పట్టి నాగరిక దశకు (Civilization) పూర్వ రంగమైన మోటుదశ (Barbarism) ఆరంభం కాసాగింది.

దావాగ్నుల వలన అడవులు దహింపబడిన చోట, భూమిని చదును చేయడం, కర్ర సాధనాలతో నేలలో చిన్న చిన్న గుంటలు చేసి, అంతకుముందు సేకరించుకొని ఖాద్య పదార్థాలుగా తామెరిగిన గింజల నందులోవేసి కాలి బోటన వేళ్ళతో గుంటలను అదిమి పూడ్చడం వంటి చర్యలను మానవుడు చేపట్టడం జరిగింది. ఈ చర్యలు ఎక్కువ శరీర బలాన్ని కోరేవికావు. అంతేకాక ఆహార సముపార్జనకై తిరిగే శ్రమ యిక్కడ లేదు. అందువల్ల ఆనాటి సమాజంలో, ఆటవిక సమాజదశకు భిన్నంగా స్త్రీ పురుషులకు సుంతతీరిక సమకూర నారంభించింది. ముందు పేర్కొన్నట్లుగా, 'సఫలతాగుణం' (Fertility) చేత స్త్రీకి, భూమికి, అభేద భావమేర్పడి ఉండడం వలన, వ్యావసాయిక దశకు సమాజం అందుకున్న తొలిరోజులలో ఆ రంగంలో స్త్రీకి సర్వ ప్రథమ స్థానం నిర్దేశింపబడి ఉండేది. స్థిరమైన కుటుంబ జీవనరంగంలోనూ ఆమెకు ప్రధానమైన పాత్ర నిర్దిష్టమై ఉండేది. ఈ ప్రాముఖ్యం స్త్రీకి కలగడానికి ముఖ్యమైన గుణమే ఆమెకు కల 'తల్లితనం'

ఈ నాటికీ జానపదుల ఆచార వ్యవహారాలలో వారి సాహిత్యంలో ఈ లక్షణం ప్రస్ఫుటమౌతూనే ఉంటుంది ముఖ్యంగా వ్యావసాయక రంగంలో, పొలంలో జడ్డిగంలో గింజలునింపి, నాగేటి చాలువెంబడి విత్తనాలు పడేటట్లు చూచుకునే బాధ్యత వహించేవారు స్త్రీలే. గింజలు మొలకలెత్తిన తరువాత కలుపులు తీసేవారు స్త్రీలు, పల్లపుపొలాలైతే నాట్లు వేసేవారు స్త్రీలు, మగవాడు మోట కొట్టగా నీళ్ళను, మడవలకు మార్చేవారు కూడా స్త్రీలే. సాధారణంగా ఈ పైపనులన్నీ స్త్రీలే చేస్తారు. ఇవి బరువుపనులు కావు కనుక వీటిని స్త్రీలు చేస్తారనే సమాధానం కొంత తర్కసహంగా కనిపించినా, గింజలు చల్లేటప్పుడు స్త్రీ హస్తాల నుండి ఆ పని జరిగితేనే పంట బాగా పండుతుందనే నమ్మకం గ్రామస్థులలో నూటికి నూరుపాళ్ళు కనిపించడం ఈ నాటికీ మనం చూడవచ్చు. చేను బాగా పండడాన్ని, పంట యీనడమనీ, కంకిపోసుకుంటే చేను పొట్టతో ఉన్నదనీ, చేనులో

గింజల్ని చల్లడాన్ని, ఋతుకార్యాన్ని సూచించే పదమైన, ఎదపెట్టడమనీ వ్యవహరించడం చూస్తే "సఫలత" "సంతానోత్పత్తి", అనే అంశాలతో ఆనాటి మనిషి భూమి సాగును పోల్చిచూచుకున్నట్లు స్పష్టమౌతూ ఉంటుంది. వర్షాభావం వల్ల కరువు కాటకాలు భూమిని చుట్టుముట్టినప్పుడు, పడుచు ప్రాయంలో ఉన్న స్త్రీ పొలంలో దిగంబరంగా తిరిగితే వర్షాలు కురుస్తాయనడం, పంటపండని భూమిలో ఆలుమగలు సంభోగిస్తే చేను విరగ పండుతుందని నమ్మడం, జానపదుల నమ్మకాలుగా మనం గుర్తించవచ్చు. ఇటువంటి ఆచారాలు, అభిప్రాయాలు, పై అంశాన్నే స్పష్టంచేస్తున్నాయి మొదటి నుండీ సఫలతాంశం యొక్క ప్రాధాన్యాన్ని బట్టి స్త్రీకి కూడా కుటుంబ జీవితంలో ప్రాధాన్యం ఆరోపింపబడ్డది. కుటుంబం మొత్తం కాల ప్రవాహంలో ప్రయాణిస్తూ అందుకు ఆధారంగా చేసుకున్న నావలాగా స్త్రీ స్థానం నిర్ణయింపబడ్డది. ఈ నిర్ణయాన్నీ, తల్లిగా స్త్రీకి కల ప్రాధాన్యాన్నీ మనం జానపదుల పాటల్లో, కథల్లో, స్పష్టంగా చూడవచ్చును - తల్లికికల గౌరవాన్నీ, దర్పాన్నీ జానపదులు తమ పాటల్లో పొదగడం కనిపిస్తుంది. - సంతానవతి యైన స్త్రీ అందల మెక్కిన మహారాణి వంటిది. గొడ్రాలి బ్రతుకు అరిపేద బ్రతుకు

"కొత్త చింతపండు గోనెల్ల చీకు
గొడ్రాలి వస్త్రాలు పెట్టెల్ల చీకు" అని సంతానవతి కాని స్త్రీ యొక్క దయనీయ స్థితిని జానపద సాహిత్యం వివరిస్తుంది.

'తిండేను తియదోస పండే తినాలి
కండేను కొడుకుల్ల కాన్పే కనాలి' అన్న వాంఛ స్త్రీకి కల వాంఛలలో పరాకాష్ఠనందుకున్న వాంఛ. సంతానం కొరకు, స్త్రీలు దేవుడికి, 'గుడి దిరుగు వస్త్రమ్ము గుమ్మడీ పండు. దాగళ్ళ వడపప్పు దండి బెల్లాలు' కానుకగా అర్పించి ఆయన గుడిముందు "కౌమాళ్ళ నియ్యమని కోరి" ప్రాణాచారం పడతారు.

"గోరింట పువువంటి కొడుకు నెత్తుకుని" బావి నీళ్ళకు వచ్చే బాలింతరాలి రూపం చూచే వాళ్ళందరికీ మనోజ్ఞంగా వెలిగే రూపం.

"మాసిన్న పటుచీర మణవలకు పసుపు
కళ్ళాది కాటుక్క పళ్ళాది యెరుపు
ఆనాడ బాలింత అబ్బాయి తల్లి" అని అందరూ ఆవిడను ప్రశంసిస్తారు. తల్లి దృష్టిలో తను కన్న సంతానం అన్ని అందాలకూ నిలయం.

హంసల్లు హంసల్లు అందురే కాని
హంసలకు రూపేమి ఆటలే కాని
పార్వాలు పార్వాలు అందురే కాని
పార్వాలకు రూపేమి పలుకులే కాని
హంసల్లు మా యింటి ఆడపడుచుల్లు
పార్వాలు మా యింటి బాలపాపల్లు - అని తన సంతానాన్ని ప్రకృతి సంతతితో పోల్చి చూచుకుని తల్లి మనసు మురిసిపోతుంది. కొడుకుగానీ కూతురుగానీ ఆమె కంటికి దీపం.

ఇంతింత దీపమ్మ ఇల్లల్ల వెలుగూ
ఈశ్వరుడి చందమామ జగ తెల్ల వెలుగూ
గోరంత దీపమ్మ కొండలకు వెలుగూ
మాడంత దీపమ్మ మేడలకు వెలుగూ
మా యింటి పాపాయి మా కళ్ళ వెలుగూ"
అని తల్లి అభిప్రాయపడుతుంది.

"వీధి నెందరు ఉన్న విసరదే గాలి
రచ్చ నెందరు ఉన్న రాదమ్మ వాన" కాని తన బిడ్డ కంటికింపుగా వాకిట నిలచుంటే, వాకిలంతా, "మొగలి పువ్వుల గాలి ముత్యాల వాన".

ఆ బిడ్డ పాలకేడ్చినా నీళ్ళకేడ్చినా తల్లి మనసు విలవిలలాడిపోతుంది.

ఏడ్చే పిల్లవాణ్ణి ఊరుకో బెట్టే ప్రయత్నంలో
"ఏడవకు ఏడవకు వెఱ్ఱి నా తండ్రీ
ఏడిస్తె నీ కళ్ళు నీలాలు కారు
నీలాలు కారితే నే చూడ లేను
పాలయిన కారవే బంగారు కండ్లా" అని అర్థిస్తుంది. అంతేకాక, ఏడ్చే పాపాయిని ఊరుకో బెట్టడానికి చుట్టూ ఉన్న ప్రకృతిని అర్థిస్తుంది.

'పిల్లి రావే పిల్లి పిల్లల తల్లి
పిల్లలకు పాలిచ్చి పల్లెలకు పంపు
అబ్బాయికి పాలిచ్చి ఆడుకో పంపు' అని పని పురమాయించి,

పిల్లెన్ని కన్నుల్లు బీరపువ్వుల్లు
అబ్బాయి కన్నులు కలువరేకుల్లు
చిన్ని నా పాపాయి సిరిమొగం చూచి
సిగ్గుపడి చంద్రుడూ పొడవ జాలండూ' అని తన బిడ్డ అందాన్ని వర్ణి స్తుంది. ఆ బిడ్డ నిద్రకు పడితే ఆమె దేవతల్ని సేవకుల్ని చేయడానికి కూడా వెనుకంజ వేయదు.

"చిన్ని నా అబ్బాయి నిద్ర కేడిస్తే
భద్రకాళి పాలిచ్చు బ్రహ్మ జోకొట్టు—
శివుడు నిద్రాబుచ్చు సిరి పాట పాడు—" అని నమ్మకంగా పలుకు తోంది.

తల్లి ఊహించే తన పాప అలంకారాలన్నీ మనోహరమైనవి. కొడుకును బాగా అలంకరించి చల్లగాలికి తిరిగి రమ్మని ఏటిగట్టుకు పంపుతుంది. ఆ సంద ర్భంగా వాడిని అలంకరించడానికి,

'తేరె మా అబ్బాయికి ముత్యాల చుట్టూ
ముత్యాల చుట్టుకూ మూడురేకల్లూ
రత్నాల చుట్టుకూ రావి రేకల్లూ' అని నిర్ణయించి, దానికి,

'వజ్రాలు తాపిరీ వాడి మామల్లూ
కెంపుల్లు తాపిరీ వాడి బాబుల్లూ' అని వివరిస్తుంది.—

కుమారుణ్ణి కన్న తల్లికి తన పుట్టినింటితో వియ్య మందాలన్న కోరిక ముమ్మరంగా ఉంటుంది. తాను పుట్టి పెరిగిన యింటికీ, మెట్టిన యింటికీ మధ్య దూరం పెరగ కూడదన్నది తర్కసహమైన ఆలోచన అందువల్ల, "అందితే అన్నతో వియ్య మందాలి, ఆడితే వదినతో జగడమాడాలి" అన్నది అవిడ

కోరిక- తన అన్నదమ్ములు, అల్లుడు కాబోయే తన కొడుకుని చూచి బెదరడం ఆవిడ అభిమతం. ఆ పిల్లవాడి అడుగులకు మడుగులు ఒత్తుతూ, మేనమామలు అన్ని రాచమర్యాదలూ జరపక తప్పదు. అందుకే

'పెదమామ తెచ్చాడు పచ్చల్ల దండ
నడిమామ తెచ్చాడు నాగ బంధాలు
చినమామ తెచ్చాడు చిలకల్ల తొట్టి' అని ఆ తల్లిమనసు పాటలు పాడుకుంటుంది.

మామ కూతురి మెళ్ళో "కానకుండా పుస్తె కట్టేదా" మని కాచుకుని కూచునే తన కొడుకు దొంగకాదు. పెద్ద దొరబాబు. అందుకే ఈ పిల్లవాడెవరని ఎవరైనా ప్రశ్నిస్తే.

"ఈ యిల్లు మాదమ్మ పీరు మావారు
దంతపూ తలుపుల్లు దరవాజులు మావి
ఈ రచ్చకూచున్న రాజు మా బాబు" అని ఆమె తన కొడుకుని గురించి సగర్వంగా చెప్పుకుంటుంది.

ఊరి వారందరూ తన బిడ్డను తను చూచినట్లే చూస్తారని నమ్మకం అందుకే తన బిడ్డకు కంసాలి మువ్వలు కడతాడు. నగలవర్తకుడు రవ్వలు పేరుస్తాడు. దారిన పోయేవారు బహుమతులిస్తారు. ఇదంతా గారంతో బయటివారు చేసే కూరిమి చేష్ట—

ఇంత ముద్దు చేసినా పిల్లవాడు చదువుకోక మారం చేస్తే
"చదువుకో నాయనా చదువుకో తండ్రి
చదువు కుంటే నీకు సౌఖ్య మబ్బేను" అని మందలించి, అప్పటికీ వాడు తన మాట వినక పోతే,

"చదువంటె అబ్బాయి చెండికేశాడు
బద్దె పలుసా రావె బుద్ధి చెప్పాలి" అని సుకుమారంగా బెదిరిస్తుంది. తన బిడ్డ చదువుల సరస్వతి కావాలనీ, లక్ష్మి సంపన్నుడు కావాలనీ ఆమె కోరుకుంటుంది. శ్రీలక్ష్మి, వరలక్ష్మి ఎవరిని పొందమంటావని ప్రశ్నిస్తూ ఆమె దగ్గరకు వస్తే,

"తూర్పు ఇంట్లో ఉన్న పెదబాబును పొందు
పడమ టింట్లో ఉన్న బుచిబాబును పొందు"

అని, తానే అత్తగారైనట్లు ఆజ్ఞలు పెడుతుంది. కొడుకంటే ఇంత మురిపెం ఉన్న తల్లికి కూతురన్నా మక్కువ ఎక్కువే. తన కూతురు అందాన్ని చెప్పుకుంటూ,

"చిక్కడూ పువ్వెరుపు చిలుక ముక్కెరుపు
చిగురెరుపు చింతల్ల దోరపండెరుపు
రక్కెస పండెరుపు రాగి చెంబెరుపు
తా ఎరుపు అమ్మాయి తన వారిలోన"

అని వివరిస్తుంది - కొడుక్కు తీరు తీరులుగా చేయలేని అలంకారాలను కూతురి విషయంలో చేయడానికి తల్లికి వీలు కలుగుతుంది.

"చిన్ని నా అమ్మన్న చీర కేడిస్తే
నెయ్యవోయి సాలెవాడ నేత్రంపుపట్టు
వెయ్యవోయి కంసాలి వెండి జల్తారు"

అని ఆ చీరెను కూతురుకు కట్టపెడుతుంది. అట్లాగే గాజుల సరదా ఒకటి.

'పట్నం నుంచి వచ్చాయి పచ్చ గాజుల్లు
పచ్చన్న మా చిన్ని అమ్మి చేతుల్లు
ఊరు దిరిగి వచ్చాయి ఉత్త గాజుల్లు
గుత్తాన మా చిన్ని అమ్మి చేతుల్లు'

అని మురిసిపోయి.

'చిన్నారి పొన్నారి గాజుల్ల సెట్టి
తేరె మా అమ్మాయికి తేనె గాజుల్లు
పాడుతూ తొడిగిస్తు పచ్చ గాజుల్లు
నవ్వుతూ తొడిగిస్తు నల్లగాజుల్లు
ఏరేరి తొడిగిస్తు ఎర్రగాజుల్లు' అని సంబర పడుతుంది. పిల్ల పెద్దదౌతున్న కొద్దీ ఆమె పరాయి యింటికి పోతుందన్న దిగులు తల్లికి. కొత్తచోట పిల్ల మెలగ వలసిన తీరును గురించి రకరకాల ఉద్బోధలు చేస్తుంది.

వాకిట తలవిప్పి ముడువకూడాదు
నలుగురిలో పుట్టిల్లు పొగడకూడాదు
పోయినాచోటను బుద్ధిగలిగుండు
ఎవ్వరేమన్నాను ఎదురాడకుండు
పలుమారు పలువిప్పి నవ్వకూడాదు
అత్తగారితో వాదు చేయకూడాదు.

అని తల్లి వివరిస్తుంది. ఆడపిల్ల అత్తగారింట బండెడు చాకిరి చేయడానికి పుట్టినింటనే తరిఫీదు కావాలి. వడ్లుదంచడం, వంటచెయ్యడం, ఇల్లు దిద్దుకోవడం ఆవిడకు మంచినీళ్ళప్రాయంగా అభ్యాసం కావాలి. లేకపోతే మెట్టినచోట కష్టాలు తప్పవు. అందుకని చెల్లెలు అన్నను వస్త్ర వాహనాలు అడగదు. నగలు నాణేలు అడగదు.

"నా చేతిరోకళ్ళు నల్లరోకళ్ళు
చేయించు అన్నయ్య చేవరోకళ్ళు
వేయించు అన్నయ్య వెండి పొన్నుల్లు"

అని అర్థిస్తుంది.

సువ్వని నేనొక్క పోటేసితేను
దిక్కులు పిక్కటిల్లు సూరన్నకదులు
అస్సని నేనొక్క పోటేసితేను
ఆకాశం తల్లడిల్లు చందమామ కదులు—

వడ్లు దంచడం, తల్లి యిచ్చిన తరిఫీదు వలన ఆవిడకు చాలా సులువైన విషయం. అయితే ఈ దంపుకుకూడా ఆడపిల్లకు తోడుకావాలి. ఆ తోడు ఇంటి కోడలైతే యింకా మంచిది.

"వజనాల బండమీద వడ్లెండ బోసి
ఉల్లిపువులా జల్లెడ మల్లెల్ల చేట
వడ్లోడు చేసిన వన్నెలా గజము
కమ్మరోడు చేసిన గంటల పొన్ను
కుమ్మరోడు చేసిన గుండు కుందేనా
కుసుమ రోలూ దుడిచి కుందెండ్లు బెట్టి

కంకణాల చేత గజమందు కోని
ఉంగరాల చేత ఊది పోటేసి
ఒక్కదాని పోటు ఒనగూడదన్న
వదినెనూ లేపరా అన్న రఘురామా''
అని అన్నకు చెపుతుంది.

అలాగే వంటచేయడంకూడా!

"వంట వంటనగానె వంటెంత సేపు
వదినల్లు మరదళ్ళు వాదాడినట్లు
దంపుదంపనగానె దంపెంత సేపు
ధాన్యరాశులమీద చేయివేసినట్లు" అని ధీమాగా చెప్పుకుంటుంది. అంతే కాక, పెండ్లయి అత్తవారింటికి పోయిన పిల్లకు, పుట్టినిల్లు ఎంతదూరమున్నా నాలుగడుగులే. దంచవలసిన బియ్యం ఎన్ని తూములున్నా నాలుగు వాయిలే. ఆ పిల్ల దృష్టిలో "చేషలము లేని వారిమాట" మాట ఎట్లాకాదో చేయెత్తి వేయని పోటు, పోటు అట్లాకాదు. అబ్బాయి అందలాలూ గుర్రాలూ కోరితే అమ్మాయి పసుపూ కుంకుమా కోరుకుంటుంది, పిల్లల తల్లి అయ్యాక, ఉయ్యాలలూ ఉగ్గు గిన్నెలూ కొనడానికి మోజు చూపిస్తుంది.

తన తమ్ముడికిగానీ, అన్నకుగానీ పెళ్ళయితే ఆడబిడ్డగా అధికారం చూపిస్తూ సోదరుణ్ణి, కొత్త కోడల్ని గుమ్మం దగ్గర నిలబెట్టి కోరికలు కోరు తుంది. అంతకుముందే అన్నదమ్ముడు, అప్పజెల్లెల్ని బతిమిలాడుతూ,

'సోల్డు సోల్డు ముత్తాలిత్తా సోంపూల దండలిత్తా
కూకుండ పీటలిత్తా కురుమాయి గిన్నెలిత్తా,
ఏటికి ఎద్దునిత్తా పాడీకి బర్రెనిత్తా,
పెండదియ్య బోయనిత్త బోయనీకి ముంతలిత్త
తలుపుదియ్ అక్కలాలా తాల్నడపక' అంటాడు. అప్పుడు ఆడపిల్ల,
'తాలేదీ ముంతేదీ తాంబూల్లమేదీ
పడుచునుగన్నాతల్లి పెద్దరికమేది
చీరేదీ సారేదీ అరుణమ్మ ఏదీ

పడుచును గన్నా తల్లీ పెద్దరిక మేదీ" అని ఎత్తిపొడుస్తూ, బిడ్డను కని తన కొడుక్కు ఇవ్వాలని మాట తీసుకుని తలుపు తీస్తుంది.

తల్లికి తన కొడుక్కు అన్న దమ్ముడి కూతుర్ని కోడలుగా తెచ్చుకోవాలనే కోరికతో పాటు, తన కూతుర్ని తన తమ్ముడికే ఇచ్చి చేయాలనే కోరిక కూడా ఉంటుంది. భర్త వైపు చుట్టరికం పెరగకుండా చెయ్యాలన్న యోచన ఇందుకు కారణం కావచ్చును.

ఇట్లా జానపద వాఙ్మయంలో స్త్రీ ప్రదర్శించే తల్లి తనం మీద ఎంతైనా వ్రాయవచ్చు.

## 2. ప్రియురాలి తనం :

జానపద సాహిత్యాన్ని తరిచిచూస్తే, కుటుంబేతి వృత్తానికున్నంత ప్రాధాన్యం, శృంగారానికి లేదు. కుటుంబమూ, అందులో ఉన్న సభ్యులూ, వారి మధ్యగల ఆవేశ కావేషాలూ చాలా నిశితంగా ఈ సాహిత్యంలో వివరింపబడి ఉంటాయి. కుటుంబ సాహిత్యమంతా స్త్రీని కేంద్రంగా చేసుకుని ఆమె చుట్టూ గిరగిరా తిరుగుతూ ఉంటుంది. ఈ కౌటుంబిక అనుబంధానికే తల్లీ బిడ్డల ప్రేమను జోడించవచ్చు. పైన స్త్రీకి గల తల్లి తనాన్ని గురించి ప్రస్తావించడం జరిగింది. కుటుంబంలో భార్యా భర్తలు ప్రాధాన్య వివక్ష కలిగిన పాత్రలు, అయితే భార్యా భర్తల మధ్యగల సాంసారికమైన బాధ్యతల్ని వర్ణించినట్లుగా. పరస్పర ప్రేమనూ శృంగార భావాన్నీ వర్ణించడం ఈ సాహిత్యంలో అరుదు. అక్కడ ఆలుమగలు నిత్య జీవన వ్యాసంగంలో[3], సంసార శకటాన్ని ఎత్తు పల్లాలున్న బ్రతుకు బాటమీద, చల్లగా సాగించడంలో నిమగ్నులై ఉంటారు. తల్లికి పిల్లల పోషణ, బంధుజనపు ఆలన పాలన, కుటుంబానికి తిండి అమర్చడం, ఇవి ముఖ్యమైన అంశాలు. పోతే, "జానపద స్త్రీ ప్రియురాలి తనం ఎక్కడ ప్రస్ఫుట మవుతుందని ?" అని ప్రశ్న వేసుకుంటే, కుటుంబ బంధానికి వెలిగా, అవివాహిత ప్రేమగానో, పరకీయ ప్రేమగానో అది ఆ సాహిత్యంలో సాక్షాత్కరిస్తుంది.

ముఖ్యంగా ఈ ప్రేమ ప్రకటన గ్రామిక గేయాలలో కనిపిస్తుంది. శ్రమ యొక్క తత్వాన్ని బట్టి విభాగం చేస్తే, ఎక్కువ కష్టం కలిగించేదీ తక్కువ కష్టం కలిగించేదీ అని రెండు రకాలుగా దీన్ని విభజించవచ్చు. రోడ్లు వెయ్యడం,

బండలు కొట్టడం, చేపల వేట, మోట కొట్టడం, బంతి కొట్టడం వంటివి ఎక్కువ కాయకష్టాన్ని అపేక్షించేవి. ఇటువంటి శ్రమను పురుష శ్రమ అనవచ్చు. కారణం ఈ పనులు సాధారణంగా పురుషులకు నియమితమై ఉంటాయి. వీటిని బండపనులు అని కూడా అనవచ్చు. రెండవ రకం, తేలిక కష్టాన్ని అపేక్షించేదిగా ఉంటుంది. చేలలో నాట్లు వేయడం, కలుపు తీయడం, గింజలు వేయడం, వంటి పనులు పై పనులతో పోల్చినపుడు తేలిక పనులు. ఈ శ్రమను స్త్రీ శ్రమ అనవచ్చు. శ్రమాపనోదనానికి గొంతెత్తి పాటలు పాడడం ఒక మార్గం. శరీరం చేసే కష్టంవలన, మనస్సులో పేరిన వ్యగ్రత (Tension)ను వెలికి తీసి మనస్సును ప్రశాంతంగా, హాయిగా ఉంచగలిగేది గొంతెత్తి పాడేపాట. అందువల్ల, పాటలో కూడ, శ్రమను మరిపించగలిగే ఆహ్లాదకరమైన శృంగారం, హాస్యంవంటి భావనలకు చోటుఉంటుంది. చాలచోట్ల మోతాదుమించిన శృంగారానికి స్థానం ఉంటుంది. ఈ పాటలు పాడేవాళ్ళు చాలావరకు మగ వాళ్ళయినా ఇందులో చిత్రితమయ్యేది స్త్రీ! ఆమె హావభావాలూ, అంగాంగ వర్ణనా, అలంకార ప్రియత్వమూ, ఏకాంత గోష్ఠి వంటివి ఒక్కొక్కసారి, ప్రశంసా భరితమైన ఆలోచనల సారాంశంగానూ ఉంటాయి.

ఒక స్త్రీ ఆలోచనవలె కనిపించినా, ఈ క్రింది పాట 'జట్టి జాము పాట'- కోలలు తాటిస్తూ పురుషులు అడుగులు లయబద్ధంగా కదుపుతూ పాడే యీ పాట గమనించండి.

పచ్చరైక పచ్చ బట్ట మామ
పగలే లంకించుకుంది వాన
ఏమి సేద్దు ఎల్లమంద మామ
గుంజి గుంజి కొడుతుంది వాన
ముత్యాల పైట చెంగు మామ
ముద్ద ముద్దగ తడిపింది వాన
ఏమి సేద్ద ఎల్లమంద మామ
గుంజి గుంజి కొడుతుంది వాన-

ఈ పాదాలను చిన్న చిన్న మార్పులతో, ఎంత నిడివిగానైనా విస్తరింప చేస్తారు. విస్తరించినంత మేరా, ఎఱ్ఱబట్ట, ఎఱ్ఱ రైక, తెల్లబట్ట, తెల్లరైక-నల్ల బట్ట నల్ల రైక అంటూ స్త్రీ పరమైన వర్ణనే సాగుతూ ఉంటుంది.

స్త్రీ అలంకార ప్రియత్వాన్ని తెలుపుతూ పురుషుడు చేసే ఈ ఫిర్యాదును పరికించండి.

గడ్డి గోసేదెపుడు మోపు గట్టేదెపుడు
పొద్దు పోతది పిల్లో మరదలు పిల్ల
సీర గట్టే దెపుడు సింగులు వోసే దెపుడు
పొద్దు పోతది పిల్లో మరదలు పిల్ల
సిగ ముడిసేదెప్పుడు బొట్టు వెట్టే దెపుడు
పొద్దు పోతది పిల్లో మరదలు పిల్ల-

అందుకు మరదలు పిల్ల

పొద్దుపోతే పొయె ఎనక బస్సూ జూడు
బావో ఓ రంగయ బావా
ఇటికె లారీమీద కన్ను సైగా జేసి
కూడిపోదము రావె బావో ఓ రంగయ బావ

అని సమాధాన మిస్తుంది-

స్త్రీకి, రైకలమీదా, గాజుల మీదా ఉండే ప్రీతిని మరో పాటలో చూపిస్తున్న వైనాన్ని గమనించండి. ఇది సంభాషణాత్మకమైన ధోరణిలో ఉంది.

"సుక్కురారము నాడు మరిది సూరయ్య
సుక్కుల రైక మనసాయె మరిది సూరయ్య
సుక్కురైక మనసైతె వదిన ఓలాస
చేతల డబ్బు లేదమ్మో వదిన ఓలాస
శనివారము నాడు మరిది సూరయ్య
చేతిల గాజులు మనసాయె సూరయ్య
చేతిల గాజులు మనసయితే వదిన ఓలాస
చేతల డబ్బు లేదమ్మో వదిన ఓలాస"

ఈ పాట, స్త్రీ పరమైన అలంకార వస్తువుల్ని అందుకుంటూ ఎంత నిడివిగానైనా చరణాలు పెంచుకుంటూ సాగవచ్చు. ఇందులో ప్రాముఖ్యం వహించే వస్తువు స్త్రీకిగల అలంకారప్రియత్వం అనేది మనం గమనించాలి.

విచ్చల విడి శృంగారాన్ని కోరుతూ, స్త్రీని అర్థిస్తున్నట్లున్న ఈ పాట చూడండి. ఇదీ సంభాషణ రూపంలోనే కనిపిస్తుంది.

"పది రూపాయలిత్తా పట్టంచు చీరెలు దెత్తా
రావే బోగం సాని దేవుడున్న గుట్టమీదికి-
పదీ రూపాయ లొద్దూ పట్టంచు చీరెలొద్దూ
నేను రానూ పోలీసయ్యో దేవుడున్న గుట్టమీదికి"-

ఇట్లా పాదాలు పెంచుకుంటూ, శ్రమ చేస్తున్నంతసేపూ ఈ పాట పాడవచ్చు.— ఇక్కడ ప్రధాన విషయం భోగ్య వస్తువుగా భావించి, స్త్రీ చుట్టూ పాటలల్లడం. ఇది జానపదుని ఆలోచనలలో స్త్రీకి అతడిచ్చిన స్థానాలలో ఒక స్థానానికి సంబంధించిన పాట.

అనుకోకుండా, ఏదో నిర్ఘాతపాతం సంభవించనున్నపుడు, పురుషుడు, తన ప్రియురాల్ని సంబోధిస్తూ, తమ యిద్దరి జీవితాలూ కడతేరవలసిన పద్ధతిని ఈ పాటలో తీరుస్తున్నాడు. "స్కైలాబ్" తెలంగాణాలో కరీంనగర్ దరిదాపుల పడుతుందన్న వార్త వచ్చినప్పుడు పుట్టిన పాట యిది—

కైలాబు పడతదంట జనమంతా సత్తరంట
పోదాం పదే పిల్లో బంగారి రామ చిలుక
నిజాంబాదా మంది నీళ్ళు లేక సత్తరంట
కరీంనగరూ మంది కట్టాలూ పడతరంట
బంగార మముదాము బాసండ్ల నమ్ముదాము
కల్లు సారా ధాగుదాము కైలాస మందుదాము
పోదాం పదే పిల్లో బంగారి రామ చిలుక
యాటాలూ గోసుదాము కోళ్ళాను గోసుదాము
కల్లు సారా దాగుదాము కైలాస మందుదాము ॥పో॥

ఇక్కడ ప్రధానంగా ఎంచవలసిన విషయం, అతి క్లిష్ట పరిస్థితులలో కూడా జానపదుని మనోభావన, స్త్రీని తోడుగా చేసుకుని, ఏ విధంగా పరిభ్రమిస్తుందో గ్రహించడం.

జానపద స్త్రీ భావనలో, విరహిణి లక్షణం, గేయ రూపంలో జాలువారుతూ ఉంటుంది. విప్రలబ్ధగా, అభిసారికగానే కాక తిరస్కృతగా కూడా ఆవిడ చిత్రింపబడుతూ ఉండవచ్చు. ఈ క్రింది పాట చూడండి.

ఒంటి మోట బాయి కాడ వల సంజల మామయ్యో
వన్నె కాడు వక్కడుండే వల సంజల మామయ్యో
నీళ్ళ బిందే దీసుకోని ,, ,,
నీళ్ళ కంటూ నేను బోతే ,, ,,
నీళ్ళు లేవూ నువ్వు లేవూ ,, ,,
ఎదురు గడ్డ లెక్కుతుంటే ,, ,,
ఎడమ కన్నూ శోకాలూ ,, ,,
ఏరులయ్యీ పారబట్టే ,, ,,
కుడి కన్నూ శోకాలూ ,, ,,
కుంభానా వర్షాలూ ,, ,,

తాను పెళ్ళాడిన వనితమీద జానపదుని మనస్సు ఎప్పుడూ శృంగార నిష్ఠంగా కనిపించదు. పురాణ పాత్రలైన సీతారాములు, సత్యభామా కృష్ణులు వంటి పాత్రల కారోపింపబడిన దాంపత్య శృంగారం తప్ప. సామాన్యుని దాంపత్య శృంగారానికి ఈ పాటల్లో ఎక్కువ చోటు కనిపించదు. పోగా స్త్రీ తన భర్తచేత నిర్లక్ష్యం చేయబడడం, అతని పరకాంతా లోలత్వానికి విలపించడం ఇక్కడ ఎక్కువగా ప్రసక్త విషయాలు.

ఒక భర్త, తెల్లవార్లూ పొరుగింట్లో గడిపి, ఇంటికి వచ్చి, ఇంటిముందు పెద్ద నీటి మడుగును చూచాడు. చూచి ఆశ్చర్యంతో, తల్లితో ఇట్లా అంటున్నాడు.

"వానా గొట్టాదాయె, వరుదా లెల్లాదాయె
అవ్వా మన ముంగిట్ల వరుదా లెక్కడియే"

అందుకు తల్లి సమాధానంగా,

నువ్వెల్లి పొరుగింట్ల పంటేను కొడుకా
నీ యాలి శోకమ్ము వరుదాలై పారే - అంటుంది. భార్యకు, భర్త దృష్టిలో శృంగార ప్రధానమైన అస్తిత్వం చాలా అరుదుగా కనిపిస్తుందనడానికి ఇటువంటి ఉదాహరణలు ఎన్నో చూపించవచ్చు.

**3. కుటుంబంతో పోరాని అనుబంధం :-** పైన స్త్రీకికల తల్లి తనాన్ని గురించి ప్రస్తావించినప్పుడు కొంతవరకు ఆవిడకు తన కుటుంబంలో భాగమైన సంతానంతో గల అనుబంధాన్ని తడవడం జరిగింది. పిల్లలేకాక కుటుంబ సభ్యులందరూ స్త్రీని కేంద్రంగా చేసుకుని తిరిగేవారుగానే జానపద సాహిత్యంలో చిత్రింపబడుతూ ఉంటారు. ఆ సంసారాలలో అత్తా కోడళ్ళు జన్మ శత్రువుల్లా చిత్రింపబడడం కనిపిస్తుంది. అత్త కోడల్ని మెచ్చదు. ఆవిడ చేసిన ఏ పనులకైనా వంకలు పెడుతుంది. ఈ పాట చూడండి.

కోడలా కోడలా కొడుకు పెళ్ళామా
పచ్చిపాలా మీద మీగళ్ళు ఏవి
వేడి పాలామీద వెన్నల్లు ఏవి
నూనె ముంతల మీద నురగల్లు ఏవి?

అని నిగ్గదీస్తుంది. అందుకు భయభక్తులు కల కోడలు ఎదురు జవాబు చెప్పదు. కళ్ళు వప్పజెప్పి ఊరుకుంటుంది. కాని సందు దొరికినప్పుడు వారితోనూ వీరితోనూ చెవులు కొరుకుతూ,

ఇరుగు పొరుగూలార ఓ చేడెలారా
అత్తగారారళ్ళు చిత్తగించారా
పచ్చిపాల మీద మీగడుంటుందా
వేడి పాలామీద వెన్నలుంటాయా
నూనె ముంతల మీద నురగలుంటాయా

అని ఫిర్యాదులు చేసి,

"పెత్తనం లాగేస్తె పేచీలు పోను" అని తన మనోవాంఛను మెల్లిగా బయట పెడుతుంది. అంటే ఇక్కడ కోడలు కూడా స్వతహాగా మెత్తనిది కాదు. కాకపోతే అత్తకు లొంగి ఉండడం కోడలుగా తనకు విధాయకం కనుక లొంగి ఉంటుంది. అంతేకాక తనకు అత్తతనం వచ్చిననాడు తనకోడలు కూడా తన చెప్పుచేతుల్లో ఉండాలని గట్టిగా విశ్వసిస్తుంది. ఈ కత్తికి రెండు వైపులా పదును. అందువల్లనే

అత్తలేనీ కోడలు త్తమూరాలూ
కోడలూ లేనత్త గుణవంతురాలూ- అనే భావన ప్రచారాన్ని పొందింది.

స్త్రీ తన యింటికి పదిమంది చుట్టపక్కాలు రావాలని కోరుకునేది వెనక కాలంలో

"కాకమ్మ కుయ్యవే తరిమి కుయ్యావే
కుయ్యవే మాయింటి గుమ్మాలలోన"

అనేది ఆవిడ అర్థన.

"వెళ్ళవే మావారి అరటి చెట్లకూ్క
మెసలవే మావారి మల్లె సాలల్ల"

అని ఆహ్వానిస్తుంది కాకి అరుపు చుట్టపు రాకకు సూచన అని జానపద విశ్వాసం-

భూమి గల ఇల్లాలైతే, కుటుంబం మొత్తం క్షేమంగా మనడానికీ, అందరికీ నాలుగు వేళ్ళూ లోపలికి పోవడానికీ, తన భూమిలో పంట బాగా పండాలని దేవతలను అర్థిస్తుంది - ఒక బంధువును అడిగినట్లుగా ఆమె వానదేవుణ్ణి,

వానదేవుడ నీకు వరస చెల్లెల్ని
వర్షాలు కురిపించు వరి మళ్ళలోన

అని ప్రార్థిస్తుంది—— కూలి చేసుకునే స్త్రీ అయితే, కూలి దొరకనినాడు, తన కుటుంబానికి తిండి దొరకదన్న చింతతో,

ఈ వేళ మావద్దు నలగవు కాబోలు
వెలగపూడి సంతకు వెళ్ళను కాబోలు
ఏగాణి వెల్లుల్లి తేను కాబోలు
ఏగరేసి తాలింపు పెట్టను కాబోలు!

అని నిరాశకు లోనవుతుంది. ఏగాణి వెల్లుల్లి, ఎగరేసి తాలింపు పెట్టడం అన్న స్వల్ప విషయాలలో నిక్షిప్తమైన జానపద స్త్రీ కుటుంబ సంక్షేమ భావన మెచ్చ దగినది.

తన కుటుంబానికి అవతల ఉండే ఊరి వారందరూ కూడా ఆమెకు ఆప్తులే. తనకూ, తన యింటికీ కావలసిన సహాయాన్ని ఇతరులనుండి, కోర డానికి ఆమె సందేహించదు. ఆ కోరికలో ఆప్యాయతే తప్ప, అధికారం కానీ స్వార్థ భావన యొక్క కటువుదనం కానీ కనిపించదు. చూడండి,

"వడ్ల బత్తుడా ఓరి నాయన్నా
వడ్డింపుకోసమని తెడ్డొక్కటియ్యి
కమసాలి నాయన్న ఓరి నాయన్న
కమ్మని నేతిలోకి గరిటొక్కటియ్యి"

అంటుంది.

"ఆవులూకలవారి ఆడమనిషీని
కోడెలూ గలవారి కోడల్ని నేను
మేకలూ గలవారి మేనగోడల్ని"

అని తన అభిజాత్యాన్ని చెపుతూ, సిఖ్యముంచుకుని, బిందె భుజానికి ఎత్తుకోలేని శక్తి హీనతవలన, తన స్థితిని చెప్పి,

"బిందెత్తి పోరయ్య బిందెత్తి పోండి" అని దారిన పోయేవారిని అర్థి స్తుంది. స్త్రీ కూతురుగా, కోడలుగా, భార్య, తల్లి, అత్త, అవ్వ వంటి పాత్రల లోనూ, తన భావనను పూర్తిగా కుటుంబక్షేమం కోసం నియమించుకుంటూ సాగిపోతుంది. అందుకే,

"అడుచుకోను పొడుచుకోను
ఆడ వారి వంతు
కూచుని భోంచెయ్య మగవారి వంతు"

అనే పాట పుట్టింది.

# జానపద సాహిత్యం - పౌరాణిక గాథలు

—రావి ప్రేమలత

జానపద సాహిత్యంలోని పౌరాణిక గాథలను నాలుగు వర్గాలుగా విభజింప వచ్చు. 1. రామాయణ గాథలు, 2. మహాభారత గాథలు, 3. భాగవత గాథలు, 4. ఇతర పౌరాణిక గాథలు. ప్రాచీన వాఙ్మయంలోని రామాయణ, భారత, భాగవత గ్రంథాలే తెలుగు వారి అభిమానాన్ని అధికంగా చూరగొన్నాయి. వీనిలో భారతాన్ని ఇతిహాసమనీ, భాగవతాన్ని పురాణమనీ, రామాయణాన్ని కావ్యమనీ లాక్షణికులు విభజించారు. లక్షణాలననుసరించి పురాణేతిహాసాలకు అత్యంత సాన్నిహిత్యముంది. పురాణం అత్యంత ప్రాచీన వస్తువును వివరిస్తే, ఇతిహాసం పురాతన చారిత్రక కథా వస్తువును వర్ణిస్తుంది. శతపథ బ్రాహ్మణాదులలో ఇతిహాస పురాణాదులు ఏకపద ద్వంద్వ సమాసంగావే పేర్కొనటం జరిగింది. రాజశేఖరుడు పురాణాలలోని ఒక విధమైన భేదమే ఇతిహాసమని వివరించాడు. పాశ్చాత్యులు కూడ రామాయణ, భారతాలను పురాణాలనే పేర్కొన్నారు. జనసామాన్యంలో "రామాయణ భారత పఠనం" పురాణ పఠనంగానే వ్యవహృతమైతున్నది. అనేకులు ఒక దగ్గర కూర్చుని వినే జనరంజకమైన వివిధ కథా కలాపాలే పురాణ పఠనంగా వాడుకలో ఉంది.

జానపద సాహిత్యంలోని పౌరాణిక గాథలలో కొన్ని మూలానువర్తనాలు, మరికొన్ని అమౌలికాలు. అమౌలికాలు ఔచితీ పరిపోషకాలు, జానపదుల అనల్ప కల్పనా విలసితాలు. పౌరాణిక గాథలను జానపదులు తమ మనస్తత్వానికి, జీవితానికి అనుగుణంగా మలుచుకొన్నారు. వీరి కథలలో భగవత్తత్త్వం బోధింపబడదు, అతిమానుష శక్తులు, అద్భుత కల్పనలు మాత్రమే వర్ణితం, కొన్ని కథలలోని పాత్రల పేర్లను తీసివేస్తే, అవి మామూలు జానపద కథలవుతాయి.

**రామాయణ గాథలు:** పౌరాణిక గాథలలో జానపదుల నెక్కువగా ఆకట్టు కొన్నది రామాయణం. దీనికి కారణం రామాయణమందలి సమష్టి గృహజీవనం. కుటుంబ జీవితంలోని పరస్పర ప్రేమానురాగాలు, మానవ ప్రకృతికి సహజాలైన వేదనలు, సంవేదనాలు. జానపదులకు సీతారాములు అతిలోకవాదులు, అలౌకికులు కారు. జానపదుల జీవితమే సీతారాముల జీవితాలు. "పురుషునికి పరిశీలనాదృష్టి ఎక్కువ, స్త్రీకి అంతర్దృష్టి ఎక్కువ" - అని విక్టర్‌హ్యూగో పేర్కొన్న వాక్యం జానపద స్త్రీలకు అక్షరాల అన్వయిస్తుంది. పురుషుడు భగవంతుడెక్కడున్నాడని అడవులలో, ఆలయాలలో, అన్వేషించి, వేదాలను పురాణాలను పరిశీలిస్తుంటే, స్త్రీ మాత్రం ఇల్లే స్వర్గమని, భర్తయే భగవంతుడని, పిల్లలే భగవత్స్వరూపులని భావించి తృప్తి చెందుతుంది. జానపద స్త్రీలు బిడ్డలు పుట్టినపుడు, ఉయ్యాలలూగినపుడు, ఆటలు ఆడినపుడు, పెండ్లాడినపుడు, వారిలో సీతారాములని చూస్తారు. శ్రీరాముల జననం, సీతపుట్టుక, శ్రీరాముని ఉగ్గుపాట, సీత సమర్త, సీతారాముల పెండ్లి, రాఘవుల అలుక, సీత అలుక, సీతాదేవి వేవిళ్ళు, కుశలవుల జననం మొదలగు అనంతమైన సాహిత్యం స్త్రీల మనస్తత్వానికి, జీవితానికి ప్రతీకగా వెలసింది. జానపద సాహిత్యంలోని అనేక గేయాలలోని పాదాంతాలు సీతారాముల చిహ్నాలు. అనేక పల్లవులు రామనామస్మరణాలు.

ప్రస్తుతం జానపద రామాయణంలోని వచన, గేయరూపంలోని అవాల్మీక కథలనే పేర్కొంటాను. దేశ, విదేశీ భాషలలోని రామాయణ కథకు, జానపద రామాయణ కథకు మధ్యగల పోలికలను కూడ వివరిస్తాను. ఈ తులనాత్మక పరిశీలన వలన భావసమైక్యత స్పష్టమవుతుంది, జానపద సాహిత్యంపై పరిశీలనా దృష్టి అలవడుతుంది.

జానపద కథకులు సీత జన్మకథతో రామాయణాన్ని ఆరంభిస్తారు. పవిత్రశీల, అమాయిక, అభిమానవతి, సహనవంతురాలైన సీతపై వారికభిమానమెక్కువ. రామాయణ కథాగానంతో భిక్షనెత్తుకొని జీవించే బాల సంతువారు అద్భుతాంశాలతోనున్న సీతకథ నొకదాన్ని చెప్తుంటారు. ఒకమారు త్రిమూర్తులు వేటకు అడవికి వెళ్తారు. వేటాడి అలసిపోతారు. అడవంతా చీకటి వ్యాపిస్తుంది. ఈశ్వరుడు నిద్రపట్టక తన శరీరపు మురికితో స్త్రీ బొమ్మను చేస్తాడు. విష్ణువు దాన్ని పట్టు బట్టలతో నగలతో అలంకరిస్తాడు, బ్రహ్మ ప్రాణ ప్రతిష్ఠ చేస్తాడు.

ఆ బొమ్మ సర్వాలంకార భూషిత సౌందర్యవతిగా తయారవుతుంది. ముగ్గురూ ఆ యువతి కొరకు తగువులాడుతారు. మధ్యవర్తిగా జాంబవమునిని తీర్పు చెప్పమంటారు. బొమ్మను చేసినవాడు, ప్రాణం పోసినవాడు తల్లిదండ్రులతో సమానమనీ అలంకరించిన వాడు భర్త అని తీర్పు చెప్తాడు. బ్రహ్మ, మహేశ్వరులు ఆ తీర్పుకు సమ్మతించరు. ముగ్గురి మధ్యన జాంబవముని ఆ యువతిని పసిపాపగా మార్చి పెట్టెలో పెట్టి భూదేవికిస్తాడు. భూదేవి పెట్టెను పద్మంలో పెట్టి సముద్రంలో విడవగా, అది సూర్యనమస్కారాలు చేస్తున్న జనకమహారాజుకు లభిస్తుంది. జనకుడామెను పెంచుకుంటాడు. ఆమెయే సీతాదేవి. సీత కొరకే విష్ణువు రామునిగా జన్మిస్తాడు. ఈ కథలో రామావతారానికి కారణం సీతాదేవి పాణిగ్రహణమే కాని రాక్షస సంహారం కాదు. మధ్యవర్తి జాంబవముని జానపదుల దృష్టిలో త్రిమూర్తులకు మూల పురుషుడు. ఈ కథకు, వాల్మీకి కథకు సంబంధం లేదు. పాత్రల పేర్లను తొలగిస్తే మామూలు జానపద కథ అవుతుంది.

శాంతగోవింద నామాలనే కథలో రావణుడు నవాకోటి లింగాల పూజకు పువ్వులను తెమ్మని భటులను పంపిస్తాడు. వారు కొలనులోని పద్మాలను కోయబోతే పద్మంనుండి "మీలంక జొచ్చి - మిము సాధింతు" అనే మాటలు వినబడ్డాయి. రావణుడు ప్రయత్నించగా, "నిన్ను తెగటార్తు" అన్న పలుకులు వినబడ్డాయి. మండోదరికి మాత్రం ఆ పద్మంలో బాలిక కనపడ్తుంది. బాలికను ఆమె మందిరానికి తీసుకొని వస్తుంది. రావణుడామె అందాన్ని మోహించి, వివాహమాడుతానని అంటాడు. బ్రాహ్మణులు "అతివ ఇక్కడుంటే ఈ లంక పాడవుతుంది"- అని జోస్యం చెప్తారు. మండోదరి ఒక పెట్టెలో ఆ బాలికను పెట్టి సముద్రంలో వేస్తుంది. సముద్రుడా బాలికను భూదేవికిస్తాడు. భూదేవి పన్నెండు సంవత్సరాలు పెంచి, ఒక ఇసుక తిన్నెపై పెడ్తుంది. జనకుడు పెట్టెను చూచి అందులోని బాలికను పెంచుకుంటాడు. సీత లంకలో పద్మమందు కన్పించడమనే ఈ అవాల్మీక వృత్తాంతం బ్రహ్మవైవర్త పురాణమందు కూడ కన్పడుతుంది. ఈ పురాణంలో వేదవతి పద్మంలో రావణునికి కన్పడుతుంది. కాని బ్రాహ్మణులామె జన్మ అరిష్ట సూచకమని చెప్పగా రాక్షసులామెను పెట్టెలో పెట్టి సముద్రంలో విడచి పెడ్తారు. ఆ పెట్టె జనకుని పట్టణానికి చేరుతుంది.

మరొక జానపద కథకుడు చెప్పిన కథలో సీత, రావణుని పుత్రిక. బ్రహ్మ దేవుడు నిస్సంతువైన రావణునకు సంతానం కొరకని రెండు ఖర్జూర

పండ్లు నిస్తాడు. వాటిని, అతడు మండోదరి కిస్తాడు. మండోదరి పండ్లకు పిల్లలు పుడ్తారా ? అని జాలారు బండ క్రింద పారవేస్తుంది. తొమ్మిది గడియల తర్వాత సీత జాలారు బండ క్రిందనే జనించి రోదిస్తుంటుంది. రావణుడు స్నానం కొరకని జాలారు బండ వద్దకు వచ్చి రోదనధ్వని విని సీతను చూస్తాడు. పెంచుకుందామనుకుంటాడు. కాని జోస్యులు "సీతపుట్టుక లంకకుచేటని" వద్దంటారు. రావణుడా బాలికను పెట్టెలో పెట్టి సముద్రంలో విడచి వేస్తాడు. ఆ పెట్టె జనకునికి దొరుకుతుంది. రావణుని దుహితయే ధరణిజ అనే ఈ వింత అంశం ఇతర రామాయణాలలోకూడ ఉంది. అద్భుత రామాయణంలో రావణుడు మండోదరికి పాలు, రక్తంతో ఉన్న భాండాన్ని ఇచ్చి "ఇది విషం" అని జాగ్రత్తగా పదిల పరచమంటాడు. రావణుడు ఇతర స్త్రీలను కోరుతున్నాడనే అనుమానంతో, జీవితంపై విరక్తి చెంది, చనిపోవడానికి రావణుడిచ్చిన మిశ్రమాన్ని మండోదరి త్రాగుతుంది. సద్యోగర్భ మేర్పడి ఆమెకు సీత జన్మిస్తుంది. కాని భర్త తనను అనుమానిస్తాడనే భయంతో మండొదరి సీతను పెట్టెలో పెట్టి భూమిలో పెడ్తుంది. అది జనకునికి దొరుకుతుంది. జైన సంప్రదాయంలోని సీత మండోదరి పుత్రిక. భూటాన్ రామాయణంలో, కాశ్మీర్ రామాయణంలో సీత దశగ్రీవుని దుహితయే.

రాముడి జన్మకు పరోక్ష మూల కారకుడు, శాంత భర్త ఋష్యశృంగుడు. జానపద సాహిత్యంలో శాంతాదేవి దశరథుని పెంపుడు కూతురు. వాల్మీకి రామాయణంలో శాంత ప్రసక్తి బాలకాండలో తప్ప ఇంకెక్కడా కానరాదు. జానపద రామాయణపు స్త్రీల పాటలలో శాంత కౌసల్య గారాబు పుత్రికగా, రామలక్ష్మణులకు ప్రియసోదరిగా, ఆత్మీయతగల ఆడబడుచుగా, ఋష్యశృంగుని ధర్మచారిణిగా, విధేయురాలైన కోడలిగా చిత్రితమైంది. మూలంలోని అప్రధాన పాత్రలను ప్రధానం చేయడమే జానపదుల ప్రత్యేకత. జానపదుల గృహాలలో ఆడపడచులకు అధిక ప్రాధాన్యత ఉంటుంది. అందుకే జానపదుల శాంత ఆడపడచుగా సాహిత్యంలో అధికారాన్ని సంపాదించుకొంది. శాంత గోవింద నామాలనే కథా గేయంలో సంతానహీనుడైన దశరథుడు దక్షిణ దిక్కులోని ముని దగ్గర నున్న శాంతను పెంచుకుంటే పిల్లలు పుడ్తారని భార్యలతో బయలుదేరుతాడు. మార్గమధ్యాన రథ చక్రం విరుగుతుంది. రాజు కైక సహాయాన్ని,

మంథర వినకుండా అడుగుతాడు. అయినా కైక బంగారు కాగితంపైన రామునికి పధ్నాలుగు ఏండ్ల వనవాసం, భరతుని పట్టాభిషేకం వ్రాయించుకొని రథాన్ని బాగుచేస్తుంది. కైక రామభరతులు జన్మించక పూర్వమే వనవాసం, పట్టాభిషేకం కోరడం మనకు వింత. కాని జానపదుల కది మామూలే. జానపదులకు పూర్వాపర విచక్షణా జ్ఞానం ఉండదు. కథా కథన పద్ధతి పైననే వారికి దృష్టి ఉంటుంది కాని కథా సందర్భంపైన ఉండదు. దశరథుడు ముని వద్దకు వెళ్ళి శాంతను తీసుకొని వచ్చి, ఋష్య శృంగునితో వివాహం జరిపించి అతనితో యజ్ఞం చేయిస్తాడు. వాల్మీకి రామాయణం బాలకాండ ననుసరించి శాంత దశరథుని ఔరస పుత్రియని కొందరు, కాదని కొందరు వ్యాఖ్యానించారు. ఆశ్చర్య రామాయణమందు శాంత కౌసల్య, దశరథుల కుమార్తెగా, లావోస్ దేశమందలి బౌద్ధ జాతక కథలో శాంత దశరథుని కూతురుగానే పేర్కొనబడింది.

జానపద సాహిత్యంలో సీతారాముల పెండ్లి పాటలు అతి రమ్యాలు. సీతా స్వయంవరానికి ధనుస్సును పందెంగా పెట్టడానికి కారణం జానపదుల కథలో ఒక మనోజ్ఞమైన మలుపు తిరిగింది. ఒకనాడు జానకి బంగారు చీపురు కట్టతో ఇల్లు ఊడుస్తుంటుంది. ధనుస్సు క్రింద దుమ్ము కన్పడుతుంది. సీత ఎడమ చేతి చిటికెన వ్రేలితో ధనుస్సునెత్తి కుడిచేతితో ఊడ్చుతుంది. ఈ దృశ్యాన్ని చూచిన దశరథుడు ధనుస్సును స్వయంవరంలో పందెంగా పెడ్తాడు. ఊడ్వడం జానపదులకు నిత్యకృత్యం. అందుకే జనక మహారాజు కూతురుకుకూడ ఊడ్చేగతి పట్టింది. భేదం మాత్రం బంగారు చీపురుకట్టలో ఉంది. శ్రమైక జీవులైన జానపద సాహిత్యంలోని పాత్రలుకూడ శ్రమజీవులే. వేరొక కథలో సీత బంతి ధనుస్సు క్రింద పడ్తుంది. ఆమె దాన్ని లేపి బంతిని తీసుకుంటుంది. ఆనంద రామాయణంలో సీత, ఆటలో విల్లును గుర్రంగా భావించి ఆడుకుంటుంది. పరశురాముడు ఆ దృశ్యాన్ని చూచి ధనుస్సునే స్వయంవరంలో పెడ్తాడు.

సీతా స్వయంవరానికి పూర్వమే రాముడు "ఆలినొప్పకుంటే జన్మమెల్ల వృథా" అని లక్ష్మణుణ్ణి సీత రూపాన్ని చూచి రమ్మంటాడు. లక్ష్మణుడు సోమకళలబోలేటి సీత పాదపద్మాలనే చూస్తాడు. వాటినే వర్ణిస్తాడు. సౌమిత్రి ఈ సౌశీల్యం కిష్కింధకాండలో సీత కాలి అందెను గుర్తు పట్టినప్పటి దృశ్యాన్ని

స్మరణకు తెస్తుంది. అమూలకమైనా అదును లభించగానే జానపదులు కథా గత పాత్రల గుణగణాలను వర్ణిస్తుంటారు. మరొక జానపద కథలో రాముడు ఎఱుకత వేషంలో సీత దగ్గరికి వెళ్ళి, ఆమె చేయి చూచి రామునితో కళ్యాణం జరుగుతుందని చెప్తాడు. సోది వినడం జానపదులకభిమానం. వీరి అభిమానానికి అనుగుణంగా కథాగత పాత్రలు తమ స్వరూపాన్నే మార్చుకుంటాయి. జానపద మహాభారతంలోని అర్జునుడు ఎఱుక స్త్రీ వేషంలోనే సుభద్ర దగ్గరకు వెళ్ళుతాడు. భాగవతంలోని శ్రీకృష్ణుడు కూడ గోపమ్మ దగ్గరికి ఎఱుక యువతి రూపంలో వెళ్ళి ఆమెను ఆకట్టుకుంటాడు.

సీతారాముల వివాహానంతరం మంధర దుర్బోధకు లొంగి కైక రాముణ్ణి వనవాసానికి పంపుతుంది. మంధర రాముణ్ణి ద్వేషించడానికి, భరతుణ్ణి అభిమానించడానికి కారణాలు ఒకే జానపద గాథ వివరిస్తుంది. బాల్యంలో రాముడొకనాడు బొంగరంతో ఆడుతుంటే, అది మంధర కాలి వ్రేలిని చితగ్గొడుతుంది. రక్తం కారుతుంది. భరతుడు తన ఉత్తరీయపు కొంగును చింపి మంధర కాలికి కట్టు కడతాడు. నాటినుండి కైకకు రాముడంటే కోపం, భరతుడంటే ఇష్టం. రంగనాథ రామాయణంలో రాముడు మంధర కాలిని విరచినట్లుగా, భాస్కర రామాయణంలో కాలితో తన్నినట్లుగా, కంబరామాయణంలో మట్టిగడ్డలతో మంధర గూని వీపుపై కొట్టినట్లుగా ఉంది. వీటన్నిటి కంటే ఒకే కథలో మంధరకు రామునిపై ద్వేషం, భరతునిపై అభిమానం కలగడానికి కారణాన్ని వివరించిన జానపదుని కల్పనా చమత్కృతియే అమోఘం. పల్నాటి యుద్ధ కథలో మామూలు జానపదుల కథలలో కూడ బొంగరపు ప్రసక్తి కానవస్తుంది. అవాల్మీకమైన ఈ రామవైరం జానపద మనస్తత్వ కల్పితం ఈ అంశాన్నే రంగనాథాదులు గ్రహించారని భావింపవచ్చు.

అరణ్యవాసంలో లక్ష్మణునికి ఒక కత్తి కనపడుతుంది. కత్తి పదును చూద్దామని అక్కడున్న చెట్టును నరకుతాడు. చెట్టుతోపాటు శూర్పణఖ కుమారుడైన చక్రభూపాలుని కంఠం తెగుతుంది. శూర్పణఖకు ఈ సంగతి తెలిసి రామలక్ష్మణులను చంపుతానని వెళ్ళి, వారి అందానికి మోహితురాలై ముక్కు చెవులను పోగొట్టుకుంటుంది. రంగనాథ రామాయణంలోని జంబుమాలి

వృత్తాంతం ఈ కథను పోలి ఉంది. ఆనంద రామాయణంలో శూర్పణఖ కుమారుడు సాంబుడు. జైన రామాయణంలో శూర్పణఖ కుమారుడు శంబూకుడు.

మారీచుని మరణానంతరం సీతవేసిన నింద భరించలేక లక్ష్మణుడు ఏడు గీతలు గీసి దాటవద్దని కట్టడి చేసి వెళ్ళుతాడు. అవాల్మీకీయమైన ఈ కల్పన రంగనాథ రామాయణంలో ఉంది. బర్మా రామాయణంలో ఒక్క గీత ప్రసక్తి ఉంది.

జన సామాన్యంలోని "లక్ష్మణరేఖ", "గీసిన గీటు దాటొద్దు", అనే వాడుకల ననుసరించి, వివిధ జానపద కథంలోని గీతల ప్రస్తావననుసరించి, ఈ కల్పన జానపదుల స్వంతం అని నిర్ధారించవచ్చు. జానపదుల ప్రచారంలో ఉన్న ఈ కథను రంగనాథాదులు స్వీకరించి ఉండవచ్చు. స్త్రీల రామాయణపు పాటలలో రావణుడు సీతను స్పృశించక "గెడ్డ పెల్లగించి" రథంపై పెట్టుకుంటాడు. జానపదులకు సీత పవిత్రత పైన గల అభిమానం ఈ వర్ణన వలన వ్యక్తమవుతుంది. ఆధ్యాత్మ రామాయణంలో సీత నిలచిన ప్రదేశాన్ని గోళ్ళతో పెకలించినట్లుగా ఉంది. కంబ రామాయణంలో కూడ రావణుడు సీతను స్పృశించడు.

సేతు నిర్మాణ సమయంలో ఉడుత రామునికి తోడ్పడిన కథ ఆబాల గోపాలం ఎఱిగినదే. ఈ కథ రంగనాథ రామాయణంలో, తమిళంలోని తొండరడిప్పొడి ఆళ్వారు గీతాలలో ఉంది. సృష్టికి సంబంధించిన పురాగాథలను పరిశీలిస్తే ఒక జాతి స్వరూప స్వభావాలకు మౌలిక కారణాలు, ఆ జాతి పూర్వీకులలో ఒక్కరి ప్రవర్తనా ఫలితాలని చెప్పుతాయి. నేటి ఉడుతపైన గీతలు, త్రేతా యుగపు నాటి ఉడుత సేతు నిర్మాణానికి సహాయపడగా, రాముడు ప్రేమతో నిమిరిన వ్రేళ్ళ గుర్తులే అని జానపదుల నమ్మకం. ఉడుతయే గాక జానపద రామాయణ కథలలో చిలుక రామ, రామ అని పలికే పుణ్యాన్ని, కోయిల మధురంగా కూసే గొంతును, రేగుచెట్టు నీళ్ళులేని ప్రదేశంలో కూడ బ్రతికే వరాన్ని, సీతారాములకు ఉపకారం చేసి పొందాయి. ఈ ఉదాహరణల వలన, జనసామాన్యంలో ప్రచారంలో ఉన్న "ఉడుతాభక్తి" అనే సామెత వలన, "ఉడుత కథ" జానపదుల సొత్తే అని నిర్ణయింపవచ్చు.

ఆదిశేషుని ఆత్మజ, ఇంద్రజిత్తు పత్ని, రావణాసురుని కోడలైన సులోచన కథ, కాలనేమిని హనుమంతుడు వధించే వృత్తాంతం, అమూలకాలు అద్భుతాలు. కాలనేమికథ భాస్కర, రంగనాథ, అధ్యాత్మ, మొల్లరామాయణాలలో ఉన్నది. జానపద సాహిత్యంలో అవాల్మీకీయమైన మైరావణకథ అనేక అద్భుతాంశాలతో కల్పితం. రావణుని మిత్రుడు మైరావణుడు, పాతాళలంక అధిపతి. మిత్రునికొరకు మైరావణుడు రామలక్ష్మణులను మాయోపాయాలతో, మంత్రశక్తితో బంధించి పాతాళలంకలో కాళికాదేవికి బలిచ్చేందుకు సిద్ధమవు తాడు. హనుమంతుడు పాతాళలంకలో ప్రవేశించి, దాసీ దోర్దండి సహాయంతో మైరావణుని ప్రాణాలు సప్తసముద్రాల కవతలఉన్న పర్వతముపైనగల ఏడు తుమ్మెదలలో ఉన్నాయని తెలుసుకుంటాడు. ప్రచండ వేగంతో హనుమంతుడు ప్రయాణంచేసి తుమ్మెదలను పట్టుకొని చంపివేస్తాడు. మైరావణ కథలోని మంత్ర శక్తులు, మాయోపాయాలు, దేవికి బలినివ్వడం వంటి వర్ణనలననుసరించి, కథ స్వరూప స్వభావాల ననుసరించి, జానపదుల కల్పితమని నిర్ణయించవచ్చు. జానపదులు ఈ కథలో హనుమంతుణ్ణి నాయకునిగా, రామలక్ష్మణులకు రక్షకునిగా వీరునిగా చిత్రించి, అతనిపైగల భక్తి, గౌరవాలను ప్రకటించు కున్నారు. ఆంధ్రదేశంలో రామాలయాలకంటే ఆంజనేయ విగ్రహాలు అధికం. రామభక్తులకంటే, ఆంజనేయ భక్తులసంఖ్య అధికం. రామనామంకన్న ఆంజనేయ దండకం దయ్యాలను, పిశాచాలను భయాలను పారద్రోలుతుందని, గ్రహదోష నివారణకు ఆంజనేయ ప్రదక్షిణాలే శరణ్యం అని మనవారి నమ్మకం. బలవం తులకు, వస్తాదులకు వానరుడైన హనుమంతుడే ఆరాధ్యుడు. వానరపూజ ప్రపంచ పర్యాప్తంగా కన్పడుతుంది. ఈజిప్టు, బాబిలోనియా దేశవాసులకు వానరం పవిత్ర జంతువు. టిబెట్ దేశవాసులు తాము వానర వంశస్థులమని గర్వంగా చెప్పుకుంటారు. జపాన్‌లో వానరదేవాలయం, మధ్య అమెరికాలో వానర విగ్రహాలున్నాయి మన గ్రామాల్లో హనుమంతుణ్ణి వర్షాధిదేవతగాకూడ ఆరాధిస్తారు. హనుమంతునికి గల "పావని" అనే పేరు ఋతుపవనాలతో అతనికి గల సంబంధాన్ని వెల్లడి చేస్తుంది. ఋతుపవనాల వెంట మేఘాలు సూక్ష్మ, స్థూలరూపంలో అతి వేగంగా పయనిస్తాయి అదేవిధంగా రామాయణంలో హనుమంతుడు స్థూల, సూక్ష్మ రూపాన్ని ధరించి ఆకాశంపైన పయనిస్తాడు. శైవులు హనుమంతుడు శివుని అపరావతారమని పూజిస్తారు. శివుడు ద్రావిడ

దేవత కనుక హనుమంతుడు కూడ అనార్యుల వేల్పని కొందరు, హనుమంతుడు ప్రాచీన కాలంలో ఆటవికజాతి వీరుడు కావచ్చని తర్వాత రామాయణకావ్యంలోని హనుమంతునిలో అన్వయించడం జరిగిందని కొందరు భావించారు. జానపదులకు ఆంజనేయునిపైనగల భయ, భక్తి, గౌరవాలు, నమ్మకాలు, కథలు, రామ పూజ కంటే వానర పూజ ప్రాచీనమైందను ఊహకు బలాన్ని చేకూర్చుతున్నాయి.

"లంకాయాగం" కథలో రాముడు రావణుని ప్రాణాలు అతనినాభిలోని అమృతపు భాండంలో ఉన్నాయని విభీషణుని ద్వార తెలుసుకుంటాడు. నారాయణాస్త్రంతో రాముడు రావణుని అమృతపు భాండాన్ని పగులగొడ్తాడు. ఈ కల్పన భాస్కర, రంగనాథ, అధ్యాత్మ రామాయణంలో కూడ ఉంది. ఖోటాన్ రామాయణంలో రావణుని ప్రాణాలు కాలి బొటన వ్రేలిలో ఉంటాయి. సయామీస్ రామాయణంలో తొస్సకన్ (రావణుడు) తన ప్రాణాలను పెట్టెలో పెట్టి ముని దగ్గర దాచిపెడ్తాడు. ప్రాణశక్తి శరీరంలోనే గాక ఇతర వస్తువులలో ప్రాణులలో పదిల పరచి ఉంటుందన్న నమ్మకం ప్రపంచ పర్యాప్తంగా ఉంది. బాలనాగమ్మ కథలో ఫకీరు ప్రాణాలు చిలుకలోను, మైరావణుని ప్రాణాలు తుమ్మెదలలోను నిర్లిప్తమైనవి. మంగోలియన్ జానపద కథలో బోరోదోంగ్ అనేవాని ప్రాణాలు కందిరీగలో, అరేబియన్ కథలో ఒకడు తన ప్రాణాలను పిచ్చుకలో పదిలపరచి పెట్టెలో పెడ్తాడు.

యుద్ధ సమయంలో రామ, రావణులు ప్రయోగించుకొన్న బాణాలు కూడ జానపదుల జీవిత, వృత్తుల ననుసరించినవియే. అవి తేళ్ళబాణాలు-కోళ్ళబాణాలు, నాగబాణాలు-ముంగిసబాణాలు, నిప్పుబాణాలు - నీటిబాణాలు, పాముల బాణాలు-గరుత్మంతుని బాణాలు, కత్తుల బాణాలు - గొడ్డండ్ల బాణాలు. దివ్యాస్త్రాలు జానపదులకు పరిచయం లేవు.

రావణ సంహరణానంతరం సీత రాముడి వద్దకు వస్తుంది. సీతను చూడగానే రాముడు ముఖం త్రిప్పుకొని రథమెక్కి వెళ్ళబోతాడు. సీత రథంపై అన పెట్టగానే అది కదలకుండ ఆగిపోతుంది జానపద మనస్తత్వం అనువు లభించగానే జానకి పాతివ్రత్య నిరూపణకే యత్నిస్తుంది. రాముడు "కుక్క ముట్టిన కుండ

కుదరదు మాకు-మాతల్లి కౌసల్య వద్ద కేతెంచు" అని సీతను అసహ్యించు కుంటాడు. సామాన్యంగా మన సమాజంలో భర్తకు భార్య అయిష్టమైతే ఆమె అత్త మామలకు సేవచేస్తూ పతివ్రతవలె అత్తవారింట్లో కాలాన్ని గడపాలి. కాని, పుట్టింటికి మాత్రం పో కూడదు. అందుకనే రాముడు సీతను కౌసల్య కడకు వెళ్ళ మంటాడు. వాల్మీకి రామాయణంలో రాముడు సీతతో "లక్ష్మణ, భరత, విభీషణ, సుగ్రీవులలో ఎవరిమీదనైనను నీ అనురాగం చూపవచ్చును. నేను దానిని లక్ష్య పెట్టను, నీకు నచ్చిన వాణ్ణి కోరుకొనవచ్చును" (యుద్ధ 118 స. 23 శ్లో) అని కఠినంగా పలుకుతాడు. పరపురుషుని వద్దకు వెళ్ళమనిన వాల్మీకి రాముని కంటె, సీతను తల్లి కౌసల్య వద్దకు వెళ్ళమన్న జానపద రాముడే ఉదారుడుగా కనపడ్తున్నాడు. సీత రాముడి తిరస్కారానికి "ఆడ జన్మంబుట్టి అజ్ఞానినైతి-గుర్రాలనయిన పుట్టనైతి, పక్షులలోనయిన జన్మించనైతి, పూర్వజన్మమందు చేసిన పూజకు భువిలో పుట్టితిని"- అని బాధపడ్తుంది.

జానపద సాహిత్యంలోని రామాయణ పాటలలో 'ఊర్మిళాదేవి నిద్ర'కు ప్రత్యేకత ఉంది. లక్ష్మణుని పధ్నాలుగు ఏండ్లు నిద్రలేమి, అతని సోదర భక్తికి, సేవాపరాయణత్వానికి నిదర్శనం కాగా, ఊర్మిళాదేవి పధ్నాలుగు సంవత్సరాల నిద్ర ఆమె పాతివ్రత్యాన్ని చాటుతుంది. ఊర్మిళాదేవి పాత్ర ప్రాధాన్యతతో రామాయణ కథకే నిండుదనాన్ని ఒసంగిన పల్లెస్త్రీల కథనాశిల్పం, కల్పనా పటిమ ప్రశంసనీయం. "లక్ష్మణదేవర నవ్వు" రంగనాథ రామాయణం, కంబరామాయణాలలో కూడ కన్పడుతుంది.

సీతా పరిత్యాగం గూర్చి జానపదులు కల్పించిన అద్భుతాంశాలు ఔచిత్యం పామరులకు సంతోషాన్ని, పండితులకు విస్మయాన్ని కల్గిస్తాయి. మూల రామాయణంలో సీతాపహరణం తర్వాత శూర్పణఖ ప్రసక్తి కానరాదు. జానపదుల కథలో శూర్పణఖ ప్రతీకారవాంఛయే సీతారాముల ఎడబాటుకు కారణమైంది. శూర్పణఖ తన కొడుకును, భర్తను, సోదరుణ్ణి హతమార్చిన రామునిపై పగ తీర్చుకొనడానికి అయోధ్యకు వస్తుంది పదహారు ఏండ్ల పడచుగా మారి "తిన అన్నం లేదు, కట్టబట్టలేదు" పనిప్పించమని రాముణ్ణి వేడుకుంటుంది. రాముడు

అంతఃపురంలోని సీత వద్దకు పంపిస్తాడు. సీత ఆమెను తన పరిచారికగా నియమిస్తుంది. ఒకనాడు మాటల సందర్భంలో శూర్పణఖ సీతను రావణుని చిత్రాన్ని చిత్రించమంటుంది. సీత, రావణుని బొటన వ్రేలినే చూచానని, దాన్నే చిత్రించి ఇస్తుంది. శూర్పణఖ మిగిలిన చిత్రాన్ని పూర్తిచేసి, బ్రహ్మకడకు పోయి, మంత్రం వేయించి, రాముని పాన్పుక్రింద పెడ్తుంది. రాముడా పాన్పుపై పరుండబోవగా, చిత్రపటం గంతులు వేస్తూ క్రింద పడ్తుంది రాముడు ఆ దృశ్యాన్ని చూచి, సీతనే రావణుని చిత్రపటాన్ని పాన్పు క్రింద దాచిపెట్టిందని అనుమానిస్తాడు. ఆగ్రహంతో లక్ష్మణుణ్ణి సీతను అడవిలో విడచిపెట్టి రమ్మని ఆజ్ఞాపిస్తాడు.

కాళిదాసు కల్పించిన దుర్వాసముని పాత్రతో ఉంగరంతో దుష్యంతుని పాత్రకు ఔన్నత్యం చేకూరినట్లు, జానపదుని శూర్పణఖ పాత్రతో, రావణుని చిత్రంతో రాముని పాత్రకు ఉదాత్తత చేకూరింది. అమూలకమైన ఈ కథ తమిళ జానపద సాహిత్యంలో కూడ ఉంది. బెంగాలీ భాషలోని చంద్రావతి రామాయణంలో కైకేయి కుమార్తె కుకువా కోరగా, సీత రావణుని చిత్రాన్ని విసనకర్రపై చిత్రిస్తుంది. తర్వాత సీత నిద్ర పోతుంటే విసనకర్రను కుకువా ఆమె ఎదపై పెట్టి వెళ్ళిపోతుంది. రాముడా విసనకర్రను చూచి సీతననుమానిస్తాడు. కాశ్మీరీ జానపదకథలో కూడ రాముని చెల్లెలు, సీత మట్టితో రావణుని భవనపు నమూనాలు కడ్తుండగా చూచి అన్నతో చెప్తుంది. ఈ కథలన్నీ మూల రామాయణానికే మెరుగులు దిద్దుతున్నాయి. సీతా పరిత్యాగానికి కారణం కథతో సంబంధం లేని చాకలివాడు కావడం కన్న, శూర్పణఖ, కైకకూతురు, రాముని చెల్లెలు, మూలకారకులవడం ఉచితంగా కన్పడుతుంది. నిదర్శనా రహితంగా ధర్మపరుడైన వాల్మీకి రాముడు సీతను పరిత్యజించడం అన్యాయమనిపిస్తుంది. కాని నిదర్శనమైన రావణుని చిత్రాన్ని చూచి సీతననుమానించి త్యజించడం కొంతవరకు సమంజస మనిపిస్తుంది.

రామాయణంలో రాముడొక్కసారే అరణ్యవాసం చేయవలసివస్తే, సీత రెండుమార్లు అనుభవించవలసి వచ్చింది. రామాయణ కథా గానం చేస్తూ, భిక్షాటనంతో బ్రతికే బాలసంతువారు కుశలవుల జన్మ వృత్తాంతాన్ని కరుణ రసాత్మకంగా పాడుతుంటారు*6. వీరి కథ అద్భుత కల్పనామయం. రాముడు

సీత ననుమానించిన తర్వాత లక్ష్మణుణ్ణి పిలిచి "పాపకారి సీతను అరణ్యంలో కొట్టిరా తమ్మి"- అని ఆదేశిస్తాడు. విధేయుడైన లక్ష్మణుడు సీతను అడవికి తీసుకొనిపోయి చెట్టు క్రింద నిలబెట్టి బాణ ప్రయోగం చేస్తాడు మొదటి బాణ మామెకు బన్నసరమవుతుంది. రెండవ బాణాన్ని కూడ ప్రయోగించడానికి ప్రయత్నించగా, "నా దగ్గర పాపం లేదు, రాములవారి బాణాన్ని భస్మం కానియ్యి"- అంటుంది సీత. బాణం భస్మమవుతుంది. భస్మాన్ని సీత తినగానే సద్యోగర్భమేర్పడుతుంది. కుశుడు జన్మిస్తాడు. లక్ష్మణుడామెను వధించలేక వెళ్ళిపోతాడు. సీత అడవిలో పర్ణశాలలో నివసిస్తున్న జనకుని దగ్గర కొడుకును పెంచుకుంటూ ఉంటుంది. ఇక్కడ వాల్మీకికి మారు జనకుడెందుకు వచ్చాడనే అనుమానం రావచ్చు. జానపద స్త్రీలకు అత్తింట్లో కష్టాలు వస్తే పుట్టింటివారు ఆదుకుంటారు. అందుకనే జానపద సీతను జనకుడు చేరదీసాడు. లవుని జన్మం గూర్చి కూడ వింతకథ నొకదాన్ని కథకులు చెప్తుంటారు. ఒకనాడు జానకి కొడుకును అంధుడైన జనకుని ప్రక్కనే ఉయ్యాలలో పరుండబెట్టి నీటికని నదికి పోతుంది. మార్గమధ్యంలో కోతులు, పిల్లకోతులను కడుపునకంటుపెట్టుకొని ఒక చెట్టుమీదినుండి మరొక చెట్టుపైకి దుముకుతుంటాయి. ఆ దృశ్యాన్ని చూచి విస్మితురాలైన సీత, "చంకల్ల పిల్లలు ధరణి పడితే-చచ్చిపోరా ఎడ్డికోతుల్లారా, కొడుకుపోతే కొడుకేడ దొరుకుతడు"- అని వాటిని ప్రశ్నిస్తుంది. కోతులు "ఎడ్డి సీతమ్మ మేము చచ్చిన తావుల పిల్లలు చావాలి, నీలెక్క పిల్లలను గుడ్డోని దగ్గర ఇడిసిపెట్టం"- అని సమాధానమిస్తాయి. సీత కోతుల మాటలకు, తన ప్రవర్తనకు సిగ్గుపడి పర్ణశాలకు వచ్చి పిల్లవాణ్ణెత్తుకొని నీళ్ళకు పోతుంది. ఇది తెలియక ఉయ్యాల్లోని పిల్లవాణ్ణి ఏ క్రూరమృగమైన ఎత్తుకపోయిందేమో అని అంధుడైన జనకుడు, తన శరీరపు మురికితో బొమ్మను చేసి ప్రాణం పోస్తాడు. జానకి ఇరువురినీ పెంచుకుంటుంది. అయోధ్యలోని లక్ష్మణుడు కుశలవుల పుట్టుకను అంజనం వేసుకొని చూస్తాడు. బాలసంతు వేషంలో వచ్చి పిల్లలకు అంగీలు, కుల్లలిచ్చిపోతాడు. తర్వాత రాముణ్ణి వేటకని తీసుకొనివచ్చి తండ్రినీ, పిల్లలను కలుపుతాడు. రాముడు "సీతకు పిల్లలేవిధంగా జన్మించారు, పాపపుణ్యాలు మనకు తెలియవు"- అని తల్లీ పిల్లలను అగ్నిగుండాలలో నడవమంటాడు. "మాయలో పుట్టిన లవుడు అగ్గిలో మైనంవోలె కరిగిపోతాడు" మహారాష్ట్ర జానపదులలోకూడా ఈ కథ ప్రచారంలో ఉంది. అక్కడ, "తండ్రి లేనోడు, తల్లి ఇంట్లోలేనప్పుడు

పుట్టినోడు ఎవ్వడు?" అని పొడుపు కథను వేస్తుంటారు. జానపదులకు ప్రకృతియే పాఠాలు నేర్పుతుంది. ఈ కథలో సీత పిల్లలను పెంచడం కోతుల దగ్గర నేర్చుకుంది. సీత అమాయకత్వం, పాతివ్రత్యం, ముగ్ధత్వం, అభిజాత్యం, సహనం మున్నగు గుణాలను వివరించిన జానపదులు, ఆమె పరాక్రమ, ధైర్యసాహసాలనుకూడ అభివర్ణించి, సీత పాత్రకు సంపూర్ణతను సమకూర్చారు. రావణ సంహారణానంతరం ప్రజలను బాధిస్తున్న శతకంఠుణ్ణి పరిమార్చడానికి రామునితోపాటు సీత యుద్ధరంగానికిపోయి, సత్యభామవలె శతకంఠుణ్ణి సంహరిస్తుంది.

ఇంతవరకు వివిధ రామాయణాలలో నున్న కథలకు, జానపద కథలకు మధ్యనున్న పోలికలు చెప్పడం జరిగింది. జానపదులు ఇతర రామాయణాల నుండి ఈ కథలను గ్రహించారా, లేదా ఇతర రామాయణ గ్రంథ కర్తలు జానపదులనుండి గ్రహించారా, లేదా వీటన్నింటికి మూల కారణం మరో రామాయణం ఉందా? అనే అనుమానపు వీచికలు వీచడం సహజం. జానపదులలో ప్రచారమందున్న వివిధ కథలలో ఒక కథా రూపాన్ని గ్రహించి, వాల్మీకి మహాకావ్యాన్ని రచించినాడను అభిప్రాయం కూడ విమర్శకులలో ఉంది. ఈ అభిప్రాయానికి అవాల్మీకమైన వివిధ జానపదకథలు ప్రోద్బలకాలు అని చెప్పవచ్చు. ఏమైన జానపద, సంప్రదాయక కథలలోని వివిధ పోలికల ననుసరించి సనాతన మానవుని ఆలోచనా సరళి ఒకటేనని నిర్ధారించవచ్చు.

**భారత కథలు:-** జానపద సాహిత్యంలో రామాయణ గాథల తర్వాత భారత కథలు ప్రముఖ స్థానాన్ని వహిస్తున్నాయి. వ్యాసముని భారతాన్ని అష్టాదశ పర్వాలలో రచించగా, నల్గొండలోని ఒక కథకురాలు ఒక సంవత్సరమంతా రాత్రుళ్ళు చెప్పిన కథ చెప్పకుండా భారత కథలను చెప్పుతానని గర్వంగా పలికింది. జానపదుల భారతమందు ధర్మతత్త్వ ప్రాధాన్యం, జీవిత పరమార్థ బోధనలుండవు. అభూత కల్పనలకు, అద్భుత అతిమానుష శక్తులకే ఈ కథలలో ప్రాధాన్యముంటుంది. జానపదుల భారతకథలలో శ్రీకృష్ణుడు భగవానుడే గాక, మాయలమారి, స్వార్థపరుడు, పాండవ అభిమాని, ధర్మరాజు ధర్మపరుడే గాక అమాయకుడు, తమ్ముళ్ళ కొరకే బ్రతికే పెద్దన్న. భీమార్జునులు బలపరాక్రమవంతు లైతే సహదేవుడు త్రికాలజ్ఞుడు. ద్రౌపదీదేవి పతివ్రత, బ్రహ్మచారిణి,

ఆదిశక్తి స్వరూపిణి. వీరందరిలో అంగబలాన్ని, అతిమాత్ర భోజనాన్ని, ఆగ్రహావేశాలను కలిగిన భీముడంటే జానపదుల కత్యంత అభిమానం. ఉత్తర భారతదేశంలో భీముడు దేవతగా పూజలందుకొంటున్నాడు. భిల్ జాతి, ధోబాజాతి గోండ్ జాతి గాథలలో భీముడు భగవంతుని తర్వాతి స్థానాన్ని ఆక్రమించాడు. మరియా గోండ్ లకు భీముడు వ్యవసాయపు దేవత. మిథిలాప్రజలు కూడ భీముణ్ణి పూజిస్తారు. Encyclopedia of Religion and Ethics లో భీముడు మొదట ద్రావిడ దేవత కావచ్చని తర్వాత మహాభారతంలోని భీమునితో అన్వయించడం జరిగిందని వివరించబడింది. మధ్యప్రదేశ్ లోని భాగల్ పూర్ లో కర్ణుని పూజిస్తారు. ఆంధ్రలో నిమ్నకులాలు గొంతాలమ్మ పండుగను, దక్షిణ ప్రాంతాలలో ధర్మరాజు దేవాలయంలో తిరునాళ్ళను జరుపుతారు. ఆటవిక తెగల కథలు, జానపదుల కథలు, ఉత్సవాలు, పండుగల వలన పాండవులు పురాతన దేవతా చక్రానికి చెందిన వారని వ్యక్త మవుతుంది.

జానపద సాహిత్యంలోని పాండవుల జన్మవృత్తాంతం ఔచిత్యపు మార్గంలో పయనించింది. కుంతీదేవి సంతానం కొరకై శివుణ్ణి పూజిస్తుండేది. ఒకమారు పాండురాజు యుద్ధం చేయడానికి పోతాడు. ఆ సమయంలో శివుడు ముని వేషంలో కుంతి ఇంటికి వస్తాడు. కుంతీదేవి మునికి మర్యాదలు కావించి, భోజనం పెడ్తుంది. శివుడు చేప ఎంగిలి, కప్ప ఎంగిలి లేని నీరు కావాలంటాడు. కుంతీదేవి నీటికొరకు గంగానదికి పోతుంది. నీరు తేవడంలో ఆలస్యమౌతుంది. శివుడు ప్రక్క ఇంట్లోని గాంధారి వద్దకు వెళ్ళి నీళ్ళివ్వమంటాడు. ఆమె తోడి కోడలింటికి వచ్చినవాడను ఈసుతో సానిపి (పేడ) నీళ్ళను ఇస్తుంది. శివుడామెకు నూటొక్క పువ్వులనిచ్చి వీటివల్ల సంతు కల్గుతుందని చెప్పి, నీ ఈసుకు తగ్గటే ఈర్ష్యా, అసూయాపరులు. వంశనాశనకారులు జన్మిస్తారని మనస్సులో శపించి వెళ్ళిపోతాడు. కుంతి ఇంటికి రాగానే శివుడుండడు కాని ఆరు పువ్వులున్న చెట్టు కన్పడుతుంది. పువ్వులను త్రెంపబోవగా శివుడు ప్రత్యక్షమై ఇవి సంతానమిచ్చే పువ్వులని చెప్తాడు. పువ్వులతో పిల్లలు పుడ్తారా అని కుంతీదేవి ఒక పువ్వు తింటుంది. కర్ణుడు పుడ్తాడు. కాని పాండురాజు తనను అనుమానిస్తాడనే భయంతో పసిపాపను నదిలో విడిచిపెడ్తుంది. పాండురాజు యుద్ధంలో ఇగవంతుల రాజులను జయించి మాద్రిని వివాహమాడి, ఆమెతో వస్తుండగా, శాపగ్రస్తుడౌతాడు.

ఇంటికి వచ్చిన తర్వాత ఇద్దరక్కచెల్లెండ్రు పూలను తింటారు. పుత్రులను పొందుతారు. గోండ్‌జాతి కథలో శంభుమహాదేవుడు ప్రపంచయాత్ర చేస్తూ గాంధారి, కొతుమల ఇంటికి వస్తాడు. ఆ సమయంలో గాంధారి నీటికొరకు పోతుంది. కొతుమకు ఐదు బియ్యపు గింజలను శంభుమహాదేవుడిస్తాడు. వానిలో సగం కొతుమ గాంధారికి ఇస్తుంది. కొతుమకు పంచపాండవులు, గాంధారికి ఇరవైఒక్క దుర్యోధనులు పుడ్తారు. దుర్వాసుని మంత్రప్రభావంచేత పాండవ జననం జరిగిందనడం కన్న శివవరప్రసాద ప్రభావం చేతనే పాండవులు జనించినారనడం ఔచితీవంతమైన సమర్థన. వేరొక కథలో కుంతీదేవి నీటికొరకు ఏటికి పోతుంటే సూర్యుడు చూచి మోహిస్తాడు. కర్ణుడు జన్మిస్తాడు. ఈజిప్టు పురాగాథలో ఇసిస్ (ప్రకృతి దేవత) ఓసిరసుకు (సూర్యునికి) హోరస్ జన్మిస్తాడు.

భారతంలో శ్రీకృష్ణుడు పాండవ పక్షపాతి. జానపద కథలలో దీనికి కారణం పాండవుల ధర్మవర్తన కాదు. కృష్ణుని స్వార్థమే. పాండురాజు చనిపోయిన తర్వాత అచ్చటి మునులు తండ్రి శవాన్ని తింటే త్రికాలజ్ఞత ఏర్పడుతుందని పాండవులకు వివరిస్తారు. పాండవులదే విధంగా తండ్రి శవాన్ని కోసి వండి తినడానికి సిద్ధమౌతారు. ఈ దృశ్యం ద్వారకలోని శ్రీకృష్ణునికి అరచేతిలో కన్పడుతుంది. జానపద కథలలో దివ్యదృష్టి ఉండదు. అరచేతిలో అంజన ముంటుంది. పాండవులు త్రికాలజ్ఞులైతే తనను మించిపోతారని, ప్రజలందరు పాండవులనే పూజిస్తారని శ్రీకృష్ణుడు భయపడ్తాడు. పాండవుల వద్దకు వచ్చి, "మీరు తండ్రి శవాన్ని తింటే నరకానికి పోతారు, ఇకముందు మీకేకష్టంవచ్చిన నేనాదుకుంటాను" అని మాట ఇస్తాడు. పాండవులు శ్రీకృష్ణుని మాటను మన్నిస్తారు కాని సహదేవుడప్పటికే శవపు చిటికెన వ్రేలిని తినేసి కొంత త్రికాలజ్ఞతను పొందుతాడు.

వ్యాస భారతంలో లాక్షాగృహ నిర్మాణానికి మూలకారకుడు అసూయ పరుడైన దుర్యోధనుడు. జానపదకథలో గాంధారికిగల పుత్రప్రేమ, తోడికోడలు సంపదపైనగల ఈర్ష్యయే లక్కయింటికి హేతువులైనాయి. పాండవులు తమ వంతుకు వచ్చిన పొలాన్ని సాగుచేయాలని అనుకుంటారు. విత్తనాలకొరకు భీముణ్ణి గాంధారి దగ్గరకు పంపుతారు. భీముడు వచ్చినపుడు గాంధారి కట్టెం

పొయ్యిపైన జొన్నరొట్టెలు చేస్తుంటుంది. ఆకలిగొన్న భీమునికి రొట్టెలు తినమని కూడ ఇవ్వదు. భీముడడిగిన విత్తనాలను "పెంకపై" వేయించి, ఇస్తుంది. భీముడు ఆకలికి తాళలేక మధ్యదారిలోనే గింజలను తిని ఊకను మాత్రం ధర్మరాజు కిస్తాడు. ధర్మరాజు ఆ ఊకను భూమిలో వేయగానే, క్షణంలో మొలకలొచ్చి మూడుక్షణాల్లో నూరుపుట్ల పంటపండుతుంది. పావుశేరు కొఱ్ఱలకు పుట్టెడు ధాన్యాన్ని గాంధారికి పంపిస్తారు. ఆమె వారి అదృష్టానికి అసూయచెంది, శకునితో ఆలోచించి లక్కయింటిని కట్టిస్తుంది. జానపదులు వ్యవసాయదారులు కాబట్టి, వారి జీవితాలకనుగుణంగా పాండవులు వ్యవసాయదారులైనారు. వారి వృత్తి, రాజ్యమేలడం కాదు పంటలు పండించడం గాంధారి రాణియైనను కట్టెల పొయ్యి పైననే రొట్టెలే చేసింది. జానపదులకు అలవాటైన తిండి రొట్టెలే.

పాండవులు అరణ్యవాసం చేస్తున్న సమయంలోనే శ్రీకృష్ణుడు, పాశుపతాస్త్రాన్ని శంకరునినుండి పొందమని బోధిస్తాడు. అర్జునుడు అమరావతి నుండి కైలాసపర్వతం చేరుతాడు. కాని తపస్సులోనున్న శివుడు అర్జునుణ్ణి గమనించడు. కొన్నిరోజులు అర్జునుడు వేచి ఉంటాడు. కాని ఫలితం ఉండదు. కోపంతో అర్జునుడు పరమేశ్వరుడు కూర్చున్న గద్దెను కూలదోయబోతాడు. పార్వతి భయపడి పరమేశ్వరుణ్ణి మేల్కొల్పి అర్జునునికి వరమియ్యమంటుంది. ఈ కథలో పరమేశ్వరార్జునుల భీకరయుద్ధం లేదు. జానపదకథలలో పార్వతి సలహాఇస్తుంటుంది, ఈశ్వరుడు ఆచరిస్తుంటాడు. పాశుపతాస్త్రం లభించగానే ఆనందంలో అర్జునుడు ఈశ్వరునికి కూడ నమస్కరించక వెళ్ళిపోతాడు. శివునికి కోపంవచ్చి చిత్రకన్ను తెరచి "తన తమ్ముడు ఇష్టమూర్తి బలమతనిపై ఉన్నది" - అని గ్రహిస్తాడు.జానపదసాహిత్యంలో హరిహరుల మధ్య భేదం ఉండదు వారిరువురూ అన్నదమ్ములే! శివుడు అర్జునుని పరాక్రమాన్ని పరీక్షించాలని అగ్ని, వాయువు, పిడుగు దేవుళ్ళ నతని పైకి పంపిస్తాడు. అగ్ని, వాయుదేవుళ్ళు ఓడిపోయి తమ అస్త్రాలను అర్జునునికిస్తారు. పిడుగు దేవుడు కూడ పరాజితుడై "కలియుగంలో ఉరుము ఉరిమితే ధర్మనందన సోదరా, అర్జున, అర్జునా" అని నిన్ను వేడు కుంటే నేను ఆరు ఆమడల దూరం పోతాను అని వరమిస్తాడు ఇప్పటికీ పల్లె పట్టులలో ఉరుము ఉరమగానే అర్జునా అర్జునా అని స్మరిస్తారు. స్మరించి పిడుగు పారిపోయిందని తృప్తిచెందుతారు.

పాండవులు ద్వైతవనము నందున్నప్పుడే సైంధవుడు ద్రౌపదిని అపహరించుకొని పోతూంటాడు. సహదేవుడు అరచేతిలో అంజనమేసుకొని జరిగిన సంఘటనను భీమునికి చెప్తాడు. భీముడతన్ని పట్టుకొని తలగొరగించి, సున్నపు బొట్లుపెట్టి గాడిదపై కూర్చోపెడ్తాడు. సహదేవుడు "కంచర గాడిదకు బావ కంటిల్ల" అని మంత్రం వేస్తాడు. సైంధవుడు గాడిదకంటుకొని పోతాడు. గత్యంతరం లేక హస్తినాపురానికి కూడ అలాగే పోతాడు. అతన్ని గాడిద నుండి దింపబోయి నూరుమంది కౌరవులు, పదునెనిమిది అక్షౌహిణుల సైన్యం ఒకరికొకరు అంటుకొనిపోతారు. కృష్ణుని సలహా ననుసరించి దుర్యోధనుడు సహదేవున్ని ప్రార్థించగా, అతడు "అందరూ ఉడిల్ల" అని మంత్రంవేస్తాడు. ఎక్కడి వారక్కడే విడిపోతారు. వ్యాసభారతంలో సహదేవుని ప్రసక్తి ఎక్కువగాలేదు. జానపద సాహిత్యంలో సహదేవుడే కథానాయకుడై నడిపించిన కథలు అనేకం ఉన్నాయి. పండితుల నిరాదరణ పొందిన కొన్ని పాత్రలు జానపదుల విశేష ఆదరణ పొందాయి. వ్యాస భారతంలో సైంధవుణ్ణి పాండవులు వికృత స్వరూపునిగా చేసినట్లుగా ఉంది. ఈ చిన్న అంశమే, జానపద సాహిత్యంలో ఒక రాత్రంతా చెప్పేకథగా రూపుదిద్దుకొన్నది. ఈ కథలో జానపదులు హాస్యం, మాంత్రికశక్తులను మిశ్రితం కావించి సైంధవునికి, కౌరవులకు సహదేవునితో పరాభవింపజేసి తృప్తిచెందారు. మామూలు జానపద కథలలో రాజు చిన్న కొడుకే ప్రముఖుడు, పరాక్రమవంతుడు. జానపద మనస్తత్వానికి అనుగుణంగా మహాభారత కథలలో సహదేవుడు కథానాయకుడైనాడు.

అర్జునుడు ప్రమీలాదేవిని వివాహమాడిన కథ జైమినీ భారతంలో ఉంది. ఈ కథ పితృస్వామిక సమాజానికి ముందు మాతృస్వామిక సమాజమున్నదనే సత్యాన్ని ఋజువుచేస్తుంది. స్త్రీ రాజ్యమేలడం, పాండవులను పరాజితం కావించడం జానపదుల నెక్కువగా ఆకట్టుకున్న అంశాలు ప్రమీలారాణి కథయే జానపద సాహిత్యంలో అల్లిరాణి కథ. ఈమె కథ తెలుగుదేశంలోనే కాక, కన్నడ దేశంలోకూడ బహుళ ప్రచారంలో ఉంది కైలాసంలోని పార్వతి స్నానంచేస్తూ శరీరపు మురికిని, సున్నిపిండిని కలిపి క్రొత్తకుండలో పెట్టి సముద్రంలో విడచిపెడ్తుంది. అందులో నుండి ఆదిశక్తి వచ్చి సముద్రంలోని ప్రాణులనన్నింటిని పరిమారుస్తుంటే, పార్వతి, శక్తిని పువుగా మార్చి నిస్సంతువైన మధునాసగరపు

రాజు కొంగులో వేస్తుంది. ఆ పుష్పమే అల్లిరాణి అవుతుంది. బిడ్డ ఆలన,పాలనలో రాజు రాచకార్యాలను నిర్లక్ష్యం చేయగా, మంత్రి సింహాసనాన్ని కైవసం చేసు కుంటాడు రాజు, అల్లిరాణి, ఇరువురు పన్నెండేండ్లు అరణ్యవాసం చేస్తారు: అల్లిరాణి మంత్రితో యుద్ధంచేసి, ఓడించి సింహాసనాధీశురాలౌతుంది. మంత్రి చేసిన అన్యాయానికి మగజాతిపైననే ఆమెకు ఆగ్రహం, అసహ్యం కలుగుతాయి. "మొలతాడు కట్టిన మొగపిల్లవాడు, నేలపైన మగచీమ, ఆకాశంపైన మగపక్షి ఉండకూడదు" అని శాసిస్తుంది. స్త్రీ సైన్యాన్ని తయారుచేస్తుంది. అల్లిరాణి శాసనం, పరిపాలన తెలియని అర్జునుడు రాజ్యంలో అడుగుపెట్టి, ఆమెతో యుద్ధం చేసి ఓడిపోతాడు కాని ఆమెనే పెండ్లాడుతానని కృష్ణునితో మొరపెట్టుకుంటాడు. కృష్ణుని కుతంత్రంతో, అర్జునుడు అల్లిరాణికి తెలియకుండ, ఆమె మెడలో మంగళసూత్రం కట్టి మాయమౌతాడు. ఆ మంగళసూత్రాన్ని తీసివేయడానికి ఎంత ప్రయత్నించినా, సాధ్యం కాదు. చేసేదిలేక కృష్ణుని సలహాననుసరించి ప్రపంచంలోని ఏపురుషుడైనను, తనతో యుద్ధముచేసి గెలిచి పెండ్లాడవచ్చునని చాటింపు వేయిస్తుంది. పాండవులు, దుర్యోధనాదులు పరాజితులై అల్లిరాణికి బందీలౌ తారు. చివరకు ద్రౌపది తనభర్తలు బందీలైనారని తెలుసుకొని, ఆదిశక్తి రూపంలో వచ్చి అల్లిరాణిని యుద్ధానికి పిలుస్తుంది. అల్లిరాణి ఆమె స్వరూపానికి భీతిల్లి, నమస్కరిస్తుంది. ద్రౌపది ఆదేశానుసారం అల్లిరాణి అర్జునుణ్ణి వివాహ మాడుతుంది. మగమహారాజులనోడించిన అల్లిరాణి ద్రౌపదికి ఓడిపోవడం, స్త్రీ శక్తి, స్త్రీశక్తికే పరాజితమౌతుందనే కథాంశం, జానపదునికి స్త్రీశక్తిపైనున్న గౌరవాన్ని వ్యక్తం చేస్తుంది. ద్రౌపదీదేవి ఆదిశక్తి అవతారమను జానపదుల నమ్మకానికి కథ చక్కని ఉదాహృతి.

ఆదిశక్తియే, రేణుకాదేవిగా, సీతాదేవిగా, ద్రౌపదీదేవిగా అవతారాలను దాల్చినదనియు, త్రిమూర్తులకు మూలకర్త్రి అనియు పల్లీయుల ప్రగాఢ విశ్వాసం.

> "మొదటి యుగమ్మున రేణుకవైతివి-కృతయుగమ్మున సీతవైతివి
> ద్వాపరమ్మున ఐదుగురికి రాణివైతివి-మంగళం మంగళం కాళికాదేవి
> ముగ్గుర మూర్తుల మూలం నీవె - మహిషాసురుల ద్రుంచితివే తల్లి"—

అని కథకులు భారత కథా గానాంతంలో పాడుతుంటారు. ద్రౌపది పంచ పాండవులను మించిన శక్తిమంతురాలను కథ ఒకటి ప్రచారంలో ఉంది. అరణ్య

వాసంలో హిడింబాసుర, బకాసురుల వధానంతరం భీముడు ప్రపంచంలో తనకు మించిన శక్తివంతులు లేరని కృష్ణునితో ప్రగల్భాలు పలుకుతాడు. కృష్ణుడు ద్రౌపదితో సమానులైన శక్తిస్వరూపులు ముల్లోకాలలో లేరని సమాధాన మిస్తాడు. కోపంతో భీముడు ఋజువు చేయమంటాడు. అమావాస్య అర్ధరాత్రి కృష్ణుడు భీముని అరణ్యమధ్యానికి తీసుకొనిపోతాడు. అక్కడ ఏడు తాటిచెట్ల పొడవున, జడలు విరబోసుకొని, సింహంవలె గర్జిస్తూ తిరుగుతున్న ద్రౌపది భీకర స్వరూపాన్ని భీమునికి చూపెడతాడు. భీముడు ఆమె భీకర స్వరూపానికే భయంతో స్పృహ కోల్పోతాడు. ద్రౌపదీదేవి శక్తి స్వరూపిణి అనేడి పామరులను సమర్థిస్తూ కట్టమంచి రామలింగారెడ్డిగారు "పండిత హృదయాల కంటే పామర హృదయాలలోనే సత్యనిర్ణయ శక్తి ఎక్కువ. దీనికి నిదర్శనం వేలకొలది గ్రామాలలో ద్రౌపది దేవతగా పూజింపబడుట, అర్చింపబడుట"- అని పేర్కొన్నారు. చిత్తూరు, నెల్లూరు, ఉత్తరార్కాడు మండలాలలో ద్రౌపదీ దేవాలయాలున్నాయి. ఈ గుడులలో పోతురాజు విగ్రహముండడం, ఉత్సవాలలో బలులనివ్వడం, నిప్పుగుండాలు తొక్కడం, జాతరలో పోతురాజు ప్రాధాన్య ముండడం వలన జానపదులకు ద్రౌపదీదేవి గ్రామదేవతయే అని స్పష్టమవుతుంది.

ద్రౌపదీదేవి కాళికాదేవి అవతారంగా, గ్రామదేవతగా పూజింపబడడం, ఆమె ప్రాచీనతను, ప్రాధాన్యాన్ని సూచిస్తుంది. ద్రౌపదీదేవికి మరొక అభిఖ్య "కృష్ణ" సింధు సమాజంలోని ప్రధాన గణమాత "నిరృతి." ఈమె కృష్ణవర్ణం కలది. పితృప్రధానులైన ఆర్యులు ఆమెను నరకదేవతగా, మృత్యుదేవతగా, పేర్కొన్నారు. నిరృతిదేవత కూతురు నైరుతివాక్, అధర్వణ వేదమందు ఈమె రాష్ట్రీదేవి, స్వామిని, గణపు ధనాన్ని రక్షించుననియు వర్ణింప బడింది. అనార్యులను ఆర్యులు కృష్ణచర్ములు, కృష్ణయోనులు, కృష్ణవర్ణులుగా పేర్కొన్నారు. విశ్వామిత్రుడు ఆర్యుల శత్రువులను, కృష్ణవర్ణులను సంహ రించుమని ఇంద్రుణ్ణి స్తుతించాడు. అంగిరసశునహోత్ర పుత్రుడు గృత్స మదుడు, ఆర్యుల శత్రువులను కృష్ణయోను లన్నాడు. పరాజితులైన శత్రువుల స్త్రీ, పురుషులను ఆర్యులు దాస, దాసీలుగా చేసుకొని పని చేయించుకొనే వారు. ఋగ్వేదంలో త్రసదస్యుడు కణ్వపుత్రశోభరికి 50 మంది వధువుల నిచ్చినట్లుంది. ఇక్కడ వధువు అంటే దాసి అని అర్థం. ద్రౌపది కృష్ణగా.

దాసీగా మహాభారతమందు వ్యవహరింపబడినందువలన, ఈమె ఆనార్య మాతృగణ వ్యవస్థకు చెందినదని ఊహింపవచ్చు.

వ్యాసభారతంలో యుధిష్ఠిరుడు విరాట నగరమందు ప్రవేశించడానికి పూర్వం దుర్గను కృష్ణ, యశోదపుత్రిక, వాసుదేవసోదరి, భీకర స్వరూపిణి, వింధ్యావాసిని, బ్రహ్మచారిణి, ముగ్గురు మూర్తులకు మూలపు దేవతని, బలి మద్యమాంసాదులను కోరు దేవతని, నీ నామస్మరణ వలన వనచరులకు, రోగ పీడితులకు, మృత్యువాసన్నులకు రక్షణ లభించుతుందనియు, ఆపదలు తొలగుతా యనియు కాళికాదేవిని స్తుతించినాడు. హరివంశంలోని యోగమాయ స్తోత్రమందు ఆమె - వింధ్యావాసిని, రౌద్రి, సంధ్య, ముక్తకేశిని, మృత్యువు, నీలగాత్రి, బలి మద్యమాంసాదులను స్వీకరించు దేవత అని వర్ణింపబడినది. దుర్గ, ద్రౌపది- ఇరువురు కృష్ణవర్ణ ప్రకాశితులు, ముక్తకేశినులు, దుష్టసంహారిణిలు. శక్తి స్వరూపిణియైన ద్రౌపదీదేవి దుర్యోధనుల సంహారానికై అవనిపై అవతరించిన అతివ. వ్యాసభారతంలో ద్రౌపది క్షత్రియాంతగా వ్యవహృతమైంది. అగ్నిగుండం నుండి ద్రౌపది ఉద్భవించిన విధంలో, ధర్మజుడు కావించిన కాళికాదేవి స్తోత్రంలో పోలికలు కన్పడుతున్నాయి. దుర్గకు పార్వతి అనే పేరుకూడ ఉంది. పృశతి కూతురు ద్రౌపదికూడ పార్వతియే. పృశతి గణదేవత దుర్గఅనియు, అదే గణానికి చెందింది ద్రౌపగి అని శ్రీ శారద పాటిల్ వివరించారు.

శక్తి స్వరూపిణియైన పాంచాలి లోకందృష్టిలో పంచపాండవులకు భార్యగా నటించిందేగాని, వారితో దాంపత్య జీవితాన్ని అనుభవించలేదని జానపద భారత కథకుల అభిప్రాయం. వైదికసమాజంలోని పురుషుని మాదిరిగా జానపద సాహిత్యంలో స్త్రీల బ్రహ్మచర్యానికే ఎక్కువ ప్రాధాన్యముంది. గ్రామ దేవతలలో అధిక సంఖ్యాకులు బ్రహ్మచారిణులు, అవివాహితులు. వివాహితులైన వారికి సంసార సుఖంలేదు, సంతాన ప్రాప్తిలేదు. అదే విధంగా ద్రౌపది కూడ పంచపాండవులకు పత్నియైన బ్రహ్మచారిణియే.

పాండవుల ఐక్యతకొరకే ద్రౌపదిని వివాహ మాడమని కుంతి, తన కుమారుల కాదేశించిందని కొందరు విమర్శకుల అభిప్రాయం. పాండవులు పుట్టి పెరిగింది శతశృంగ పర్వతం అంటె టిబెట్ ప్రాంతం. ఈ ప్రాంతంలో జీవితాప

సరవస్తువుల ఉత్పత్తికి తగిన వనరులు లేవు. జనాభా ఎక్కువైతే తిండికి, బట్టకు కష్టమౌతుంది. అందుకనే అన్నదమ్ము లందరూ కలసి ఒకే స్త్రీని వివాహమాడు తారు. దీనివలన జనాభా పెరుగదు. ఆస్తి తరుగదు. ద్రౌపదిని వివాహమాడి నపుడు పాండవులు ఆస్తిలేని పేదవారు. మన సామాజికవేత్తలు సమాజపు తొలి స్వరూపాన్ని, ఆచారాల పుట్టుపూర్వోత్తరాలను అవగతం చేసుకోవాలంటే నేటి ఆటవిక తెగల జీవితక్రమాన్ని ఆచారాలను పరిశీలించాలని నిర్ధారించారు. బహు భర్తృత్వం మధ్యప్రదేశ్ తోడా జాతిలో కన్పడుతుంది. ఈ ఆటవిక తెగలో ఒకే స్త్రీ ఎంతమంది పురుషులనైనను పెండ్లి చేసుకోవచ్చు. భర్తలందరూ సామాన్యంగా అన్నదమ్ములై ఉంటారు. డెహ్రాడూన్ ఖాసాలలో, హర్యానాలోని జాట్ కులస్థులలోను బహుభర్తృత్వ ఆచారపు ఛాయలు కన్పడుతున్నాయి. రాయలసీమలో వెనుకబడిన కొన్ని తెగలలో మారుమనువు మామూలే. వరుసగా నలుగురు భర్తలకు విడాకులిచ్చి అయిదవ భర్తను వివాహమాడిన స్త్రీ గౌడసాని. ఇదే విధంగా ఏడవ భర్తను పెండ్లాడిన స్త్రీ పెద గౌడసాని. గౌడసాని మాట ఆ తెగవారికి వేదవాక్కు. కులం తగవులలో తీర్పు గౌడసానిదే. జానపదుల ఈ జీవిత విధానం కూడ ద్రౌపదిని శక్తిస్వరూపిణిగా రూపొందించడంలో ఒక కారణం కావచ్చు.

"ధర్మరాజు జూదం" అనెడి స్త్రీల కథాగేయంలో ధర్మజుడు ఓడిన తర్వాత ద్రౌపది, దుర్యోధనునితో, "ధర్మరాజుతో జూదమ్ము నాడితివి గాని, తన తోటి జూదమ్ము ఆడుము" - అని పలుకుతుంది. అంతేగాక "పాపకర్ముడైన రారాజు ముఖము చూడనని మధ్యన తెరవేయించి, పాంచాలి కాలితో పాచికలు త్రోసె" ధర్మజుడోడిన సర్వసంపదలను పాంచాలి గెలుచుకుంటుంది. "శకుడు" వచ్చి "ఆడువారు అసాధ్యులు, అటుగాక ద్రౌపది పతివ్రత ఆమెతో ఆడకూడదు" అని రారాజు ఆటను మాన్పించుతాడు. ఈ కథలో పల్లెపడుచు, పౌరుషగుణమే ద్రౌపదీదేవి పాదాలతో పాచికలను వేయించింది.

కావ్యాలలో మృగ్యమైన సామాన్యుని సాంసారిక జీవితస్వరూపం జానపద సాహిత్యంలో విరాట్ స్వరూపం దాలుస్తుందనడానికి చక్కని ఉదాహృతి "సుభద్రసారె". అర్జునుడు ఒకనాడు సుభద్రతో "బూరెలు వండుకొని పుణ్యుడా రమ్మని పిలిచిరే మీవారు, గారెలు వండుకొని అల్లుడా రమ్మని పిలిచిరే మీవారు"-

అని ఆమె పుట్టింటి వారిని పరిహసిస్తాడు సుభద్ర "పెట్టుగల పెద్దింట పెళ్ళాడను తేను అచ్చట్లు ముచ్చట్లు అన్ని జరుగు మావారు పేదవారు మీకేమి పెట్టగలరు"- అని సమాధాన మిస్తుంది. మాటకు మాట జవాబిస్తావా అని అర్జునుడు సుభద్రను పాంకోళ్ళతో తన్నుతాడు సుభద్ర పిల్లవాణ్ణి చంకలో వేసుకొని రోషంతో పుట్టింటికి వెళ్ళిపోతుంది. పుట్టింటిలో కొన్నిరోజులున్న తర్వాత కృష్ణుడు ఆమెకు ఘనంగా సారెపెడ్తాడు. సిరిసంపదల నన్నిటిని తీసుకొనిపోతున్న సుభద్రతో వదినలు కోపముతో ఈర్ష్యతో

> "ఇల్లు విరుసుకు పొమ్మ్మ ఓ ముద్దుగుమ్మా-ఏడె ధాన్యంబుండె ఎత్తుకుపొమ్మా
> వండిన వంటకము ఎత్తుకొనిపొమ్మా-కాళ్ళమట్టెలజోడు ఎత్తుకొనిపొమ్మా
> కట్టుకొను బట్టొకటి ఉంచుమీ"-

అని ఎత్తిపొడుస్తారు. సుభద్ర వదినల మాటలకు దుఃఖించి, "అన్నరో వింటివా ఆలి మాటలను" అని అన్నతోచెప్పుకొని బాధపడుతుంది. శ్రీకృష్ణుడు "కొన్న మానిసులంటే కొదువేమి మనకు" - అని సుభద్రనోదార్చి ఘనమైన సారెతో అర్జునుని కడకు పంపుతాడు. పల్లెపడతి రోషగుణం సుభద్రలో ప్రతిబింబిస్తుంది. ఈ కథలోని "కొన్నమానిసి" అనెడి పదం కన్యాశుల్కాన్ని సూచిస్తుంది. నేటికి కొన్ని నిమ్నజాతులలో, ఆటవిక తెగలలో కన్యాశుల్కం ఇవ్వడం ఆచారంగా ఉంది. అగ్రవర్ణాలలో వరకట్న ఆచారం ఉంది. ఈ తారతమ్యానికి కారణం సామాజిక చరిత్రను పరిశీలిస్తే అవగతమౌతుంది. ఆదిమ కాలంలో స్త్రీ, పురుషులు సామాజిక ఉత్పత్తిరంగంలో సమానబాధ్యతను వహించేవారు. ఇరువురి స్థాయి సమానంగా ఉండేది. అయితే ఒక తెగనుండి కాని, ఇంటినుండి కాని పురుషుడు స్త్రీని వివాహం చేసుకొని తెచ్చుకోవాలంటే, ఆ కన్య తల్లితండ్రులకు కొంత శుల్కం చెల్లించెడివారు. ఆడపిల్ల వివాహంతో తల్లితండ్రులు తమబిడ్డ శ్రమను, శ్రమఫలితాన్ని కోల్పోతే, వివాహమాడిన వరుడు ఆమెశ్రమ ఫలితాన్ని అనుభవించేవాడు. అందుకే ఆడపిల్ల తల్లిదండ్రులు కోల్పోయిన శ్రమకు, మూల్యం చెల్లించి వివాహం చేసుకొనేవారు. నాగాలాండ్‌లో ఆటవికతెగ యువకుడు కాబోయె మామదగ్గర కొంతకాలం పనిచేసిన తర్వాత కోరుకున్న యువతిని పొందుతాడు. ఈ ఆచారంలోని అంతర్యం తల్లిదండ్రులు వెళ్ళిపోతున్న కూతురి శ్రమకు మారుగా అల్లుని శ్రమను పొందడమే. మధ్యప్రదేశ్‌లోని ఖోండ్, బైగా తెగలలో వరుడు

కన్యాశుల్కం ఇవ్వలేని బీదవాడైతే మామ ఇంట్లో ఏడుగాని రెండు సంవత్స రాలు గాని పనిచెయ్యాలి. తర్వాత పరిణయ మాడాలి. కాలక్రమేణ వరుడు కాబోయే మామదగ్గర పనిచేయడమనే ఆచార మే, వధువు పక్షంవారికి పశువులను బట్టలను, వివిధ వస్తువులను, డబ్బును కన్యాశుల్క రూపంలో చెల్లించడంగా మారింది. మధ్యప్రదేశ్‌లోని ఖారియా (Kharia) ఆటవిక తెగవారు 12 ఎడ్లను ఖోండ్ తెగవారు 12 నుండి 20 పశువులను, మాది బుహియా (Madhi Bhuiyas) తెగలో 2 ఎడ్లు లేదా ఆవులను కన్యాశుల్కంగా ఇవ్వాలి. భైరా తెగలో పిల్లతండ్రి బియ్యాన్ని, బట్టలను, మేకను వసూలు చేస్తాడు. కోల్, ముండా జాతిలో పశువులను ఇవ్వలేని వారు 7-18 రూపాయల నివ్వాలి. బైగా జాతిలో కన్యాశుల్కం 5-20 రూ., గైరియా (Gauria) తెగలో 16 రూ., భిల్ (Bhil) తెగలో 20-25 రూ., ధనవార్ (Dhanwar) తెగలో 6 రూ., కొరవ (Korwa) తెగలో 12 రూ., గొలర్ (Golar) గుజర్ (Gujar) తెగలలో వితంతువులకు కూడ శుల్కం చెల్లిస్తారు. అమెరికాలోని ఇండియన్ తెగలలో పెళ్ళికి పూర్వం వరుడు వధువుకు, ఆమె తల్లి పక్షం వారికి బహుమతు లిస్తాడు. పెళ్ళి కూతుర్ని కొనుక్కొని ఇచ్చిన బహుమతులుగానే వాటిని లెక్క కడుతారు. మధ్యప్రదేశ్‌లోని గోండ్‌లలోకూడ పెండ్లి కూతురికి, ఆమె బంధువు లకు ముఖ్యంగా మేనమామకు బహుమతులిస్తారు. ఘాసియా తెగలో పిల్ల తల్లికి చీర, ఇంట్లో వారికి వివిధ వస్తువులనిస్తారు. మన తెలుగుజాతిలో నిమ్న కులాలలో ఊరఖర్చని పిల్లతల్లికి కొన్ని రూపాయలు, చీర కట్నమిస్తారు. ఈ ఆచారం మాతృగణ వ్యవస్థ అవశేషం కావచ్చు. గణ వ్యవస్థలో పురుషునికి వ్యక్తిగత ఆస్తి, సంపదపై కాంక్ష పెరగడంతో స్త్రీ పరిస్థితి దిగజారి పోయింది. సంపద కొరకు ఒక తెగపై మరొక తెగ ఒక జాతి మరొక జాతిపై దాడిచేసుకున్నాయి. గెలిచినవారు అధికారులు, ధనికులు, రాజులైనారు. పరాజితులైన వారు బానిసలై నారు. ఉత్పాదక శక్తితోపాటు బానిసత్వం అధికమైంది. ధనికులు - బీదలేర్పడి నారు. వర్ణభేదాలు, కులభేదాలు అధికమైనాయి. సంపద పరులైన అగ్రవర్ణాల వారికి బానిసలు ఉచితంగా లభించడంతో స్త్రీల శ్రమకు విలువపోయింది. క్రమంగా స్త్రీ ధనవంతుని గృహబానిసగా, సంతానోత్పత్తి సాధనంగా, శృంగార సాధనంగా మారింది. (మహాభారత కావ్యంలోని మహిళ పరిస్థితి ఈ వ్యవస్థనే పోలి ఉంది). స్త్రీకి ఆర్థిక విలువలేని అగ్ర వర్ణాలలో కన్యాశుల్కానికి

వ్యతిరేకమైన వరకట్నం ఆరంభమైంది. నేటికి అది ప్రచండ రూపం దాల్చింది. అనేక అతివల ఆత్మహత్యకు దారి తీస్తున్నది. స్త్రీ, పురుష శ్రమశక్తి పైననే ఆధారపడి జీవిస్తున్న నిమ్న జాతులలో మాత్రం నేటికి కన్యాశుల్క ఆచారం జీవించి ఉంది. కాని అగ్రవర్ణాల ఆచారాలన్నీ గొప్పవనీ, ఆదర్శవంతమనీ, అనుసరణీయాలైనవని భావించే జానపదులు తమ ఆచారాలను అల్పంగా భావిస్తారు. అందుకే జానపద శ్రీకృష్ణుడు కన్యాశుల్కమిచ్చి సత్యభామాదులను పరిణయ మాడినను, కొన్నమానిసులంటే కొదవేమి మనకు అని భార్యలను ఈసడించాడు. సుభద్రను ఓదార్చాడు.

నేటి ఆధునిక స్త్రీ సామాజిక, ఆర్థిక ఉత్పత్తిలో పురుషునితో సమానంగా పాటుపడినా, లేదా గృహిణి ఇంటి పనికి విలువకట్టినా వరకట్న దురాచారం సమసిపోతుంది. స్త్రీల జీవితాలలో సుఖశాంతులు వెల్లివిరుస్తాయి.

పాండవులు యుద్ధానికి సిద్ధమౌతుంటే కృష్ణుడు విజయసాధనకు కాళికాదేవికి బ్రహ్మచారి, పరాక్రమవంతుడైన యువకుడ్ని బలిఇవ్వమంటాడు. ఈ అర్హతలన్నీ ఉన్న ఉలూచి కుమారుడు ఇళావంతుడు బలికి అంగీకరిస్తాడు. బలి అవుతాడు. అప్రధానమైన ఇళావంతుణ్ణి ఉదాత్తునిగా, త్యాగపురుషునిగా జానపదులీకథలో చిత్రించినారు. ఒకప్పుడు నరబలి ప్రపంచ వ్యాప్తంగా ఉండేది. తర్వాత నరబలి, జంతుబలిగా మారింది. జానపదులు మొక్కులు మొక్కుకోవడం బలి ఇవ్వడం సామాన్యమే. జానపదుల నమ్మకమే ఈ కథా కల్పనకు మూల కారణం కావచ్చు.

సహదేవుని కథ, రంపాలరాజు కథలు జనపదాలలో రెండు రాత్రుళ్ళు చెప్పే కథలు సహదేవుని కథలో, సహదేవుడు మేనమామ మాద్రిరాజు కూతురు ఇంద్రమతిని అష్టకష్టాలనుభవించి వివాహమాడుతాడు "రంపాల రాజుకథ"లో నకులుని భార్య రూపాలదేవిని భీముడు ఇక్కట్ల పాలుచేస్తాడు. రూపాలదేవి కుమారుడు భూపాలుడు తల్లిని కష్టాలనుండి విముక్తి చేస్తాడు. ఈ కథలలో పాత్రలపేర్లు తీసివేస్తే, మామూలు జానపదకథ లవుతాయి.

జానపదులకు రాముడు, కృష్ణుడు భగవత్స్వరూపులే కాని, గ్రామదేవతల పైనగల భయ, భక్తి భావాలను వారిపై ప్రదర్శించరు. వైదిక సమాజపు దేవత

లైన రామకృష్ణులు యుద్ధప్రియులు. యుద్ధాలతో పనిలేని శాంతికాముకులైన జానపదులు వ్యవసాయ ప్రధానులు, శ్రమజీవులు. వారికి వ్యవసాయాధిదేవత లైన గ్రామదేవతలే ప్రధానులు. మహాభారత కథలనాధారంగా చేసుకొని జానపదులు గొంతులమ్మ పండుగ, ద్రౌపదీదేవి ఉత్సవాలను జరుపుతారు. కుంతీదేవి జన్మవృత్తాంతాన్ని రహస్యంగా పెట్టినందుకు ధర్మరాజు, తల్లిని మాదిగవారికి దేవతవుకమ్మని శపిస్తాడు నేటికీ పండుగను నిమ్నకులాల వారు జరుపుకుంటారు. నెల్లూరులో ధర్మరాజాలయముంది. అందులో ద్రౌపది ప్రధానదేవత. ద్రౌపదీదేవి బ్రహ్మోత్సవాలను అగ్నికుల క్షత్రియులు జరుపుతారు. మహాభారత కథనీ ఉత్సవాలలో ప్రదర్శిస్తారు. చివరిరోజు అగ్నిగుండాన్ని సిద్ధం చేస్తారు. ప్రధాన అర్చకుడు స్త్రీ వేషంలో కలశాన్ని నెత్తిపై పెట్టుకొని అగ్నిగుండంలోకి ప్రవేశిస్తాడు. కలశం ద్రౌపదీదేవికి ప్రతీక రెండవ అర్చకుడు పోతురాజు విగ్రహాన్ని ఎత్తుకొని గుండంలోనికి ప్రవేశిస్తాడు. మిగిలినవారు వీరిని అనుసరిస్తారు. పూజారి స్త్రీ వేషములో దేవతల నర్చించడం ప్రపంచ మంతటా కనపడుతుంది. ఉత్తర భారత దేశంలో తీగల్ జాతిలో పూజారి స్త్రీ వేషం వేసుకొని కలశాన్నెత్తుకొని ఉత్సవపు ఊరేగింపుముందు నడుస్తాడు. మహారాష్ట్రలోని తుకాయి దేవతనర్చించే పూజారులు స్త్రీ వేషాన్ని ధరిస్తారు. ఆదిలాబాదులోని గజ్జెలమ్మకు, మహారాష్ట్రలోని అంబాబాయికిపూజారిణులే కాని పూజారులుండరు. ఉత్తర, దక్షిణ అమెరికాలలోని కొన్ని తెగలలో మడగాస్కర్‌లో పురుషులు స్త్రీ వేషంతోనే పూజలు చేస్తారు. హిందూ మతంలో కలశం శుభచిహ్నం. శ్రీ కోశాంబి కలశం గ్రామదేవతకు ప్రతీక అని వివరించారు. మన గ్రామదేవతలలో ఎల్లమ్మ, బెంగాల్‌లోని మానసాదేవి, పేరంటాలు సవారమ్మలు కలశానికి ప్రతీకలుగా భావింపబడుతున్నారు. కన్నడ, తమిళదేశాలలో కరగానికే (కలశం) బలినిస్తారు ద్రౌపదీదేవి బ్రహ్మోత్సవాలలో ద్రౌపది కలశరూపంలో పూజింపబడుతున్నది. ఈ ఆచారాలు అంతరించిపోతున్న మాతృస్వామిక అవశేషాలు కావచ్చు.

**భాగవత కథలు :-** భగవత్తత్త్వ ప్రధానమైన భాగవత కథలలో జానపదులు శ్రీకృష్ణుని అల్లరి వానిగ, మాయలమారిగ, అద్భుతశక్తిపరునిగా, చోరునిగా, జారునిగా చిత్రించినారు. "కృష్ణ జననం" కథలో మేనల్లుడే మామను

హతమార్చుటకు గల కారణం వింతగా వివరింపబడినది. కంసుడు చెల్లెలి పెండ్లి చేస్తే, తనను విడచిపోతుందని పెండ్లి ప్రయత్నాలను కూడ మాను కుంటాడు. దేవకి శివునితో మొరపెట్టుకొంటుంది శివుడు కంసునికి చెల్లెలి పెండ్లి చేయమని సలహాఇస్తాడు కంసునికి చెల్లెలిపై కోపం వస్తుంది. "పెండ్లిపైన కోరిక ఉంటే నన్నడగవచ్చుకదా, పరాయివాడైన శివుణ్ణి ఎందుకు అడగాలి" అనికోపంతో సప్తసముద్రాల కవతలనున్న ముసలివానికిచ్చి చెల్లెలి పెండ్లి చేస్తాడు. పెండ్లి తర్వాత వధూవరులను తీసుకొనిపోతుంటే ఆకాశవాణి, 'తల్లికి అన్యాయం చేసి నందుకు, నీమేనల్లుడే నిన్నుచంపేస్తాడని" హెచ్చరిస్తుంది. కృష్ణుడు పుట్టుకతోనే ఏడుగురు దాసులను చంపుతాడు, స్నానానికి గంగను రప్పించి తన అద్భుత శక్తులను ప్రదర్శిస్తాడు. పెరిగి పెద్దవాడవుతున్న కృష్ణుని అల్లరి భరించలేక యశోద "గుమ్మడు" వచ్చి కరుస్తాడని భయపెడుతుంది. కృష్ణుడు గుమ్మడిని తన దశావతారాలలోను చూడలేదని, నోటిలో ఉన్నాడేమో చూడమని అంటాడు. కృష్ణుని నోటిలోని విశ్వాన్ని చూచి యశోద భయపడి, గుమ్మడు లేడు ఊరికనే నిన్ను భయపెట్టేందుకు అన్నానని తప్పు ఒప్పుకుంటుంది. ఇదే కథ అస్సాంలో శ్రీధరకంధర రచించిన "కాన్ఖోలా" కావ్యంలో ఉంది. నేటికి పిల్లలు విసిగిస్తే తల్లులు 'బూచాడు' పట్టుకొని పోతాడని భయపెడ్తారు. ఈ బూచాడే యశోద బెదిరింపులలో గుమ్మడైనాడు.

"దేవగన్నెలు" అనే కథాగేయంలో కృష్ణుడు ఇంద్రుని కుమార్తెల చీరల నపహరిస్తాడు. "కామేశ్వరీ చరిత్ర"లో కృష్ణుడు కామెరల చీరనపహరిస్తాడు. ఆమెనే రుక్మిణిగా జన్మించి కృష్ణుని భర్తగా పొందుతుంది. "గోపెమ్మ కథ"లో కృష్ణుడు వివాహితయైన "గోపెమ్మ"ను మాయ మంత్రాలతో మోసగించి, అనుభ వించి, తర్వాత ఆమెను వదలిపెట్టి మధురకు వెళ్ళిపోతాడు. వంగసాహిత్యంలో చండీదాసు రచించిన "శ్రీకృష్ణకీర్తన్"లో కృష్ణుడు రాధను మోసంతో వశ పరచుకొని, తదుపరి ఆమెను విడచి మధురకు వెళ్ళిపోతాడు. స్త్రీల పాటలలో పారుజాత పల్లవి, శమంతకమణి పాట, భ్రమరగీతాలు, రుక్మిణి కళ్యాణం, కుచేలోపాఖ్యానం, ఉషాపరిణయం మున్నగు కథాగేయాలు మూలకథా విధేయాలు.

పురాణాలలోని అవతారకథలు, శివుడికి సంబంధించిన కథలు రకరకాల రూపాలలో జానపద సాహిత్యంలో కనిపిస్తాయి. స్థలమాహాత్మ్యాలను వివరించే గాథలుకూడా కనిపిస్తాయి.జానపద సాహిత్యం-మన తత్వశాస్త్రం,సామాజికశాస్త్రం, మానవశాస్త్రాల త్రివేణి సంగమం జానపద సాహిత్యంలోని పురాగాధలు జానపదుల జీవితాన్ని, మానవ సంబంధాలను చాటిచెప్తాయి. తెలుగునాట జానపద సాహిత్య సేకరణ, పరిశోధన బహుళంగా సాగుతున్నాయి. మరుగున పడిపోతున్న జాతి మాణిక్యాలను వెలుగులోనికి తీసుకురావటం జాతీయ సంపదను పదిలపరచటమే. సేకరించిన జానపద సాహిత్యంలో నిక్షిప్తమైన శాస్త్రాంశాలను వెలికితీయటం నేటి పరిశోధకుల, పరిశీలకుల కర్తవ్యం.

**సంప్రదించిన గ్రంథాలు**

ఋగ్వేదార్యులు - రాహుల్ సాంకృత్యాయన్
జానపద కళా సంపద - టి. దొణప్ప
జానపదగేయాలు - సాంఘికచరిత్ర - సంపాదకులు -డా॥ బి. రామరాజు
డా॥ కృష్ణకుమారి
దాక్షిణాత్య సాహిత్య సమీక్ష - డా॥ జి. నాగయ్య
నవభారత్ - మహారాష్ట్ర సత్యసాహిత్య సంచాలిత మాసపత్రిక జులై 1979.
సీత జోస్యం - నార్ల వెంకటేశ్వరరావు
Lokayata - Debi Prasad chattopadhyaya
Kanyashulkam - paper presented in the Oriental Conference at Guntur 1984 by Dr(Mrs)S.S. Pradhan
Myth and reality - D. D. Kosambi
Myths of Middle India - Verrier Elwin
Encyclopedia of Religion and Ethics
Castes and tribes in central Provinces.

# జానపదగేయాలలో కవిత్వం

—ఎస్. గంగప్ప

ఏ సాహిత్యానికైనా పునాది జానపదగేయ సాహిత్యమే. అలాగే తెలుగు సాహిత్యానికి సైతం జానపదగేయ సాహిత్యమే మూలం. అందుకే జానపదగేయ కవిత్వానికి ఒక ప్రత్యేకస్థానముంది. పద్య కవిత్వం పండితులకు మాత్రమే పరిమితం. కానీ ఈ జానపదగేయ కవిత్వం పండితులనే గాక పామర ప్రజలను పరవశింప జేస్తుంది. అంటే ఇది ప్రజాకవిత్వం, జాతికి ప్రతిబింబం. చదువు సందెలూ, అరమరికలూలేని పామర ప్రజల సాహిత్యం ఈ జానపదగేయ కవిత్వం. ప్రజల అనుభూతులకు పరమ నిదర్శనం ఈ జానపదగేయకవిత్వం. అనుభవించే ఆనందం, పొందేకష్టం,సుఖం, జీవితంలోని వలపుతలపు, వియోగ దుఃఖాలు సర్వమూ ఈ కవిత్వంలో చూడగలం. ఇవన్నీ అద్దంపట్టినట్లు జానపదకవిత్వంలో ప్రతిబింబిస్తాయి. ఆయాగేయాలు పాడుకొనేప్పుడు శ్రుతిలయలు ఉండితీరుతాయి. తమకు నచ్చిన, తమకువచ్చిన బాణీలో పాడుకొంటారు పామర ప్రజలు. కాబట్టి సంగీత సాహిత్యాలు జానపదగేయ కవిత్వంలో అవినాభావ సంబంధం కలిగి ఉంటాయి.

కానీ ఈ సాహిత్యం ఎక్కడా ప్రాచీన కాలంలో గ్రంథస్థం కాలేదు. 'ముఖేముఖే సరస్వతీ' అన్నట్లు ఒకనోటి నుంచి మరోనోటికి, మరోనోటినుంచి ఇంకో చెవికి గాలిలా స్వచ్ఛందంగా పోయివ్యాపించింది. ఎవరో కొందరు ఒకచోట కూర్చొని రచించింది కాదీ కవిత్వం. పామరప్రజల అనుభూతుల్ని అనుసరించి సెలయేరులా ప్రవహించేది. అతిప్రాచీనకాలం నుంచి ఎవరూదీన్ని భద్రపరచ ప్రయత్నించలేదు. కాగా ఆధునికయుగంలో - కాలగర్భంలో కలిసిపోయింది పోగా - పల్లెపట్టులలో అక్కడక్కడా నిలిచిఉన్న ఈ జానపద కవిత్వాన్ని సేకరించడమేగాదు, పరిశోధన ప్రారంభించారు. ఇదిశుభోదర్కమైన అంశం.

తెలుగు సాహిత్యాన్నంతటినీ పండిత సాహిత్యమూ, పామర సాహిత్యమూ అని స్థూలంగా రెండు విధాలుగా విభజించవచ్చును, దీన్నే ప్రౌఢ సాహిత్యమూ,

జానపద సాహిత్యమూ అని పేర్కొనవచ్చు. ఇంతకంటే శిష్ట సాహిత్యమూ, శిష్టే తర సాహిత్యమూనని చెప్పడం సముచితం. ఈ శిష్ట సాహిత్యంకంటే శిష్టేతర సాహిత్యమే ఆదిలో ఆవిర్భవించి వికాసం పొందింది, ఆవెనుకే శిష్ట సాహిత్యంగా రూపుదిద్దుకొంది. అనాదిగా వస్తూన్న సహజమూ, స్వాభావికమూ, నిసర్గమనో జ్ఞమూ అయిన జానపదకవితను మనపూర్వులు ఆదరించలేదు; సరికదా సంరక్షించలేదు అన్న అంశం పూర్వోక్తం. రాజాదరణకు పాత్రమైన శిష్ట సాహిత్యం తన అధికారం చలాయిస్తూవచ్చింది. అయినప్పటికీ ఈ పండిత కవిత్వం ఓపక్కా, జానపదకవిత్వం మరోపక్కా అభివృద్ధి చెందుతూనే వచ్చాయి. అయితే శిష్టేతర కవిత్వ ప్రవాహం మూడు పాయలుగా తెలుగు సాహిత్యపు మాగాణంలో ప్రవహిస్తూవచ్చింది. మొదటిది కేవలం జానపద కవిత; దానిపుట్టుక అనాది; లిఖితంకాలేదు. రెండోది పాల్కురికి సోమనాథునితో ప్రారంభమైన ద్విపద కవిత. పండితకవిత్వంగా రూపొందించాడు.

> "ఒప్పదు ద్విపద గావ్యోక్తి నా వలవ"దనీ[1]
> కూర్చెద ద్విపదలు గోర్కి దైవాఱ
> దెలుఁగుమాట లనంగవలదు; వేదముల

కొలదియకాఁజూడు"డనీ[2] —పట్టు పట్టి పండితులను ఒప్పించినట్లు తెలుస్తుంది. ఆ తరువాత ద్విపద ఒక శాఖగా శోభాయమానంగా వెలుగుతూ వచ్చింది. ఇక మూడోది తాళ్ళపాక అన్నమాచార్యులతో ఆరంభమైన సంకీర్తన కవిత. దీనికి నిబద్ధతని నిరూపించిన కవి అన్నమాచార్యులు. సంస్కృతంలో 'సంకీర్తన లక్షణం' రచించి దీనికి విశిష్టతనీ, గౌరవ ప్రతిపత్తుల్ని తీసుకొచ్చిన ఘనత అన్నమయ్యది.

ఇది ఇలా ఉండగా పద పద్య కవితల్లో పద కవిత్వమే మొట్టమొదట పుట్టిందనడం సర్వజనాంగీకృత విషయం. ప్రాక్తన మానవుడు సుఖదుఃఖాది అనుభూతుల్ని పొందినపుడు, తదనుగుణంగా ఆడిపాడుకోవడంతోనే ఈ పద కవిత పుట్టింది. ఈ అంశాన్నే R.G. Moulton పండితుడిలా వివరించాడు—

---

1. పండితారాధ్య చరిత్ర - పు. 18.
2. బసవ పురాణము - పు. 8.

"The improvised lyrical song, communal or individual, popular or artistic, is probably the simplest and most spontanions form of lyric expression......... The true song is primarily the instinctive outburst of emotion or emotional thought in language which by aptness of word rythm echoes or suggest the underlying emotion and by melody of line and harmony of stanza is adapted to such modulations of the singing voice as naturally distinguish emotional utterance...... The melody must be facile in its consonant-sequences, preferably open in the quality and varied in the musical pitch of its vowel sounds... The song is, therefore, more than any other lyric kind a musical 'cry'"[1]

"From the three possible methods of expression-singing, saying, doing - are derived the three primary kinds of poetry-song, recital and drama..."[2]

ఈ విషయాన్నే పింగళివారు ఇలా వివరించారు-

"ఈ పాడదగిన కావ్యమునకు పదమని పేరు.

"ఏ వాఙ్మయమునందైనను పదకవిత్వము పద్యకవిత్వము కంటె ముందుపుట్టి పెరుగుననుట బహుజనాంగీకృతమైన సిద్ధాంతము......

---

1. R. G. Moulton : Methods and Materials of Literary Criticism - P. 13, 14.
2. ,, : The Modern study of Literature-An Introduction to Literary theory and Interpretation- P 440.

"కాబట్టి ఆదికాలమున భావపరవశుడై పాటపాడిన ఆ ప్రాక్తన కవి, ఆడుచునే పాడెననుట శాస్త్రీయముగా నమ్మదగిన విషయము.

"ఈ ఆట-పాటలో మూడు భిన్నకళాంశములు కలవు. అడుగువేయుట, రాగముతీయుట, మాట పలుకుట శాస్త్ర పరిభాషలో ఈ మూడింటికి నృత్యము, గీతము, శబ్దము అనిపేరు...

"ఈ పదకవిత్వమున శబ్దమునకెంత ప్రాధాన్యమున్నదో గీతికకును అంతే ప్రాధాన్యమున్నది. అనగా ఇందు సుందరతర శబ్ద రచనతోపాటు, మధురమైన పాటయును కలిసియుండును."1

పదకవిత్వమే మొదటిదనీ, ఆ తరువాతే పద్యకవిత్వం వచ్చిందనీ రాళ్ళపల్లి వారి అభిప్రాయం. "మనదేశంలో చాల ప్రాత పాటలు వేదసూక్తములు. మనుష్యజాతికి అవి మొదటి రచనలు అని యూహింపవలసినవి...... నేటికిని తెలుగులో పరమ ప్రాచీనమైన పద్ధతియని చెప్పదగిన పల్లెపాటలు, కపిలెపాటలు మొదలగునవి- కొన్ని తాళనియమము లేకుండా పాడబడుచున్నవి. ఈ రాగ తాళములు రెంటిని కలిపి హృదయంగమములైన భావములను వెలువరుచు భాషను అలంకరించుటయే పదరచనకు పరిపూర్ణ స్వరూపము... సతాళముగనో, వితాళముగనో కావ్య కళారసానుభవమును ప్రాచీన మనుష్యజాతి పాట రూపముననే అనుభవించి రచించినదని పండితు లూహింతురు. మన పద్యములన్నియు పదముల పరిణామములే అని భావించుటకు పెద్ద సూక్ష్మ దృష్టి అక్కరలేదు."2

కాగా జానపదగేయాలు వాఙ్మయకోటిలో చేరుతాయా లేదా అన్న విచికిత్స ఉండనక్కరలేదు. కారణం ఏ సాహిత్యానికైనా రసానందదాయక గుణం ప్రధానమన్న విషయం అందరికీ తెలిసిందే. జానపద గేయమైనా అందులో రస

---

1. శ్రీ పింగళి లక్ష్మీకాంతం : పీఠిక-పల్నాటి వీరచరిత్ర-పు. 20-25.
2. శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ : సాహిత్యోపన్యాసములు-3 క్షేత్రయ్య పదసాహిత్యము - పు. 12, 13.

స్ఫూర్తి ఉండటంవల్ల అది సాహిత్యంగానే పరిగణించబడింది. ఇది ప్రౌఢ సాహిత్యంతో తులతూగకపోవచ్చు గాక; అయినా అందులోని గీతి ప్రాధాన్యం వల్ల ప్రౌఢ సాహిత్యంకంటే మిక్కిలి రసానందదాయకమనడంలో సందేహం లేదు. ఈ గేయ సాహిత్యంలో సంగీతంతోపాటు కవిత్వపుపాలుసైతం అధికంగా ఉంటే తప్పకుండా బంగారానికి తావి అబ్బినట్లవుతుంది. అంటే ఆ గేయాలకు కావ్యత్వం సిద్ధించిందని అర్థం. అందువల్ల ఈ గేయాలు సాహిత్యంలో చేరుతా యనడం. రసానందనిష్యంది అయిన ఈ జానపద గేయ సాహిత్యం సర్వజనా మోదకరమై - ఎలాంటి ప్రయత్నమూ లేకుండానే - విన్నవెంటనే విషయం విశదమవుతుంది.ఆనందం అనంతంగా కలుగుతుంది.అంటే 'సద్యః పరనిర్వృతి' ఇందున్నదని అర్థం. సాహిత్య ప్రయోజనాలలో'సద్యః పరనిర్వృతి'ఒకటనిగదా ఆలంకారికుల మతం! అంతేకాదు; ఆలంకారికులలో విశ్వనాథుడు చెప్పిన 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అన్నదీ, జగన్నాథ పండితరాయలు చెప్పిన 'రమణీయార్థక ప్రతిపాదకశబ్దః కావ్యమ్' అన్నది ఇక్కడ అనుసంధించడం సముచితం. అందుకే ఈ జానపద గేయాలు సాహిత్యంగా పరిగణించబడ్డాయి. ఈ సిద్ధాంతాల్ని అనుసరించి జానపద గేయాలలో ఎంతమాత్రం కవిత్వపు పాలుందో పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది.

పామర ప్రజలు ఆ యా పనులకు అనుకూలంగా పలురకాలుగా పాడు కొంటూ ఉంటారు. కర్షకులు, కష్టజీవులు పాడుకొనే గేయాలు శృంగార, వీర, కరుణాద్భుత, హాస్యాది రసప్రధానమై ఉంటాయి; వేదాంతభక్తి పరిపుష్టమై ఉంటాయి. ఈ గేయకర్తలెవరో తెలియదు. కానీ వారికృషి మనకు ఉపక రిస్తూంది. విత్తనంవేసి, చెట్లు పెంచినవారెవరోకానీ, వాటి ఫలరసాలను అనుభ విస్తూన్నవాళ్ళంమనం. ఆ అజ్ఞాతకవులకు మనమెంతగానో ఋణపడి ఉన్నాము. ఈ జానపద గేయాల్లోని కవిత్వాన్నిగూర్చి నేను సేకరించిన గేయాల్ని ఉదహ రిస్తూ వివరిస్తాను.

ఇళ్ళలోను, పంట పొలాల్లోను, ఆరుబయటా, ఉత్సవాలూ, ఊరేగింపులూ మొదలైన సందర్భాల్లోను, శ్రమను అపనయింపజేసి, ఆనందోత్సాహాల్ని వెల్లి విరియించే ఈ జానపదగేయాలు శ్రామిక సముదాయానికి వీడరాని బంధువులు. ప్రౌఢ వాఙ్మయంలోని శబ్దాడంబరంగాని, జటిల సమాస రచనా వైవిధ్యంగానీ,

శబ్దార్థాల సాముగరిడీలుగాని, కవిత్వపు కసరత్తులుగాని లేక వాడుక భాషలోని నిసర్గ మనోజ్ఞ భావపుష్టితో రసఘుమంఘుమలతో జానపద గేయ కవిత్వం సర్వజన సమ్మోదకరమై సంతుష్టిని కలిగిస్తూ ఉంటుంది.

వినీలాకాశం కింద, పొలాల్లో, మధుర కంఠ ధ్వనితో జతలు జతలుగా నాట్లు వేస్తూగాని, కలుపుతీస్తూగానీ శ్రమిస్తూ పాడే గేయాలు ఆనందోత్సాహాల్ని కలిగించడమేగాక, శ్రమను పోగొట్టడంలో ప్రాధాన్యం వహిస్తాయి. ఆ ఉత్సాహంలో కాలం సైతం ఇట్టే గడచిపోతుంది. జానపదగేయ సాహిత్యంలో రామాయణ కథకు ప్రాధాన్యముంది. ఇది ప్రజల్లో జీర్ణించుకొనిపోయింది. రామునితోపాటు సీత అరణ్యానికి వెళ్ళిన విషయం ఈ గేయంలో వర్ణించబడింది.

"ఆ దేవి కదలుతా భూదేవి కదిలా
భూదేవి కదలుతా భూదేవిపైనున్న రుక్షాలె కదిలా
రుక్షాలపైనున్న పక్షులే గదిలా"[1]

ఇందులో సీత అడవికి వెళ్ళుతూంటే, తన పుత్రిక కష్టాన్ని సహించని తల్లి భూదేవి సైతం చలించిందట! ప్రకృతి, ప్రకృతిలోని ప్రతి ప్రాణి సీతాదేవి కష్టానికి చలించిపోయిందని గేయకవి హృదయం. ఇది కవిత్వం కాదనగలమా !

ఇట్లే సీతారాములు అరణ్యంలో ఉండగా, మారీచుడు మాయలేడి వేషంలో వచ్చిన సందర్భంలోని గేయంలోను కవిత ఉంది. మాయా మృగాన్ని రాముడు బాణ ప్రయోగం చేసి చంపినప్పుడు-

"ఏసెనే రామస్వామి ఎండమ్ము తోనా
కూలెనే ఆమెకము కుమ్మరామాలా
సోలెనే ఆమెకము సొప్పకట్టాలా"[2]

ఇందులో ఔపమ్యం సహృదయ హృదయ రంజకం. రాముని అమ్ము దెబ్బతిన్న ఆ జింక 'కుమ్మరామాలా' కూలిపోయిందట! 'చొప్పకాట్టాలా' సోలి

1. డా॥ ఎన్ గంగప్ప (సేకరణ): జానపదగేయ రామాయణం - పు. 4, 5
2 పైదే. పుటలు 13,14,17

పోయిందట! ఈ ఉపమానాలు పామర ప్రజల స్వభావానుగుణమై ఒప్పుతున్నాయి. మాయ జింక మరణ సమయంలో అరచిన అరపును విని శ్రీరాముడే మరణించి నట్లు భావించి, భయభ్రాంత అయి, దుఃఖితమతి అయి అన్నకు సాయంగా వెళ్ళ మని లక్ష్మణుని పురమాయించినప్పుడు లక్ష్మణుడు సీతతో-

"అడవిలో మాయన్న కతిభారమైతే
చుక్కలూ జలజలన రాలు నోయమ్మ
సూర్యుడూ చంద్రుడూ కముదప్పుదు రమ్మ
పగలెన్నెలు గాసు పసులింటికి వచ్చు."1

నని సమాధానమిస్తాడు.

ఇట్లే రామలక్ష్మణులు పర్ణశాలకు వచ్చి చూడగా సీత కనిపించదు. అప్పుడు -

"చిలుకలు కోగిలలు చిన్నపోయినవి
హంసలు నమిళ్ళు ఆట మరచినాయి"2

అంటాడు. జానపద గేయకవి ఎంతో లలితంగా. ఇందులోని కవి హృదయం సుస్పష్టమవుతుంది.

ఇంద్రజిత్తు, లక్ష్మణుల యుద్ధం జానపదగేయ కవి మనోజ్ఞంగా, స్వాభావి కంగా వర్ణించాడు.

"మేఘాల మరుగున ఆ యింద్రజిత్తుడూ అగ్గిబాణము తొడిగెనో
లక్ష్మన్నని యేటి ఆదారి తెలుసుకొని నీళ్ళబాణము తొడిగెనో
మేఘాల మరుగున ఆ యింద్రజిత్తుడూ నాగబాణము తొడిగెనో
లక్ష్మన్నని యేటి ఆదారి తెలుసుకొని గరుడబాణము తొడిగెనో

1,2. పైదే. పుటలు 13,14,17

మేఘాల మరుగున ఆ యింద్రజిత్తుడు తేళ్ళు బాణము తొడిగెనో
లక్ష్మన్నని యేటి ఆదారి తెలిసికొని కోళ్ళబాణము తొడిగెనో"[1]

ఇలాగా ఇంద్రజిత్తూ,లక్ష్మణుడూ ఆగ్నేయవారుణాస్త్రాలు,నాగగరుడాస్త్రాలూ ప్రయోగించడం ప్రసిద్ధమే, వాటినే గేయకవి అగ్గి, నీళ్ళు, నాగ, గరుడ బాణాలని పేర్కొన్నాడు. ఇట్టే పరస్పర విరుద్ధాలూ, జానపద సహజాలూ అయిన తేళ్ళు, కోళ్ళు బాణాలుగా ప్రయుక్తమైనట్లు జానపద గేయకవి చెప్పడం ఎంతో సహజ సుందరంగా ఉంది. ఇది జానపద గేయకవి ప్రతిభకు నిదర్శనం !

మూర్ఛితుడైన లక్ష్మణుని ఉద్దేశించి శ్రీరాముడు విలపించడం కరుణ రసోదంచితంగా ఉంది.

"దినదినమునా నాముదిద్దినట్లే వుంది దీయరత్నము తమ్ముడా !
అనుదినము నీ నాము అమరినట్లే వుంది అతియచక్కని తమ్ముడా !
ఎద్దుకొమ్ములావోలె ఇద్దరే వుంటిమీ ఒంటిగాణ్ణి అయిపోతినో"[2]

ఇక్కడ రామలక్ష్మణుల విడదీయరాని భ్రాతృప్రేమ బంధాన్ని వ్యక్తం చేయడానికే ఇలాంటి గ్రామీణ వాతావరణానికి తగిన పలుకుబళ్ళు, సామెతలూ ప్రయోగించడం జరిగింది.

లక్ష్మణమూర్ఛతో శ్రీరాముడు దుఃఖిస్తాడు. ఆ శోకాన్ని జానపద కవి ఇలా వర్ణిస్తాడు.

"రంగైన ముత్యాల సేరు తెగినట్లు రాలెకన్నుల ఉదకమూ
చక్కనీ తిరమనీ ముత్యంపు కన్నీరు ముక్కంటి దిగజారెనో"[3]

అని జానపదకవి మనోజ్ఞంగా ప్రతిభా సమున్మేషంగా ఉపమాలంకారం ప్రయోగించడం గమనించవచ్చు. ఇలాంటి ఆలంకారిక రచనలోను జానపద కవిత్వం పద్య కవిత్వంతో తీసిపోదనిపిస్తుంది.

---

1, 2. పైదే. పు. 24, 25
3. పైదే పు. 26

ఇట్లే విసర్రాతి పాటల్లోను కవిత్వముంది. నాట్లు వేసేటప్పుడు, కలుపు తీతల సమయంలోనూ విసర్రాయి విసిరేటప్పుడూ స్త్రీలదే పైచేయి. కాబట్టి గేయ కవులతోపాటు జానపద గేయ కవయిత్రులు సైతం ఉన్నారని స్పష్టమవుతుంది. అత్త ఆరడి పడలేని కోడలు—

"అత్తమ్మ నీచేతి ఆరీడికన్నా
అడవిలోనా సింపన్న మానైనచాలూ
కూచోనే అన్నలకు నీడైనచాలూ"[1]

అని అంటుంది.

మరో గేయంలో ఏదో కారణాన కోపగృహం చేరిన భార్యను భర్త బుజ్జగిస్తూ "పచ్చి పసుపుగొమ్మా బంగారి బొమ్మ"[2] అనడంలో ఔపమ్యం మనోహరం. ఇది జానపద గేయకవి ప్రతిభకు నిదర్శనం. ఇలాంటి పట్టులు జానపద గేయ కవిత్వంలో తళుక్కున మెరిసి సహృదయ హృదయాలను రంజింపజేస్తాయి.

విసర్రాతిని విసరడం ముగిస్తూ పాడేపాట—

"ముత్యాలు తెచ్చుండా వెయ్యి గౌరమ్మా
ముత్యాలు గాదమ్మా ముగ్గుజొన్నల్లో
పగడాలు తెచ్చుండా వెయ్యి గౌరమ్మా
పగడాలు గాదమ్మా పాతరాగుల్లో"[3]

అని చెప్పడం సహజమూ, నిసర్గమనోజ్ఞమూ నని చెప్పడంలో అత్యుక్తిలేదు. జొన్నల్ని ముత్యాలతోను, రాగుల్నిపగడాలతోను పోల్చడం గ్రామీణులకు సహజ విషయం.

---

1, 2. నా వ్యాసం: జానపద సాహిత్య సంపద - విసుర్రాతి పాటలు - భారతి, డిశంబరు, 1970.

3. పైదే.

పల్లెపట్టులలో 'కపిలి' ప్రాధాన్యం వహిస్తూ ఉండేది ఒకనాడు. ఈనాడు, విద్యుత్తు, ఆయిల్ ఇంజన్లు వచ్చాక దానితో పనిలేకుండా పోయింది. కొన్ని ప్రాంతాల్లో 'కపిలి'నే 'మోట' అంటారు. ఈ కపిలి పాటల్లో రసరాట్టయిన శృంగారానికి ప్రాముఖ్యం ఎక్కువ.

"వస్తా పోతా ఉన్నా చాలు వాకిట్లో నిలబడినా చాలూ
నీ నీలంపు గాజుల చెయ్యి నీలాలు పారినా చాలూ"[1]

అని ఒక నాయకుడు తన ప్రేయసిని ఉద్దేశించి తన హృద్గతాభిప్రాయాన్ని స్పష్టం చేస్తున్నాడు.

మరో మనోహరమైన ఔపమ్యం ఇక్కడ ఉదాహరించడం ఎంతైనా అవసరం.

"కందిరీగ నడుముదానా కాసులోల్ల చిన్నదానా
అద్దమంతా నీది మొగము ఎద్దులింటా పొలుగు తగిలో"[2]

అనే ఈ గేయంలో సహజ సుందరమైన కవిత ఉంది. 'కందిరీగ నడుముదానా' అన్నాడు గేయకవి. ఈ ఉపమానం సహజమూ, సుందరమూ అయి హృదయరంజకంగా ఉంది. "అస్తి నాస్తి విచికిత్సా హేతు శాతోదరి" అనీ, "సదసత్సంశయ గోచరోదరీ" అనీ రచించిన శ్రీనాథుని సమాస భూయిష్ఠ రచన కంటే ఇది జానపద సహజంగా ఉండి, పామర ప్రజా సముదాయానికే గాక పండితులకు సైతం ఆనందాపాదిగా ఉంది. ప్రజల భాషలో గ్రామీణ జన సహజరీతిని స్త్రీ నడుం కందురీగ నడుంతో పోల్చడం జరిగింది. మరిఇంతకంటే కవిత్వముంటుందా? ఈ గేయకవిత్వం చిరస్థాయిగా సాహిత్యంలో నిలుస్తుందనే భావిస్తున్నాను.

కపిల పాటల్లో మోహశృంగారానికి ఉదాహరణలు కోకొల్లలు. కానీ విప్రలంభ శృంగారం సైతముంది.

---

1, 2. నావ్యాసం. జానపద సాహిత్య సంపద - కపిలి పాటలు : ఆంధ్రపత్రిక - ఆనంద సంవత్సరాది సంచిక 1974-75

"నీళ్ళకంటానేను ఒక్క స్త్రీనిన్ను జూదావస్తి గదరా!
నీళ్ళ రేవులో నీవులేవూ కంటినీరే కడవనిండో"[1]

నాయకుని ఎడబాటుతో దుఃఖం కలిగింది నాయికకు. శోకం వల్ల కన్నీరు, కన్నీటితో కడవనిండిపోయిందట! ఆమె కరుణరస రంజితభావం సహృదయ రంజకంగా ఉంది. ఇది సహజమూ, నిసర్గమనోజ్ఞమూ అయిన కవిత.

ఇంతవరకు ఉదాహరించిన గేయాలన్నీ చాలావరకు పనిపాటల్లోని శ్రమను అపనయించుకోడానికి ఉత్సాహంతో పాడేవే. కానీకేవలం ఉత్సాహంకోసం పాడే గేయాలూ ఉన్నాయి. అలాంటి వాటిలో కోలాట పాటలు ఒకరకం. కోలాటగాళ్ళు కాళ్ళకు కట్టుకొన్న గజ్జెల సవ్వడి శ్రుతికాగా, కోలాట శబ్దాలు తాళం కాగా, కంఠమెత్తి కోలన్న పాట పాడుతూ, ఉత్సాహంతో ఆడుతూంటే అమాయకమైన, అనురాగపూర్ణమైన హృదయాలు గల వాళ్ళ ఆటను చూడవలసిందేగాని చెప్ప వీలు కాదు. ఈ గేయాలు అనేక రకాలున్నాయి. కొన్నింట చతురోక్తులు, ధ్వని, వ్యంగ్యమూ, సంకేతమూ మొదలైన లక్షణాలు సైతం గోచరిస్తాయి. అందుకీ పాట చక్కటి ఉదాహరణ.

నాయికానాయకుల సంభాషణ :

"అంతరంగానాగుదోటా ఆకుతోటలో నిమ్మతోటా
నిమ్మతోటలో బొమ్మలాటారా ఓ రెరికిలీ!
నిమ్మతోటలో బొమ్మలాటరా ॥అంతరంగాన॥
ఇప్పుడుంటి వింటిలోనా కొప్పులో పూలెక్కడివే?
పొందులో జాలారి కొమ్మారా ఓ రెరికిలీ
కొమ్ము జడిసి కొప్పునిండేరా ॥ అంతరంగాన ॥
కల్ల మింద కాకిపిల్లా నాపేరు నాగి పిల్లా
చేతిలోని దేగపిల్లేరా! ఓ రెరికలీ!
చేతిలోని దేగపిల్లేరా ॥ అంతరంగాన ॥"[2]

---

1. పైదే.
2. నా వ్యాసం : జానపద సాహిత్యసంపద - కోలాట పాటలు-భారతి మార్చి 1971.

ఇందులో 'అంతరంగాన' అన్నప్పుడు ధ్వనీ, 'కొమ్మ జడిసి కొప్పు నిండిందన్నప్పుడు వ్యంగ్యం, కల్లమీద కాకిపిల్ల నాపేరు నాగిపిల్లా' అన్నప్పుడు సంకేతమూ స్పష్టమవుతున్నాయి. ఆ నాగిపిల్ల చేతిలోని దేగపిల్లట! ఇంత నాజూకుగా, సొగసుగా, సహృదయ రంజకంగా కవిత్వం చెప్పడం జానపద గేయకవికి సాధ్యమైందంటే మెచ్చుకోదగిన అంశం. పాండిత్య ప్రకర్షా, ఛందో జ్ఞానంలేని పామరుని నోటినుంచి, అలవోకగా వెలువడిన ఈ గేయాలు కవిత్వ మాధుర్యానికి అవధులనడం సముచితం.

ఇలాంటి నిసర్గ మనోజ్ఞమైన కవితా పాటవంతో జాతీయతను ప్రకటించే తెలుగు పలుకుబళ్ళతో ఒప్పారు జానపదగేయాలు లెక్కకు మిక్కిలిగా కాల గర్భంలో కలసిపోయాయి. ఇంకా అక్కడక్కడా పల్లె ప్రజల నాలుకలపై నర్తి స్తూన్న జానపద గేయాల్ని సేకరించి, రసగ్రహణ పారీణులైన పాఠకలోకానికి అందిచ్చి తద్వారా సాహిత్యసేవ చేసినప్పుడు అజ్ఞాతకవుల ఋణం నుంచి మనం కొంతవరకైనా విముక్తిపొందగలమని విశ్వసిస్తున్నాను !

# 'జానపద సాహిత్యంలో ఆచారాలు–నమ్మకాలు'

—నాయని కోటేశ్వరి

నమ్మకాలు మానవుని పుట్టుకతోపాటు ఏర్పడ్డాయి. నమ్మకం మంచి చెడ్డలు రెండింటికి సంబంధించినది. ఒకరికి మంచిదైన నమ్మకం ఇంకొకరికి చెడ్డది కావచ్చు.

Mair యీ నమ్మకాన్ని ఈ విధంగా నిర్వచించాడు—

"Belief is the mental state of assurance or conviction,the attitude of a mind towards its own experiences in which it accepts and endorses them, as referring to reality, as hearing real significances or value"- అట్లే Bagcho "emotion of conviction" గా నమ్మకాన్ని పరిగణించాడు. దీన్నిబట్టి మానసిక అనుభవాల పరిణామమే నమ్మకం అని చెప్పవచ్చు. మానసిక అనుభవాల పరిణామంగా జనుల్లో ఏర్పడి అనేకులచే అంగీకరింపబడిన విశ్వాసమే నమ్మకం.

మానవుని పుట్టుకతోనే నమ్మకం పుట్టినా మానవుడు సంఘంగా ఏర్పడిన తరువాత నమ్మకాలకు స్థిరత్వం కలిగింది. భావవ్యక్తీకరణకు బాషయేర్పడిన తరువాత ఈ నమ్మకాలు ఒక మనిషినుంచి ఇంకొక మనిషికి సంక్రమించాయి.

ఆచారం నమ్మకంగా మారుతుంది, అలాగే నమ్మకం ఆచారంగా మారుతుంది. ఆచారానికి హేతువు చెప్పలేనప్పుడు హేతువును కల్పించుకుంటాడు మానవుడు. అదే నమ్మకంగా ఏర్పడుతుంది. "మధుకైటభుల మెదడువల్ల భూమి ఏర్పడింది" అనడం ఊహ. మెదడు భూమిగా మారిందికాబట్టి మట్టి తినకూడదు అనడం కల్పన. ఈ కల్పన నమ్మకంగా మారింది.

అలాగే ఇంటిముందు ముగ్గు వెయ్యడం అనేది ఆచారం. ఈ ఆచారమే నమ్మకంగా మారింది. నీళ్ళు చల్లగానే ముగ్గు వెయ్యకుండా ఉండవద్దు అలా చేస్తే లక్ష్మి రాదు అనే నమ్మకం ఏర్పడింది. ఇంటిముందు ముగ్గు వేస్తే దుష్టశక్తులు ఇంట్లోకి రావనే నమ్మకంకూడా ఉంది. "కతికితే అతకదు" అనేది నమ్మకం. కాని అది ఆచరణలో పెట్టడంచేత ఆచారమయింది. ఈ నమ్మకాలు వంశ పారం పర్యంగా వచ్చినవికొన్ని అనుభవపూర్వకంగా ఏర్పడినవికొన్ని. దేవుడున్నాడని నమ్మి పూజలు పురస్కారాలు చెయ్యడం పరంపరగా వచ్చిన నమ్మకమయితే, శకునాలు అనుభవపూర్వకంగా వచ్చిన నమ్మకాలు.

ఈ నమ్మకాలు గుడ్డిగా విశ్వసించడంచేత మూఢ నమ్మకాలుగామారాయి. జీవిత సౌఖ్యానికి, సమాజానికి అపకారం చేసేవి మూఢనమ్మకాలు. ఋజువుకాని నమ్మకాలు మూఢనమ్మకాలు. పరలోకాన్ని మనం చూడలేదు, ఉందని చెప్పినా, విన్నా, చదివినా అంతా నిరాధారమే. దీనికి సంబంధించిన నమ్మకాలన్నీ మూఢ నమ్మకాలే.

నమ్మకాలను వైజ్ఞానికాలు, అవైజ్ఞానికాలు అని స్థూలంగా విభజింపవచ్చు. హేతుబద్ధంగా ఏర్పడ్డవి వైజ్ఞానికాలు. హేతుబద్ధం కానివి అవైజ్ఞానికాలు. నమ్మకం వెనుక శాస్త్రీయమైన దృష్టి ఉంటే అది వైజ్ఞానికం.

ఆరోగ్యం దృష్ట్యా కట్టివిడిచిన గుడ్డ కట్టడం, ఆడ మిగిలిన జలకాలు ఆడడం మంచిది కాదు. ఇంటిముంగిలి అలికి ముగ్గువేస్తే క్రిమికీటకాదులు రావు. అలాగే గడపకు పసుపుకుంకుమలు పెట్టడం, భోంచేసేటప్పుడు విస్తరిచుట్టూ నీళ్ళు పొయ్యడం మొదలైనవి.

ధర్మరాజు జూదంలో -

'అలికి విడచిన గడప దాటడే రాజు
దివ్వెలేని గృహము చూడడే రాజు
యింట ముగ్గులేక నడవడే రాజు
ఆడ మిగిలిన జలకమాడడే రాజు
కట్టివిడిచిన వస్త్రము కట్టడే రాజు"

అంటూ ధర్మరాజు ఇలాంటివాడు గనకనే నేను అతన్ని విడువనంటుంది లక్ష్మీదేవి.

మన నమ్మకాలు శాసనాలకు కూడా వ్యాపించాయి. దానాన్ని పాడుచేసిన వాడు పంచమహాపాతకాలకు లోనవుతాడని, కాశిలో గోవును చంపిన పాపాన పోతాడని, శాసనాలలో చెప్పడం మనలోఉన్న నమ్మకాల ఆధారంగా మననుభయ పెట్టడానికే. చట్టానికి భయపడనివాడు కూడా విశ్వాసానికి భయపడతాడనీ చట్టం కంటే విశ్వాసమే బలీయమైనదనీ ఇది ఋజువుచేస్తుంది.

ప్రజానీకంలో పరంపరగా ఏర్పడిన నమ్మకాలు మన సాహిత్యంలో భారతం నుంచి అన్ని కావ్యాలలో ఏదో ఒక విధంగా వ్యక్తమౌతూనే ఉన్నాయి.

భారతంలో -

"గువ్వ గద్దదివ్వారువుబ్రువ్వగూబ
యిల్లు సొచ్చిన శాంతిసేయింపవలయు"

అని ఉంది.

రక్ష కోసం తాయెత్తులు కట్టుకోవడం, ముహూర్తాలు, శకునాలు తెలుగు కావ్యాలలో కోకొల్లలు. భూమిలో పాతిపెట్టిన ధనాన్ని తీసుకోవడానికి భూతృప్తి చెయ్యాలనే నమ్మకం సింహాసన ద్వాత్రింశికలో కనిపిస్తుంది.

ఆ.వె. "... ఎట్టివారి సొమ్మోయిది
పెద్దకాలమయ్యె బృధివి నణగి
దీని వెడలదివియబూనిన యప్పుడు
భూతతృప్తి వలయు భూతలేంద్ర!"

భూస్థాపితమైన విక్రమార్కుని సింహాసనాన్ని తీయడానికి గొఱ్ఱెలను బలి ఇచ్చాడు భోజుడు.

కోడిపిల్లలు బెలువుకట్ట భద్రంగా వుండాలంటే బలి ఇవ్వాలనే నమ్మకం ప్రజల్లో ఉంది. దీనికి తార్కాణం కట్టమంచి రామలింగారెడ్డి గారి "ముసలమ్మ మరణం." జానపద సాహిత్యంలో కట్ట మైసమ్మకు, కోట మైసమ్మకు, ఊది మైసమ్మకు, ఉప్పలి మైసమ్మకు బలి ఇచ్చే విధానం కనిపిస్తుంది.

ప్రాచీన సాహిత్యం జనంనోళ్ళ కెక్కిన తరువాత వారి నమ్మకాలు, ఆచార వ్యవహారాలు అందులో చోటుచేసు కుంటాయి. సాహిత్యాన్ని జానపదమనీ, పండిత సాహిత్యమనీ మనం విభాగం చేసినా జానపద సాహిత్యంలో చోటుచేసు కున్న జానపదుల నమ్మకాలు అంతటితో ఆగిపోక పండితసాహిత్యంలోకీ ఎక్కాయి. వాల్మీకి రామాయణానికీ రంగనాథరామాయణానికీ ఉన్న తేడాలు పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమౌతుంది. వాల్మీకి రామాయణంలో ఉదాత్తమానవు డైన రాముడు రంగనాథ రామాయణంలో దేవుడయ్యాడు. అతని కార్యాలు అద్భుతాలయ్యాయి.

వాల్మీకి రామాయణంలో—

"ఆరోపయిత్వా ధర్మాత్మా పూరయామాస తద్ధనుః
తద్బభంజధనుర్మధ్యే నర శ్రేష్ఠో మహాయశాః"

అని ఉంటే, రంగనాథ రామాయణంలో రాముడు విల్లెక్కు పెట్టేటప్పుడు కౌశికుడు—

"అదరకు భూదేవి యాత్మలో నీవు
బెదరి చలింపకు శేషాహి నీవు
కదక ధరింపుము కమఠేంద్ర నీవు
కడునేమరకుడు దిక్కరులారమీర" లని యిని పల్కగ—

రాముడు విల్లెక్కుపెట్టి విరిచాడు. మానవాతీతమైన రాముడు చేసిన కారణంగా తప్పకుండా అద్భుతంగా ఉంటుందనే నమ్మకం ఈ ఘట్టాన్ని అద్భుతంగా వర్ణించడానికి కారణమైంది.

సృష్టికి మరణానికి సంబంధించిన నమ్మకాలు, భూమి ఆకాశం ఏర్పడ డాన్ని గురించిన అనేక కల్పనలు పురాణాలలో ఆటవిక జాతుల కథల్లో చోటు చేసుకున్నాయి. ఆదిశక్తి పెట్టిన గుడ్డు పగిలి పైపెంకు ఆకాశం, కింపెపెంకు భూమిగా మారి అందులోనుంచి త్రిమూర్తులు పుట్టుకొచ్చారని పురాణాలలో ఉంది. అలాగే ప్రపంచమంతా జలమయంగా ఉండగా ఒక గుడ్డు ఆ జలంపై తేలుతూ ఉంది. ఆ గుడ్డే ప్రకాశమానుడైన 'రా', అతని కన్నులనుండే మానవులు జన్మించారు అని ఈజిప్టు దేశపు గాథలో ఉంది.

సవరల పురాణ గాథలో నీటిమీద తేలుతున్న సొరకాయ పగిలి పైచెక్క ఆకాశం, కిందిచెక్క భూమిగామారింది. అందులోనుంచి స్త్రీ పురుషులు పుట్టి ఆదిదంపతులయ్యారు.

Maori గాథలలో ఆకాశం, భూమి మానవుల పుట్టుకకు కారణం. ఆకాశం భూమి దగ్గరగా ఉండేవి. ఆకాశం తండ్రి, భూమి తల్లి. వీళ్ళ పిల్లలు చీకటికి వెలుగుకు తేడా తెలుసుకోవాలనుకున్నారు. ఆకాశాన్ని భూమిని వేరు చెయ్యాలనుకున్నారు. ఎంతో ప్రయాసపడి చివరకు సఫలీకృతులయ్యారు. వియోగం చెందిన భార్యయైన భూమి ప్రేమనిట్టూర్పులను భర్త ఆకాశం వైపు నిగుడుస్తుంది. అవే పర్వతశిఖరాగ్రాల నుంచి వీచే మంచుతెరలు. భర్త కన్నీరు కిందికి భార్యవైపు పడుతుంది. అవి మంచు బిందువులు. ప్రపంచంలో పూర్తిగా విభిన్నదశలలో పుట్టినప్పటికీ ఈ కథలలో, నమ్మకాలలో స్పష్టమైన పోలికలను గమనించవచ్చు.

సూక్ష్మంగా నమ్మకాలను ఈ క్రింది విధంగా విభజింపవచ్చు.

I మతపరమైన నమ్మకాలు.

II సంఘ పరమైన నమ్మకాలు.

a. కౌటుంబికాలు.

b. సమాజ పరమైనవి.

c. రాజకీయ పరమైనవి.

d. ధర్మపరమైనవి.

## I. మతపరమైన నమ్మకాలు :-

మానవుడి నమ్మకమే మతంగా మారింది. నేటి జానపదుల నమ్మకాలు అత్యంత ప్రాచీనకాలం నుంచీ ఒక తరం నుంచి ఇంకొకతరానికి సంక్రమించడం ద్వారా వచ్చినవి. ఆదికాలం నుంచి పరిశీలిస్తే మంత్రప్రసక్తి లేని మానవ సంఘం లేదు. మతానికి మానవసంఘానికి ఇంత సామీప్యం ఉండడానికి కారణం, తన అపజయానికి తానుకాక మరెవరోకారణమని నమ్మడం, ఇదేకర్మ సిద్ధాంతం. పుట్టుకనుంచి చావువరకు అవలంబించే ఆచారాలన్నింటి వెనుకా మతం ప్రాముఖ్యత వహిస్తుంది. వ్యవసాయానికి సంబంధించిన పనుల్లో వేటకు సంబంధించిన క్రియల్లో పశువులకాపరులకుగాని, జాలరులకు గానీ, కుమ్మరులకుగానీ, కమ్మరులకుగానీ వారి వృత్తులకు సంబంధించిన పనులవెనుక మతమే స్పష్టంగా కనిపిస్తుంది. అందువల్లనే సాంఘికాలయిన నమ్మకాలూ ఆచారాలు మనుషుల్లో పాతుకు పోయాయి.

### 1. ప్రకృత్యారాధన (Nature worship) :

ప్రకృతిలో భయంకర దృశ్యాలు ఆదిమానవుని ఆందోళనకు కారణ మయ్యాయి. ఎండలు కాయడం, వానలుకురవడం, పిడుగులు పడడం, సుడి గాలి వీయడం, వరదలురావడం, భూమికంపించడం, అగ్ని ప్రమాదాలు సంభవించడం వీటిని చూచి ఆదిమానవుడు భయాందోళనను, ఆశ్చర్యాన్ని పొందాడు. తన భౌతిక అవసరాలకోసం కొన్ని నమ్మకాలను సృష్టించుకున్నాడు. తద్వారా ప్రకృత్యారాధన మానవాతీతశక్తులపై విశ్వాసం ప్రారంభమై ఇంకా కొన్ని నమ్మకాలు పుట్టడానికి కారణమయ్యాయి. ఈ నమ్మకంవల్లనే చెట్టు, గుట్ట, నీరు, నిప్పు పూజనీయమయ్యాయి. యజ్ఞయాగాదులు ప్రబలాయి.

గంగజాతరలు చెయ్యడం, వేపచెట్టు రావిచెట్లను లక్ష్మీనారాయణులుగా భావించి పూజించడం, పుట్టలను వేపచెట్లను ఎల్లమ్మదేవతకు ప్రతీకలుగా భావించి పూజించడం మొదలైన నమ్మకాలన్నీ ప్రకృత్యారాధన వలన ఏర్పడినవే.

### 2. ఆత్మారాధన (Animism) :

మరణించినవాని ఆత్మ ఏ చెట్టునో పుట్టనో ఆశ్రయించి వుంటుందనే నమ్మకంవల్ల ఆత్మారాధన ప్రబలింది. ఆత్మ గాలిలో తిరుగుతూ పూర్వ జీవితం

మీద, తాను నివసించిన పరిసరాల మీద మోజుచూపుతుం దనే నమ్మకం ప్రాచీన మానవునకుంది. ఆత్మకు భయపడిన మానవుడు ఆత్మను పూజించడం మొదలు పెట్టాడు. ఆత్మకు సంబంధించిన విషయాలు జానపద గేయగాథలలో విరివిగా ఉన్నవి.

మండపేట పాపమ్మ కథలో పాపమ్మ భర్తతో సహగమనంచేసి ఆ రాత్రి పాము రూపంలో పెదతండ్రి కలలో కొచ్చి —

"ఇంకేటి నిద్రలేవరా బాబూ
మీ యల్లుడై తేను చెల్లిపోయినాడూ
బాబయ్య గుండముననే బడ్డనయ్యా
బాబయ్య నా కొఱకు దుఃఖింపవలదూ
పోలేరమ్మ చెఱువువద్ద బాబూ
పన్నెండుకలుగులా పుట్టవున్న దయ్యా
పామునై నీ ముందు నడిచేను బాబయ్య
నావెనుక నీవురా నను గన్నతండ్రీ
ఆ పుట్టలోనికీ నేబోతనయ్యా
ఆ పుట్టమీదనే పందిర్లువేయించి
ఆ పుట్టనే మీరు పూజచేయండీ"
అని శాసించింది.

బాలనాగమ్మకథలో సవతితల్లి మాణిక్యాలదేవి ఏడుగురు బాలలను అష్ట కష్టాలు పెట్టింది. ఆ కష్టాలనుంచి వారిని కాపాడి, తల్లి భూలక్ష్మీదేవి ఆత్మనవా భోజరాజు కలలోకొచ్చి -

"లేవరయ్య లేవరయ్య నవా భోజరాజా
నీకు కడు ఏడు బాలల నప్పగించితేను
బాలలను అడవిపాలు జేసినావా"

అని హెచ్చరించింది. వ్యక్తి మరణించినా ఆత్మకు కోపతాపాలు చావవు. తనవారంటేప్రీతి తన శత్రువులపై కోపం కలిగివుంటుంది.

సన్యాసమ్మ కథలో సన్యాసమ్మ సహగమనం చెయ్యగానే, ఏడు ఘడియలకు సవతితల్లి కళ్ళు పేలి పోతాయి. అత్త బాలమ్మ శిరస్సు పగిలింది, బావ రామయ్య కుష్ఠురోగియై దేశాలుపట్టి పోయాడు, పెద్దక్క సుబ్బమ్మ 'వేశ్యకారి' అయింది.

ఈజిప్షియన్లు ఆత్మను తృప్తిపరచడం కోసం మమ్మీలకు సకల పదార్థాలను సమకూర్చి వాటితోపాటు వారి భార్యలను దాసదాసీలను కూడా సజీవ సమాధి చేసేవారు. ఆత్మ తిరిగి శరీరంలో ప్రవేశిస్తుందని వారి గాఢవిశ్వాసం.

ఆత్మకు సంబంధించిన విషయాలు కామమ్మ, లక్ష్మమ్మ, నల్లతంగాళ్ కథలలో ఉన్నవి.

### 3. పిశాచారాధన (Fetishism) :

ఆత్మ పిశాచ లక్షణాలను కలిగి పూర్వ జీవితంలో ఇష్టులను శత్రువులను ఆశ్రయించి వారి మరణానికి కారణమై వారిని తమ లోకానికి తీసుకొని పోతుందనే నమ్మకం మానవునిలో కలిగింది. ఆత్మ చనిపోయిన పూర్వీకులదైనప్పుడు దాని ఆరాధన పితృదేవతారాధనగా మారింది. ఆత్మకు పూర్వీకుల సంబంధం లేకుండా కేవలం అది మానుషమనే భావం కలిగినప్పుడు అది పిశాచారాధనగా మారింది.

కామిని, మోహిని వంటి దయ్యాలు శాకినీ ఢాకినీ వంటి పిశాచాలు, భేతాళుడు, భైరవుడు మొదలైన ఉగ్రశక్తులు పిశాచారాధనలో చోటు చేసుకున్నాయి. రాను రాను ఈ శక్తులన్నీ దైవీమూర్తులుగా మారాయి. శాకిని ఢాకినులు దేవి పరిచారికలు కాగా, భేతాళుడు శివగణంలోనివాడయ్యాడు. భైరవుడు శివుడు, భైరవి పార్వతి అయ్యారు. ఈ పిశాచ భావననుండే రాక్షసులు కూడా ఉద్భవించారు.

ఆత్మలను, పిశాచాలను, రాక్షసులను లొంగదీసుకోవడానికి మంత్ర చర్య, తాంత్రికత అవసరమయ్యాయి. వీటిని నేర్చుకొని మానవుడు దుష్టశక్తులను లొంగదీసుకోవచ్చని నమ్మాడు పూర్వం యజ్ఞాలు చేసే ఋత్విజులు దుష్ట

శక్తులు యజ్ఞ వాటికను చొరకుండా మంత్రశక్తితో ఆవరణకు రక్షణ కల్పించే వారు. తరువాత భూతబలి ఇచ్చి దుష్టశక్తులకు తృప్తి కలిగించి శోభన దేవతలను ఆహ్వానించి యజ్ఞాన్ని నిర్విఘ్నంగా చేసేవారు. ఒకవేళ రక్షావరణాన్ని దుష్ట శక్తులు దాటే పరిస్థితి ఏర్పడితే మారణకర్మం చేసేవారు.

గాంధారి కథలో గాంధారి అయ్యవారి మంత్రాల పుస్తకాన్ని దొంగిలించి అందులోవున్న మంత్రాలను నేర్చుకొని పిశాచరాజగు భేతాళుని లొంగదీసు కొన్నది. ఆ పుస్తకంలో—

"శక్తి పంపు, శాంభవి పంపు, హనుమంతు పంపు, వీరభద్ర పంపు, భేతాళ పంపు, భైరవ పంపు, శక్తిముగ్గు, భేతాళముగ్గు, భైరవిముగ్గు" లున్నవి. "ఇవి అన్ని చూస్తానే మంత్రాలన్ని ఆకళింపు చేసుకొనెను."

కమ్మవారి పణతిలో 'పణతి' భేతాళుని లొంగదీసుకొని అతని సాయంతో బాలరాజును వివాహమాడింది.

చేతబడి మంత్రతంత్రాలతో కట్టు వెయ్యడం మానవాతీతాలకు సంబధించిన నమ్మకాలే. పల్నాటి వీర చరిత్రలో మొదటి పందెంలో ఓడిపోయిన నాగమ్మ దయ్యాల మల్లడు అనే కట్టు బోయను పిలిచి బ్రహ్మనాయని కోడికి మంత్రం పెట్టించింది. దయ్యాలమల్లడు ''వాకట్టు, మరకట్టు, వణకెడుకట్టు, పొట్టపొంగెడు కట్టు, పొంగులకట్టు, ఎండిపోయెడికట్టు, ఎగిరెడికట్టు, కాళ్ళ చేతులు కదలనికట్టు, ప్రాణంబులు పోయెడి బలువైనకట్టు" నేర్చినవాడు.

బ్రహ్మనాయుడు త్రిపురాంతకం నుండి "భూతరాట్కంబము"ను తర లించుకొని పోయేటప్పుడు

......................బండ్లపైకెత్తి
పంచెవన్నెలకూడుపై బారదివిచి"

కంభముమీద భూతప్రేతాదుల గాలి సోకకుండా చేశాడు.

కామమ్మ కథలో కామమ్మ సహగమనంచేస్తే తనబిడ్డ సత్యాలు పోతవని లక్ష్మి వెంకడిని కామమ్మపై ఎల్లమారమ్మ పంపుచెయ్యమని అడిగింది. ఎల్ల మారమ్మ పంపుచేసిన వెంకడిని పిలిచి—

"పండుటాకుల కట్ట చేతికిచ్చింది కామమ్మ
వాడు తాంబూలం వేస్తాను ఖుసాలు గుండే వెంకడు
అప్పుడు పదహారుపండ్లూడి కిందపడ్డవిగా" వెంకడికి చేతబడి చేసే వాడి పండ్లూడగొడితే మంత్రం పారదనే నమ్మకం నేటికీవుంది. చేతబడినే "చిల్లంగి" అంటారు. చేతబడి చేసేవాళ్ళు ఎవరిపై చేతబడి చెయ్యదలచుకున్నారో వారి వెంట్రుకలను, గోళ్ళను సంపాదించి, వాటిని మారణకర్మంలో ఉపయోగిస్తారు. కాబట్టి పెద్దవాళ్ళు తలవెంట్రుకల చిక్కును, గోళ్ళను ఎక్కడపడితే అక్కడ పారవేయడాన్ని నిషేధిస్తారు.

ఈ మంత్ర తాంత్రిక చర్యలకు సంబంధించిన కథాంశాలు కుమారరాముడు మొదిమెకోట నాగిరెడ్డి, కాంభోజరాజు, సదాశివరెడ్డి కథలలో ఉన్నవి.

### 4. పితృదేవతారాధన (Ancestral worship) :

ఆత్మలకు నిత్యావసర వస్తువులు, ఆహారం అవసరమని ఆ వస్తువులు లభించకపోతే ఆగ్రహావేశంతో అవి తమ బంధువులకు ఆపదలను కలుగజేస్తా యని ఆదిమానవుడు విశ్వసించాడు. మరణించిన పితృదేవతలఆత్మలను తృప్తి పరచడంకోసం శ్రాద్ధకర్మలు చేయడం మొదలుపెట్టాడు.

నమ్మకాలు సాంఘికాచారాలలో ఒక భాగమే. జానపదుల నమ్మకాలు చాలావరకు మూఢనమ్మకాలు. జానపదులు మూఢ విశ్వాసంతో తమ నమ్మకాలను ఆచరణలో పెట్టారు. వైజ్ఞానికంగా అభివృద్ధి చెందిన నాగరకులు మూఢ విశ్వా సాలను నమ్మకపోయినా ఆచారంగా శ్రాద్ధకర్మలు నిర్వహిస్తున్నారు. ఇక్కడ నమ్మకం నమ్మకంగా కాక ఆచారంగా మారింది.

హిందువులు శ్రాద్ధక్రియలు నిర్వహించారు. ప్రేతాత్మ వైతరణిని దాట డానికి గోదానాలు, హిరణ్యదానాలు చేశారు. మరణించినవారికి పిండప్రదానాలు,

తర్పణాలు వదిలారు. వీరులు మరణిస్తే వారితోపాటు వారి గుర్రాలను ఆయుధాలను పాతిపెట్టారు.

చనిపోయిన వ్యక్తితో అన్యోన్య సంబంధం, సహవాసం సంపాదించడానికి శరీరంలోని భాగాన్ని తినే ఆచారం కొన్ని ఆఫ్రికన్ జాతులలోవుంది.

హిందువులలో ఉత్తర క్రియలు పూర్తియైన రోజున సమారాధనచేసి బంధుమిత్రులకు విందు చేయడం ఆచారంగా వుంది. చనిపోయిన వ్యక్తి ఆత్మ వచ్చి విందులో పాల్గొంటుందని వీరు నమ్ముతారు.

**౫. జంతు పూజాపద్ధతి** (Totemism):

**పితృ** దేవతల ఆత్మ జంతు రూపకంగా కనిపిస్తుందని ఆది మానవుని నమ్మకం. ఈ నమ్మకం ప్రపంచ వ్యాప్తంగా వివిధ జాతుల్లోవుంది. మలయాల్లోని సెమాంగులు, ఆస్ట్రేలియాలోని కొన్ని జాతులు ఆత్మ పక్షి రూపకంగా వుంటుందని నమ్ముతారు. బ్రిటిష్ కొలంబియాలోని హైడా జాతివారు నీటిలో మునిగిన వారి **ఆత్మలు** తిమింగలాలుగా మారతాయని, యుద్ధంలో చనిపోయిన వారి **ఆత్మలు** వసంత కాలంలో పాటపాడే పక్షులుగా మారతాయని నమ్ముతారు. హోటెన్ టాటులు చనిపోయినవారి ఆత్మలు నక్కలుగా మారతాయని నమ్ముతారు. పశ్చిమాఫ్రికాకు చెందిన దహోమియనులు ఆత్మ స్వరూపాన్ని సర్పంగా భావిస్తారు. ఈ నమ్మకాలవల్ల ప్రాచీన మానవ మత పరిణామ క్రమంలో జంతు పూజకు స్థానం ఏర్పడింది. పితృ దేవతల ఆత్మలు ఆవేశించిన జంతువులను ఆ యా కుల చిహ్నాలుగా భావించి పూజించారు. ఈ కుల చిహ్నాలనే 'టోటమ్' (Totem) అంటారు.

హిందూ దేశంలోని అనార్య జనుల్లో ఈ టోటమిక మత స్వరూపం క్రీస్తు పూర్వం నుంచి వుంది. దీనికి మొహంజొదారో, హరప్పాల సంస్కృతి ఆధారం. అక్కడ తవ్వకాల్లో బయల్పడిన వివిధ జంతువుల రూపాలను ఆధారంగా తీసుకొని అనాటి దేశాన్ని మీనాడ్ (The country of fish) పరవనాడ్ (The country of Birds) మరొక కోటినాడ్ (The country of wood Peckers)గా ఫాదర్ హిరాస్ నిర్ణయించాడు. ప్రాచీన మాన

వుని ఆత్మారాధన దశలో జంతువులను, చెట్లను, రాళ్ళను ఆశ్రయించిన శరీ రాన్ని వదలిన ఆత్మ నశించకుండా వుంటుందనే నమ్మకం ప్రబలి ఆ నమ్మకమే మెల్లగా టోటమిక దిశగా మారింది. జంతువులయెడ గౌరవాన్ని, వంశ తారక భావాన్ని కలిగించి మరొకవైపు దేవతా భావాన్ని కలిగించడానికి ఆధారమైంది.

పిల్లిని, గోవును, బల్లిని, కాకిని చంపకూడదనడం, కాకిని పితృదేవతగా భావించడం, పిండ ప్రదానం చెయ్యడం, తద్దినంనాడు పిండాలను గోవులకు తినిపించడం, వైతరణిని దాటిస్తుందని గోదానం చెయ్యడం, వివాహాలలో కొన్ని జాతుల నాగవల్లిలో జంతువుల బోలు రాయడం, ఒక వస్తువునుగాని జంతువును గాని తినరాదని నిషేధించడం మొదలైన నమ్మకాలు ఒకనాటి టోటమిక స్థితిని సూచిస్తున్నాయి.

కొమిరెల్లి మల్లన్న కథలో పుట్టనుండి గొఱ్ఱెలు ఒకటొక్కటిగా బయటికి రాగా మల్లన్న

"ఎక్కడివో బూరు క్రిములు రామ ఓ రామా రామ
ఒక్కటొకటి వెడలుచుండె
లెక్కలేకుండయ్యె చూడ మిక్కుటముగ వీటినన్నిటి
నిప్పుడే యీ పుట్టలోనికి నెట్టివేసె నేర్పుతోడ
దక్కకుండ అగ్నిచేత దహనము కావింతు నిపుడె"

అని ఆ గొఱ్ఱెలను కాల్చుటకు ప్రయత్నించాడు. ఈశ్వరు డాతని చర్యను మాన్పి వాటిని కాపాడుమని ఆదేశించి నల్లగొంగడి కప్పుకొన్న భూతప్రేతాదులు రావని తెల్లగొంగడి కప్పుకొన్న దేవతా ప్రసన్న మవుతుందని కసిరె గొంగడి కప్పుకొన్న కష్టములు పోతాయని చెప్పాడు.

అప్పటినుంచి కురుమలకు గొఱ్ఱె వంశచిహ్నము. వివాహాలలో గొఱ్ఱెబోలు వేసే ఆచారం వాళ్ళలోవుంది. గొఱ్ఱెల ఉన్నితో చేసిన కంబళ్ళలో భూతాలను పారద్రోలే శక్తివుందని నమ్ముతారు.

జాంబ పురాణములో "కలుకోడి" గౌండ్లవారి ఇంటి ఆడపడుచుగా చెప్ప బడ్డది. కాబట్టి

"గౌండ్లవాడు కోడిని సాదరాదు, కోడిని తినరాదు"

ఇచట కోడి గౌండ్లవారి టోటమిక చిహ్నము.

బలిజలకు "గాడిద" టోటమిక చిహ్నము. వారి వివాహాలలో గాడిదపోలు వేస్తారని జాంబపురాణంలో జాంబవంతుడు చెప్పాడు.

"గాడ్డిపోలు ఎవరికి రాస్తున్నరు?
బలిజోల్ల లగ్గంల రాస్తున్నరు"

బాలనాగమ్మ కథలో నాగేంద్రుడు భగవత్ స్వరూపుడై పూజలందు కొనగా, కాటమరాజు కథలో "బొల్లియావు" పీరత్వానికి ప్రతీకయై కొలువ బడింది. దీనిని జానపద కవి ఆదివిష్ణువు అవతారంగా వర్ణించాడు.

అశ్వమేధయాగంలో యాగాశ్వం నవరంధ్రాలు మూసి చంపిన తరువాత ఒక రాత్రి యజ్ఞం చేసేవాని భార్య ఆ అశ్వంతో నిద్రించాలి. ఆ అశ్వ మాంసాన్ని సోమయాజి, అతని భార్య భుజించాలి. ఆ అశ్వ శరీరంలో ఉన్న ఆత్మ యాజ్ఞికుని వంశంలోని ఆత్మశక్తియని, అది తిరిగి మాంసభక్షణం చేయడంతో యాజ్ఞికునికి చెందుతుందని పెద్దల నమ్మకం. ఈ అశ్వమేధాన్ని టోటమిక దశకు చెందిన కర్మకాండగా చెప్పుకోవచ్చు. దశావతారాలలో మత్స్య, కూర్మ, వరాహ, నారసింహావతారాలు జంతు స్వరూపగతమైన ఆత్మశక్తిని ఉద్దేశించినవే.

పచ్చ పొడిపించుకునే ఆచారం జానపదులలో ఉంది వ్యక్తి మరణించిన తరువాత ఆత్మ పై లోకానికి వెళ్ళినప్పుడు "పదివేలు చేయపచ్చలేదు. కాబట్టి నరకానికి వెళ్ళు" అని దేవుడు తోసివేయునట. ఈ నమ్మకంతో పచ్చ పొడిపించు కోవడం చేస్తుంటారు. ఈ పచ్చ పొడిపించుకోవడం టోటమిక దశకు చెందిన నమ్మకమే. తమ ఈ కుల చిహ్నాన్ని శరీరంమీద చిత్రించుకునేవాళ్ళు. దీన్నే Tatooing అన్నారు.

పాముల వల్ల సూర్యగ్రహణం ఏర్పడుతుందని జానపదుల నమ్మకం.

"ఊడలమ్రి కింద కోరన్న పుట్ట
కోరన్న పుట్టలో కోడెనాగన్న
గొయ్యితవ్వి నాగన్న గోతిలో గుడ్లు
పొదతవ్వి నాగన్న మేతకే వెళ్ళు
గుడ్డిడిచి నాగన్న మేతకే వెళ్ళు
గొడ్లకాడి పిల్లోళ్ళు పాపకారులు
పాముల్ల గుడ్లని పగులకొట్టేరు
చాటెడు పడగతో చెండాడుకుంటూ
తరిమేను బాలుణ్ణి దరినందకుండ
సూరన్న చంద్రన్న అన్నదమ్ములూ
ముత్యాల చాపలు ముందరే పరచి
చేయి చేయి కలిపి జూదమాడంగ
ఇద్దరీ చాటుకే బాలుడెల్లంగా"

దాగిన బాలుణ్ణి పడదోయమన్నాడు నాగేంద్రుడు. పడదోయుటకు మన సొప్పక -

"పడదోయ మేమంత పాపకారులమా
ఏడాదికొకసారి సూర్యగ్రహణము
ఏడాదికొకసారి చంద్రగ్రహణము" - (త్రివేణి)

అని సూర్యచంద్రులు పలికినారు. ఇలా సూర్యచంద్ర గ్రహణాలు ఏర్పడ్డాయి.

ఎలుగుబంటి వెంట్రుకలను తాయెత్తులో పెట్టికడ్తే అన్ని పీడలు తొలగిపోతాయి. కుక్కను చెప్పుతో, కాలితో, చీపురుతో కొట్టకూడదు. గాడిద పొర్లాడిన బూడిదను తొక్కకూడదు. ఒంటిమీద సాలెపురుగుపడితే కొత్త గుడ్డలు వస్తాయి. ఇలాంటి నమ్మకాలెన్నో ప్రజల్లో చోటు చేసుకున్నాయి.

### 6. మాతారాధన (Mother goddess worship) :

ఆత్మారాధన దశలో చెట్లను, పుట్టలను ఆశ్రయించిన ఆత్మలు మాతారాధన దశలో గ్రామదేవతలై వేప, రావిచెట్లను, పాముల పుట్టలను ఆశ్రయిం

చాయి. మాతృారాధనలోని బలిక్రియ (Sacrifice) పవిత్రీకరణం (Sancti fication) వల్ల మాత చల్లనిచూపు తమపై ప్రసరించి పశువులను పంటలను కాపాడి ఈతిబాధలు కలగకుండా చేస్తుందని జానపదుల నమ్మకం. జాతరలలో కనిపించే సిడిత్రేలడం, గుండాలు తొక్కడం మొదలైన ఆత్మహింసకు (Self-immolation) సంబంధించిన ఆచారాలన్నీ జానపదుల నమ్మకాలమీద ఆవిర్భవించినవే.

ప్రతి గ్రామంలో ఊరిబయట మైసమ్మ, ఊరిమధ్య ఎల్లమ్మ పోశమ్మల గుళ్ళు ఉంటాయి. మారెమ్మ, ముత్యాలమ్మ, పోలేరమ్మ అంకమ్మ, ఈదెమ్మలను కూడా గ్రామస్తులు పూజిస్తారు.

సహగమనం చేసినవాళ్ళు, బలవంతంగా చంపబడ్డ స్త్రీలు, ప్రాణత్యాగం చేసినవాళ్ళుకూడా దేవతలుగా పూజింపబడ్డారు. అలాంటివారే కామమ్మ, లక్ష్మమ్మ సారగమ్మలు.

గ్రామ దేవతలకు సంబంధించిన పూజలు బ్రాహ్మణులు చెయ్యరు. ఆ దేవతల స్వరూప స్వభావాలనుబట్టి, జనన చరిత్రనుబట్టి ఒక్కొక్క తెగవాడు పూజారిగా ఉంటాడు. ఎల్లమ్మ మాలవాని ఇంట జన్మించింది. గంగమ్మ గొల్లల కులదైవం. అందువల్లే ఎల్లమ్మపూజారులు బైండ్లవారైతే, గంగమ్మ పూజార్లు గొల్లలయ్యారు. పిన్నమ్మ, పోశమ్మవంటి దేవతలకు చాకళ్ళు పూజారులు. వీరు చదివేవి తెలుగు మంత్రాలే. జానపదగాథల్లో తల్లి దేవత రక్తప్రీతిగల దేవత. ఆవిడ బలిని కోరుతుంది. గొర్రెలు, కోళ్ళు, మేకపోతులు ఆమెకు ఆహారం, తప్పకుండా కల్లు సారా పోయాల్సిందే. నరబలులు కూడా అప్పుడప్పుడూ ఈమెకు ఇస్తుంటారు.

బలి క్రియతోపాటు నిప్పులగుండం తొక్కడం, నిప్పులు ఒడిగట్టడం, తలమీద గండ దీపాలెత్తుకోవడం కనిపిస్తాయి. పాండవుల పరుస, గంగ జాతర జరిగినప్పుడు కొన్ని ప్రాంతాల్లో గుండం తొక్కడం కనిపిస్తుంది. భక్తులు మొక్కులు చెల్లించుకోవడం కోసం తమను తాము హింసించుకుంటారు. భక్తులు జీవద్దీపాలుగా వెలగడం, కనురెప్పలకు సూదులు గుచ్చుకోవడం, చెవుల్లో నారసాలు, నాలుకలో కొర్రులు, వీపున కొంకిగాలాలు గుచ్చుకుంటారు. సిడి

వ్రేలడం అమ్మవారి జాతరలలో కనిపిస్తుంది. కాళికాదేవి దారుకుని చంపడానికి ముందు వాని వీపు కొటికి నెత్తురుతాగి దాహం తీర్చుకొందట. సిడులు ఆడడం ఈ వృత్తాంతాన్ని జ్ఞప్తికి తెచ్చుకోవడానికే అని జానపదుల నమ్మకం. అందుకే సిడివ్రేలేవాని వీపుకు సిడిమ్రాను కొక్కెమును గుచ్చుతారు.

గ్రామదేవతలలో జనుల్ని, పశువుల్ని గాయి గత్తరనుండి కాపాడేవికొన్ని, ఊరి పొలిమేరలను కాపాడేవి కొన్ని, చెరువుకట్టల్ని కాపాడేవి కొన్ని, నిధి నిక్షేపాలను చూచుకునేవి కొన్ని. ఈ శక్తులన్ని బలుల్ని కోరుతాయి. నిధి దేవతకు బలులిచ్చే ఆచారం ప్రపంచవ్యాప్తంగా ఉంది. అంజమ్మకథలో అంజమ్మ నిధికి బలిఇవ్వబడింది. అన్న అప్పయ్య అత్తింట్లోఉన్న నిండు గర్భిణి అయిన చెల్లెలు అంజమ్మని తీసుకొని—

"బాయికాడికొచ్చి - బోనాలు పెట్టిండు
నేనెట్ల మొక్కుతున్న - నువ్వట్ల మొక్కవె
బోరులావండుకోని - మొక్కావె చెల్లెలా
అట్లనే పండింది - దండాలు వెడ్తుంది
కడుపులావున్నదీ - కానరానీకత్తి
కత్తుల్లుదీసిండు - శిరసుపైనేసిండు"

—నల్లగొండ జిల్లా ఉయ్యాల పాటలో

అట్లాగే కట్టమైసమ్మకు బలిఇవ్వడం "నాగకథ"లో చెప్పబడింది.

"కొండంత మొగులొచ్చె
చాటోలె తెప్పొచ్చె
తూరుపూ దేశాన
తులసి వానాగొట్టె
దక్షిణా దేశాన
ధరణి వానాగొట్టె"

వానవల్ల చెరువునిండి కట్టతెగింది. కట్టమైసమ్మ

"కట్టకూ హారమ్మొ
ఎవరిని స్తవు రాజ"

అని అడిగింది. చిన్న కోడలిని ఇస్తానన్నాడురాజు. బిందెపట్టుకు నీళ్ళ కెళ్ళిన అక్కమ్మ చెరువుకు బలిఅయింది.

అనుముల బ్రహ్మారెడ్డి కథలో విత్తనాలను తీసుకువెళ్తున్న బండ్లకు మొర మైసమ్మ అడ్డంవచ్చి—

"నాకు హావతి పెట్టండి బండ్లుబోతయి లేకుంటే జోవ"వన్నది. ఏమి హావతి బెడ్డునమ్మా అని బ్రహ్మారెడ్డి అడుగగా "యాకటి మనిషి" గావలెనంది. గర్భవతియైన గొల్లకిష్టమ్మను కిందకుతోసి ఆమెపై బండ్లు పోనిచ్చి

"అమ్మా రావె మొరమైసమ్మ
తీసుకుపో నీ ఆవతి"

అని బలిక్రియ నిర్వహించాడు.

గ్రామాలలో గ్రామ దేవతలకు సంబంధించిన నమ్మకాలు అనేకం. ఎల్లమ్మవల్ల ఎల్లమ్మ సుదుగురు అనే చర్మవ్యాధి వస్తుంది, ఆమెకు పూజచేస్తే ఆ వ్యాధి తగ్గుతుందని నమ్ముతారు.

ముత్యాలమ్మ దృష్టినుంచి ఎవరూ తప్పించుకుపోలేరు. ఆమెకు తలనిండా కండ్లే అని నమ్మి "వేయి కండ్ల బోనం" పెట్టడం గ్రామీణులలో ఆచారమయింది. అందుకే మశూచి వచ్చిన వారిని పొలిమేర దాటనివ్వరు. దాటితే ముత్యాలమ్మ కూడా పొలిమేర దాటుతుందని నమ్ముతారు. ఈ అంటువ్యాధి వేరే గ్రామాలకు వ్యాపించకుండా వుండడమే ఈ నమ్మకం వెనుక ఉన్న శాస్త్రీయమైన దృష్టి. మశూచిపోస్తే తల్లి అయిందంటారు. మశూచి పోసినవారిని ముత్యాలమ్మకు ఇష్టమైన వారినిగా భావిస్తారు. రోగికి లేత రంగు, తెల్లని వస్త్రాలే కడతారు. ముదురు రంగు బట్టలు తల్లికి ఆవేశం కలిగిస్తాయని గ్రామీణులు నమ్ముతారు. ఇంట్లో పోపు పెట్టరు, పెనం పెట్టరు, మాంసాహారం వండరు. ముత్యాలమ్మ అంటు ముట్టు సహించదని మశూచిపోసిన వారికి అందరూ దూరంగా వుంటారు.

ముత్యాలమ్మ దిగిపోగానే రోగి చాపచుట్టూ పిడక బూడిద పోస్తారు. అలాగే ఇంటి గడపకు ఇనుప ముక్కను, చీపిరిని అడ్డంగా పెడతారు. లేకపోతే కుంపటైనా వెలిగిస్తారు. దీపం ఆరకుండా చూస్తారు. ఇంట్లో ఎవరో ఒకరు రాత్రంతా మెలకువతో ఉంటారు. చావునుకోరే తాస్కమ్మ, మాస్కమ్మ, ఇడుపులమ్మ, మెడ విరుపులమ్మ, తొంగిసూపులమ్మ మొదలైన దుష్టశక్తులు రోగి ప్రాణం కోసం వేచి ఉంటాయి. అవి లోపలికి రాకుండా పై జాగ్రత్తలు తీసుకుంటారు.

రోగి ఆరోగ్యం పొందడానికి ముత్యాలమ్మకు అనేక మొక్కులు మొక్కుతారు. గండదీపం పెడ్తామని, వెయిగండ్ల బోనం పెడ్తామని, సాక పోసి బండి కడ్తామని మొక్కు కుంటారు. వ్యాధి తగ్గిన తరువాత తల్లి రోగిని కాపాడిందనే గ్రామీణులు నమ్మి వారి మొక్కులు చెల్లించుకుంటారు.

**బోనం :**

కొత్త కుండకు కింది భాగం సగం వరకు సున్నం పూసి మధ్య భాగాన నూనె రుద్ది, పసుపు కుంకుమ బొట్లు పెడతారు. బోనాన్ని రకరకాలుగా వండుతారు. కొందరు బియ్యం పాయసం చేస్తే, మరికొందరు జొన్న గట్క చేస్తారు. కొందరు ఉల్లిగడ్డలు, బెల్లం పాలు బియ్యంతో గడ్డల పాయసం చేస్తారు. ఈ పాయసంతో కుండ నింపి కుండపైన సున్నంపూసిన కొత్త మట్టి గురిగి పెట్టి దానిపై మట్టి మూకుడు పెట్టి నూనె పోసి వత్తి పెట్టి గండదీపం వెలిగిస్తారు. కుండకు పూలు, కంకణం కట్టి కుండకు గురిగికి మధ్య లేత వేప రెమ్మలు పెడతారు.

**వేయికండ్ల బోనం :**

కుండ నిండా రంధ్రాలు చేసి సున్నం పూయకుండానే గుడిముందు పెడతారు. దీనికితోడు వేరే బోనం కుండను పెడతారు. ఈ రంధ్రాలు ముత్యాలమ్మ కండ్లుగా గ్రామీణులు నమ్ముతారు.

మైసమ్మ అర్ధరాత్రులు ఆకాశమంత ఎదిగి గండదీపం నెత్తిన పెట్టుకొని పొలిమేర కావలా కాస్తుందని గ్రామస్తుల నమ్మకం.

బోనాలపండగరోజు పూనకం పూనిన పోతురాజు ప్రతి ఇంటిముందు నిలిచి వేపాకు నములుతూ పెద్ద కేక వేస్తాడు ఆ కేకకు ఇంటిని ఆవరించిన దుష్టశక్తులు పారిపోతాయి అని జనులు నమ్ముతారు.

**7. వీరారాధన** (Hero worship):

ప్రాచీన మానవుడు నాగరికత నేర్చిన తరువాత అతడు నివసించే సంఘంలో ఆచారాలలో నియమాలలో ఎన్నో మార్పులు వచ్చాయి. ఒంటరిగా బతికే మానవుడు ఒక గుంపుకు నాయకుడైనాడు. అతడు గుంపుకు ఆదర్శ ప్రాయుడై వారికి దైవసముడై వీరపూజ లందుకున్నాడు. ఆటవిక జాతుల ప్రాచీన గాధలలోని దేవతలు చాలామంది ఇట్టి ప్రశస్తివహించి మరణించి వీరులైన నాయకులే. తమ రాజులను దేవతలుగా పూజించే ఆచారం ఈజిప్టు, జపాన్, గ్రీసు మొదలైన దేశాల జనుల్లో ఉంది. రాజును సాక్షాద్విష్ణుదేవుని అంశంగా హిందువులు నమ్ముతారు. రాజుకోసం ప్రాణాలర్పించిన వీరుల్ని ఆరాధించే సాంప్రదాయం దేశంలో నెలకొన్నది. ఉత్తమాదర్శాలకోసం ఆత్మ బలి అయ్యే వీరుల విగ్రహాలను నిలిపి పూజించేవారు. వాటిని వీర శిలలు, వీర కల్లులు అని పిలిచేవారు.

ఈ వీరారాధన 12, 13 శతాబ్దాలలో ఆంధ్ర దేశంలో ముమ్మరంగా జరిగింది. వీర శిలలు త్రిపురాంతకము, వరంగల్లు, పల్నాడు, నెల్లూరు, మల్లాములలో ఉన్నవి. ఇప్పటికీ కొన్ని గ్రామాలలో "వీరుళ్ళ"ను పెట్టుకోవడం కనిపిస్తుంది. పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు, సర్వాయిపాపడు కుమార రాముడు, బల్లూరి కొండయ్య, దేశింగు రాజు, సదాశివరెడ్డి మొదలైన వీర గాథలలోని వీరులు ఆరాధింపబడ్డారు.

సారగమ్మ వీరవనిత. గ్రామ స్త్రీలకు శిక్షణ నిచ్చి మహమ్మదీయుల దుండగాలను అరికట్టడంలో ప్రాణాలను అర్పించింది. ఈమె ఆయుధాలు వడిసెల, కారం మాత్రమే.

"ఊరూరిలో ఉడుకుతనంపుట్టించారమ్మా
మమ్ము కాపాడవమ్మా సారగమ్మా
తెలియని వేసాలు వేసి
మముతెర్లుజేసి మోసగించిరి ఓయమ్మా
మము కాపాడి నావె సారగమ్మా"

అని కాని వారికి చిక్కడానికి ఇష్టపడక బాకుపై ఒరిగి వీర మరణం చెందిన సారగమ్మను ఆరాధిస్తారు.

## 8. భగవదారాధన (Deity cult):

ప్రాచీన మానవుడు ప్రకృతినిగూర్చి ఎన్నో కలలుకన్నట్లే తరువాతి కాలంలో అతనికి కలిగిన భయం, కృతజ్ఞత, ఆశ్చర్యం దేవతలు పుట్టడానికి కారణమయ్యాయి. దేవతలు ఉద్భవించడానికి కారణం మానవుడే. మాతృస్వామ్య వ్యవస్థపోయి ఎప్పుడైతే పురుషాధికారం ఏర్పడిందో అప్పుడే పురుష దేవతలు ఆవిర్భవించారు. తాము సృష్టించుకొన్న దేవుణ్ణి రకరకాల పేర్లతో పిల్చుకున్నారు. కొందరు శివుడంటే కొందరు విష్ణువన్నారు. మరికొందరు శక్తి అన్నారు. ఈ విధంగా సృష్టించుకున్న మతసామ్రాజ్యాన్ని శైవులు వైష్ణవులు శాక్తేయులు పరిపాలించారు.

వీరశైవ మతవ్యాప్తిలో కొన్ని ఘోరాచారాలు తెలుగుదేశంలో వ్యాపించాయి. శివార్పణంగా అంగాలను ఛేదించుకోవడం, తలలను నరుకుకోవడంవల్ల శివసాయుజ్యం లభిస్తుందనే నమ్మకం భక్తులలో కలిగింది. వీర శైవాచారాలు క్రీడాభిరామంలో వర్ణింపబడ్డాయి.

శక్త్యాలయాలలో, భైరవాలయాలలో నరబలి ఇచ్చేవారు. నరబలులు ఇచ్చే దేవాలయాలను చంపుడుగుళ్ళని పిలిచేవారు.

సింహాసనద్వాత్రింశికలో—

"చంపుడుగుడి యిదియనియా
దంపతుల కళేబరములు తలలు̐గని తత్
సంపాదిత భయరౌద్రా
కంపితుడై సెట్టి బెగడికన్ను... ... ...న్"

అని కొలవి గోపరాజు వ్రాశాడు.

మహాశివరాత్రి ఉత్సవ సందర్భంగా వీరులు శ్రీశైల క్షేత్రానికి వెళ్ళి ఆత్మబలి కావడానికి ప్రత్యేకంగా ఒక మండపం అనవేమారెడ్డి కాలంలో కట్టబడింది. దీన్ని "వీర శిరోమండపము'' అనేవారు. దీని వర్ణన ఈ శ్లోకంలో ఉంది.

"స్తంభై రూర్జిత మంగ పంచకయుతై రష్టోత్తరత్రింశతో
మధ్యే రంగశిలా విశాలముపరి ప్రత్యగ్ర పద్మాంచితం
భద్రాంకమ్ముఖ భద్రతోరణాయుతం సద్వారపాలాన్వితం
శ్రీశైలేకృత మన్న భూమి పతినా వీరశిరో మండపం''

భక్తులు ఇక్కడ భృగుపాతం ఒనర్చే ప్రదేశాన్ని "కర్మహారీశ్వరమని" పిలిచేవారు. పండితారాధ్య చరిత్ర, బసవ పురాణం, క్రీడాభిరామం, కళాపూర్ణోదయం, సింహాసనద్వాత్రింశిక వంటి ప్రాచీన కావ్యాలలో ఆత్మాహనన ప్రసక్తి ఉంది.

పిల్లలు లేనివారు తమకు పిల్లలు కలిగితే మొదటి సంతానాన్ని దేవాలయానికి ఇస్తామని మొక్కుకునే వాళ్ళు. నక్షత్రబలం సరిగ్గా లేదని, పిల్లలు దురదృష్టవంతులని మూఢంగా నమ్మి వారిని దేవదాసీలుగా తయారుచేశారు. ఇది హిందూ సంస్కృతి పోషించిన నికృష్టమైన ఆచారం.

ఆంధ్రుల సాంఘిక చరిత్రలో శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు "శైవులు మతంపేర బసివిరాండ్రను జన్నవిడిచారు. బసవని పేర స్త్రీలకు పెండ్లిచేయక వదలి వారిని వ్యభిచారులనుగా చేసిరి. వైష్ణవులు కూడా ముద్రలువేసి దేవదాసీలను సిద్ధము చేసిరి" అని వ్రాశారు.

దేవాలయానికి చెందిన వేశ్యను దేవదాసీ అంటారు. సమాజంలో ఆలయ వ్యవస్థతో పాటు దేవదాసీ వ్యవస్థ ఏర్పడింది. దత్త, విక్రీత, హ్రీత, అలంకార, రుద్ర గణిక, భక్త, భృత్య, అనే సప్తవిధ కన్యలు దేవదాసీలుగా పరిగణింపబడేవారు. వీరికి దేవుని విగ్రహంతో వివాహం జరిపి ఆలయధర్మ కర్తతోనో, పెద్ద పూజారితోనో లేక కులస్థురాలైన పెద్దముత్తైదువతోనో తాళి కట్టించేవారు. నిత్యుడైన భగవంతుని వివాహమాడిన స్త్రీ గనుక దేవదాసీని నిత్యసువాసిని అని పిలిచేవారు చోళరాజైన రాజరాజ నరేంద్రుడు 400 మంది కన్యలను దేవ

దాసీలుగా తంజావూరు దేవళానికి కానుకగా ఇచ్చాడు. 19 వ. శతాబ్దంలో కూడా కంచి దేవాలయంలో వందమంది దేవదాసీలు ఉండేవారట.

శివాలయానికి కానుకగా ఇవ్వబడ్డ కన్యలకు కూడా లింగధారణ జరిపించి దేవదాసీలుగా నిర్ణయించి వారిని బసివి స్త్రీలుగా వ్యవహరించేవారు. ఆలయ నృత్యకళను ఆరాధించడమే గాక శివభక్తులకు కామతృప్తి కలిగించడం కూడా వీరశైవం ప్రాబల్యం చెందిన రోజులలో విధిగా ఉండేది. బసివిగా చేయబడ్డ కన్యను దేవాలయంలోని దేవుని విగ్రహంతో వివాహం జరిపించి మట్టె, మంగళ సూత్రంపెట్టి ఉన్నత కులస్థునిచేత కన్నెరికం జరిపించి వేశ్యగా చేసేవారు. కర్నాటకలో ఈ నాటికీ ఎల్లమ్మ పేర స్త్రీలను జన్నవిడిచే ఆచారం కనిపిస్తుంది.

చిన్నమ్మ మద్దులేటి స్వామివరం వల్ల జన్మించింది. ఆమెవైష్ణవి. భర్త వెంగళరెడ్డి శైవుడు. మామ విష్ణుపూజ మానమన్నా చిన్నమ్మ మానలేదు. ఆమెను అనేక కష్టాలుపెట్టారు అత్తవారు. మద్దులేటి స్వామి ఆమెను ఆదుకున్నాడు. అనేక సత్యాలుచూపాడు, చివరకు అందరూ కొల్లారిబండ్లు కట్టుకొని కొండకు వెళ్ళారు. చిన్నమ్మకు మాత్రమే వైకుంఠమిస్తాను, పంచ మహాపాతుడైన నీ భర్తను ఎందుకు తెచ్చావు అంటాడు స్వామి.

"పతిచేసిన ధర్మము సతికిముట్టును
సతిచేసిన ధర్మము పతికిముట్టును"-

కాబట్టి భర్తకు వైకుంఠ ప్రాప్తి కలగజెయ్యమని ప్రార్థిస్తుంది చిన్నమ్మ. అప్పుడు

"స్వామి కుడిచేతిలో బంగారుశిలయై నిలిచె చిన్నమ్మ తల్లి
అప్పుడే పెనిమిటి వెండిశిలయై నిలిచె యెడమచేతిలోను"

ఇద్దరికీ బొందితో వైకుంఠం సమకూరింది.

ఎన్ని కష్టాలుపడ్డా భక్తివల్ల భగవంతుని అనుగ్రహాన్ని పొందవచ్చుననే నమ్మకం ఈ కథలో కనిపిస్తుంది.

చిరుతొండ రాజు చరిత్రలో గురులింగ జంగము కృపపొందడానికి భక్తుడు ఎంతటి కష్టమైన కార్యమైనా చెయ్యాలి అని చెప్పాడు కవి. జంగము దేవరకోరిక మేరకు కుమారుణ్ణి వండి వడ్డించడానికి సిద్ధపడ్డాడు చిరుతొండడు.

భార్య-

"కుండలమ్మిన యిట్టి గుండయ్య యింట
కుడిచితివి ఒక విందు ఓ జంబుకేశ
సురలార యీ విందు కుడిచి మీరంతా
చిరియాళు నంపుడీ శివలోకమునకూ
అనుచు పాటలుపాడి ఆయంబుజాక్షి
దంచిన మాంసంబు పచనంబుజేసి
తాలింపులో చమురు తగ్గ మిరియంబు
వుప్పుమెంతి బెట్టి ఉత్పలాగంధి
నవరసాన్నంబులు సిద్ధంబుజేసె"—

చివరకు జంగమరూపుడైన ఈశ్వరుడు వారికి శాశ్వతపదమైన కైలాస మిచ్చాడు.

## II సంఘపరమైన నమ్మకాలు :

సంఘంలోనివారు ఆచరించే ఆచారాల వెనుక, నమ్మకాల వెనుక మత చ్ఛాయలు గోచరిస్తాయి. మానవుడు సంఘంగా ఏర్పడిన తరువాత అతనికి సాంస్కృతిక ఆర్థిక కౌటుంబిక వైవాహిక రంగాలలో కొన్ని నమ్మకాలు ఏర్పడ్డాయి.

### a) కౌటుంబికాలు :

పుట్టుక, పెండ్లి, శకునాలు, దృష్టిదోషం, స్త్రీల కట్టుబాట్లు, మరణం, సహగమనం వీటికి సంబంధించిన నమ్మకాలన్నీ కౌటుంబికాలే.

### పుట్టుక :

పురిటిగదికి వతల ముసలమ్మలు కూర్చొని "ఎన్నెమ్మ" కథ చెప్పుకొని ఈ పాట పాడుతుంటారు. అందువల్ల బాలపాప చిన్నెలు (ఎన్నెమ్మబాధ) తొలగి పోతుందని నమ్ముతారు.

"మొదటిరోజు వక్కలు రెండోరోజు రొట్టెలు, మూడోరోజు మువ్వలు పట్టుకొచ్చి, నాల్గోరోజు నవ్వుతూ కేరుతూ వచ్చి, అయిదోరోజు ఆడుతూ పాడుతూ వచ్చి ఆరోరోజు అందెలు పెట్టుకొనివచ్చింది. ఏడోరోజు ఏడుపుముఖం పెట్టింది. ఎనిమిదోరోజు ఏటని, తొమ్మిదోరోజు తోరణాన్ని పదోరోజు పట్నం దాటి వెళ్ళింది ఎన్నెమ్మ." అనే అర్థంగల పాటపాడి -

"ఎన్నెమ్మ బ్రతుకులు ఎన్నెకలు, కన్నెకలు
బ్రాహ్మణి కూతురు, మాలాడి పెళ్ళాం
ఎన్నెమ్మ తలచిన
ఏడువాడలా
ఎన్నెమ్మరాదు" (త్రివేణి)

అని ముక్తాయింపు చదువుతారు.

బిడ్డ పుట్టిన తరువాత బారసాలనాడు మొదట కులదేవత పేరు పెట్టినట్లు చెవులో చెప్పి తరువాత అసలు పేరు చెప్పడం ఆచారంగా కొన్ని కులాలలో ఉంది. తమ కాలంలో పేరంటాలుగా నిలిచిన స్త్రీని కులదేవతగా పూజిస్తారు. ఆమె పేరు పెట్టుకుంటే అంతా శుభమే కలుగుతుందని నమ్ముతారు.

వ్రతాలు, పూజలు చేస్తే సంతానం కలుగుతుందనే నమ్మకం ప్రజల్లో ఉంది. మాదాంబ "నందికేశ్వర వ్రతం" చేసి బసవని కుమారుడిగా పొందిందని బసవ పురాణంలో చెప్పబడింది. పల్నాటి వీర చరిత్రలో ఐతాంబ సంతానం కొరకు విఘ్నకుంట వ్రతము, సంధ్యావర్తి నోము, పచ్చవిల్తుని నోము, చీకటింటి నోము చేసింది. కాని సంతానం కలగలేదు. చివరకు గజనిమ్మ నోమునోస్తే బాలచంద్రుడు కలిగాడు.

కొన్ని కథల్లో మునులో, దేవుడో ఇచ్చిన మామిడిపండ్లను, మల్లె పువ్వులనూ తింటే సంతానం కలుగుతుందనే నమ్మకం చోటుచేసుకుంది. బాలనాగమ్మ కథలో మునీశ్వరుడిచ్చిన ఏడు మామిడిపండ్లను తింటే ఏడుగురు కుమార్తెలు కలిగారు తరిదేవి కథలో—

"ఈ అయిదు మల్లె పుష్పములూ
నీవు ఆరగించవమ్మా
ఓ ధర్మతరి దేవి
ఆ సమయమున తరిదేవి జంగమయ్య యిచ్చిన
మల్లె పుష్పములూ ఆరగించినాది ధర్మతరిదేవి
అయిదుగురు మొగ కుమారుండ్లు
ఒక్క ఆడకుమార్తె గల్గినాది"

అని ఉంది.

మాహురమ్మ కథలో జమిలికాదేవికి, గిరిరాజునకు ఆడ సంతానంలేదు. అందువల్ల వారు—

"ఆడ సంతానం కొరకు అతివేగ వారు
నోమరాని నోముల్లు నోసిరి వారు
పట్టరాని వ్రతముల్లు పట్టిరి వారు
పచ్చనా వృక్షాలు పత్రిగా నోమిరీ
నిండుబిందెలు నోమిరి నీరాళ్ళుగాను"

కుమారరాముని కథలో అరియమ్మ సంతానం కొరకు చేయరాని తపస్సులు చేసింది,

"అగ్ని గుండమూ తొక్కుకుంటూ
జీడి గుండమూ తొక్కుకుంటూ

స్వామి ఆలయానికి వచ్చి తలకిందులుగా తపస్సు చేయగా భగవంతుడు వచ్చి తోటలోని అరటిపండు తెంపి ఆమె ఒడిలో వేసెను.

రాణి యింటికి వచ్చి—

దేవుడిచ్చి అరటీ ఫలమూ
ఫలముమీద సిక్కు దీసిందమ్మా
బంగారు సిడిగిన్నె లోపల నింపిందీ
పాలు పంచదార బోసింది అరియమ్మా

అయిదు నాగమల్లె పూలు బెట్టిందీ
హరహరా అని అర్పణ చేసిందీ"

ఆపైన పండు మీది తోలును "నరులు తొక్కని జాగ"లో దాసి సంగను పారవేయమంది. సంగ "నరులు తొక్కని జాగ యేదమ్మా" అని తొక్కను తాను తిన్నది. తొమ్మిది గడియలలో రాణికి కుమార రాముడు సంగకు పోలిక రాముడు జన్మించారు.

వీర నాగమ్మ కథలో నాగేంద్రుడు పరయింటి దీపాన్ని (ఆడపిల్ల) కోరి వచ్చిన ఎంగమ్మతో—

"నీ యింటి ముందర గజ నిమ్మ చెట్టెయ్యి
చెట్టుకు చెంబెడు నీళ్ళు బొయ్యమ్మ
కాయల్లు గాస్తాయి పండ్లు బడతాయి
పండ్లు బండీనంత ఒక్కటే పండు
ఒక్కటే పండును అనుభవించు తల్లీ"

అని చెప్పాడు. అట్లే చేసి ఎంగమ్మ లోపలి తొనలు తిని పై "పెచ్చ" గూటిలో ఉంచింది. దానిని చాకలి వీరమ్మ భక్షించింది. ఎంగమ్మకు వీర నాగమ్మ పుట్టగా చాకలి పీరమ్మకు దుడుమన్న పుట్టాడు ఏర్లకు మొక్కితే సంతానం కలుగుతుందనే నమ్మకం ఈనాటికీ ఉంది. చనిపోయిన తన సవతికి బదులుగా ఒక చిన్న కుండను నిలుపుకొని పూజచేసే ఆచారం కొన్ని గ్రామాల్లో కనిపిస్తుంది. దాన్ని "ముత్తైదువ పటువ" అంటారు. పండుగ రోజుల్లో, శుభ కార్యాలప్పుడు ఆ పటువను అలంకరించి పీటమీద పెట్టి నైవేద్యం పెడతారు. అలా చేయడం సవతి తనను తన పిల్లలను చల్లగా చూస్తుందనే నమ్మకంతోనే.

**వివాహం :**

సాధారణంగా వివాహాలలో అరుంధతికి మొక్కే ఆచారముంది. అరుంధతికి మొక్కితే ఐదవతనం కలకాలం ఉంటుందనే నమ్మకం ప్రజల్లోఉంది. ఇక్కడ నమ్మకం ఆచారంగా మారింది. పెండ్లిళ్ళలో పట్టపగలు కూడా అరుంధతిని చూపిస్తారు. ఈ ఆచారం జాంబ పురాణంలో చెప్పబడింది.

"మొదలు ప్రతానం - తరువాతలగ్గం
ఎనుక నాగెల్లి - నాగెల్లినాడు గరిగబుడ్ల
అంబలి బోసుకుంటరు పత్తి గింజలు ఒడిలో
బోసుకుంటరు పిలగానికి కర్రుతాల్లు
ఇస్తరు - ఇచ్చిజారాటకాడికి పోతరు
అయిదు పత్తిచాల్లు బోస్తరు - ప్రతిమనిసి
ఆవంక సూర్యుని దిక్కు-మొగంజేసి
అరుంధతి, ఓ అరుంధతి - నీయంతఅలిమి
రాని, నీ అంత బలిమిరాని నిండు
ముత్తైదుతనంరాని అనినా అరుంధతికి
మొక్కుతరు"

కొన్ని కులాల్లో పెండ్లి కొడుకు, పెండ్లికుమార్తెలతో పత్తి విత్తులు నాటించే ఆచారంవుంది. అలాగే పెండ్లి కుమార్తె పెండ్లి కొడుకులమధ్య పసుపు పూసి బొట్టుపెట్టిన నాగలి కర్రును పెడ్తారు. వ్యవసాయం ప్రధానంగాగల దేశం కాబట్టి విత్తులు నాటడం, కర్రుకు పూజ చెయ్యడంవల్ల వ్యవసాయం అభివృద్ధి చెందుతుందనే నమ్మకం వారిలో ఏర్పడింది.

వధువు అత్తవారింటికి వెళ్ళేముందు కందదుంపలు, చందనపుబొమ్మలు, పసుపు, కుంకుమ, దువ్వెన, కాటుక బరిణె, నల్లపూసలు, కుడకలు, బియ్యం మొదలైన వస్తువుల్ని ఆమె ఒళ్ళో కట్టి పంపుతారు. దీనికి "ఒడిబాల బియ్యం" అని పేరు. అలంకరణ సామగ్రి సరే. కంద దుంపలు, చందనపు బొమ్మలు పెట్టడంలో ఉద్దేశ్యం ఆమె సంతానవతి కావాలని. ఇదీ నమ్మకంమీద ఏర్పడిన ఆచారమే.

**స్త్రీల కట్టుబాట్లు :**

స్త్రీలకు ఎన్నో కట్టుబాట్లు విధించి వాటిని స్త్రీధర్మాలనేపేరుతో ప్రచారం చేసిస్త్రీలను జీవచ్ఛవాలుగా మార్చారు. ఈ కల్పనలే నమ్మకాలుగా స్థిరపడ్డాయి.

అలాంటివే -

1. స్త్రీలు తాళిబొట్టుతీసివేసి గడపదాటరాదు.

2. గొడ్రాలు పిల్లల్ని తాకరాదు.

3. భర్త అనుమతిని పొందకుండా భార్య వ్రతాలను చెయ్యరాదు. అలా చేస్తే అది దేవతలకు ప్రీతికరంకాక రాక్షసులకు చెందుతుంది.

4. భర్తను దరిద్రుడని, రోగియని, మూర్ఖుడని అవమానం చేసిన స్త్రీ మరణించిన తరువాత కుక్కగానో; పందిగానో అనేకసార్లు పుడుతుంది.

ఇక కవులు ఒక అడుగు ముందుకువేసి కులస్త్రీ ధర్మాలను వివరించారు. పిల్లలమఱ్ఱి పినవీరన శృంగార శాకుంతలంలో -

చ॥ తెలవకువల్లభుండు పరదేశము వోయినవన్నెమానితా
నలితికినల్లబూసలును, నచ్చతబొట్టునుమట్టివన్నెగా
గులుమణుగైన పుట్టమునుగూడగ దువ్వనిమైలకొప్పునై
మఱువడి యింటిలో బతిసమాగమనంబమతింపుటొప్పగన్"

అంటూ "పతిభక్తిచాయలునిహము, పరముఘటింపన్" అని నొక్కి చెప్పాడు.

ఇక జానపద కవి పసుపు కుంకుమ చల్లగాఉండాలంటే భర్త బతికుండాలి, కాబట్టి భర్త ఏలకపోయినా పరవాలేదు బతికుంటే చాలు అన్నాడు.

"సీలమ్మ నీమగడు నిన్నేలడమ్మా
ఏలకుంటేమానె ఎదురుంటె చాలు
సాకకుంటెమానె సల్లగుంటె చాలు
కంసలవారిమట్టెలు కాల్నుంటె చాలు
సెట్టివారి గాజులు సేతనున్న చాలు
పరమేశుడిచ్చిన పసుపుకుంకుమలు
నొష్టకుంకుమలుంటె యిష్టాలుదీరు
పసుపు ఒంటీనుంటె భయమేమినాకు" (త్రివేణి)

అంటుంది పాపం పిచ్చి ఇల్లాలు.

నరకం అనేది ఉంటుందనే నమ్మకం హైందవుల్లో ఉంది. నరక స్వరూపాన్ని గరుడపురాణం వివరించింది. జానపదకవి ఏకాదశమాహాత్మ్యంలో స్త్రీలు ఏయేపనులుచేసి యేయే నరకయాతనలు పడతారో వివరంగా వర్ణించాడు.

"తైలము దొంగిలించిన సఖియల నెల్లా
తైలపక్వమువల్ల మాడ్తురువార్ని
ఉప్పుదొంగిలించిన యువిదల నెల్లా
యమలోక కూపాన పడవేతురువార్ని"—

ఇలాగే కారం, చిప్పు, అన్నం దొంగిలించినవార్ని కఠినంగా శిక్షిస్తా రంటూ

"ఎంగిలి ఎత్తని హీనుల నెల్లా
ఇనుప సూదులు పాతిఅలకమందురూ
పతివుండి పరపురుషులవెతికిన స్త్రీల
భగభగా మండేటి వుక్కుస్తంభమున
అదుగో నీపతియని అంటింత్రువార్ని"—

పల్లేరుకాయల్లో పొర్లించడం, కాలిన ఇనుప గుండులను మింగమనడం, కమ్మరికొలిమి తిత్తులలో కాల్చడం చేస్తారు అని వివరించాడు.

ఇది నరకంసంగతి. ఈ పాటలోనే స్త్రీతో కలసి దానంచేసిన దానమే దానమని మహర్షులు పలుకగా నమ్మి సంధ్యావళీ దేవిని మహారాజు వివాహమాడి నాడు.

ఎంగిలినీళ్ళు దోవలోచల్లరాదు. కుమ్మరి గుండయ్య కథలో కమలాక్షి అనే వేశ్య ఎంగిలినీళ్ళను వీథిలోకి చల్లింది. ఆనీళ్ళు కుమ్మరి గుండయ్య మీదపడినవి గుండయ్య ఆమెనిలా హెచ్చరించాడు.-

"దోవలో చల్లకే ఎంగిలీనీళ్ళు
దోవలో చల్లితే పెద్దలొస్తురుగా
పెద్దలైనావారు తొక్కరాదమ్మా
తొక్కితే దోషములు కొనితెచ్చినట్లు"—

ఎంగిలినీళ్ళు తొక్కితే దోషమొస్తుందనే నమ్మకం గుండయ్య కథలో చెప్పబడింది.

కొత్తకోడలు ఇంటికి వస్తే కుడికాలు ముందుపెట్టి గడప దాటమంటారు. కుడికాలు ముందుపెడితే లాభం కలుగుతుందనే నమ్మకం దేశమంతటా ఉంది. అత్త కోడలిని ఇలా మందలిస్తుంది—

"పొరుగిల్ల పోకన్న జగడమొద్దన్న
సందెకాడ దీపంబు పెట్టేటివేళ
సప్పుడు కాకుండ పెట్టిరమ్మన్న
మాపుకాడ దీపంబు మలిపేటప్పుడు
మల్లిచూడకుండ మలిపి రమ్మన్న"
ఇవన్నీ జానపదుల నమ్మకాలే.

తులసిచెట్టు హిందువులు పవిత్రమైనదిగా భావిస్తారు. తులసి లేని ఇల్లు గ్రామాల్లో ఉండదు.

తులసి - చాతుర్మాసాలు పాటలో—
"అలివేణి నీ చోటు అలికిన్నవారు
అచ్యుతుల కరుణకే అర్హులేవారు
ఇంతి నీకు ముగ్గు పెట్టన్నివారు
పద్మనాభుని కృపకు పాత్రులు గారు
అలివేణి నీ చుట్టు అలికిరెవరైన
వారికీ వచ్చునూ వైకుంఠ పదవీ
ఇంతి నీకు ముగ్గు పెట్టిరెవరైనా
ఇంతులకు వైధవ్య మెప్పటికి లేదు"

అని ఉంది. తులసీ చెట్టును పూజించే వారికి వైకుంఠం, ఐదవతనం కలుగుతా యని స్త్రీలు నమ్ముతారు.

అరటిచెట్టు గెలవేస్తే కలిగే అశుభాలు, గెలవెయ్యగానే చెట్టు కొట్టివెయ్యా లనడం, నువ్వులు గుమ్మడికాయ, ఇనుము ఊరికే తీసుకోకూడదనడం, ఆముదం చెట్టు, ముళ్ళ చెట్లు ఇంట్లో ఉండకూడదనడం, లేవగానే పత్తి చెట్టును చూడకూడ దనడం. అలాగే రావి చెట్టును నరకకూడదు. ఎంగిలి కంచాన్ని దాటకూడదు, పచ్చడి బండను కాలితో తన్నకూడదు, రోటిమీద కూర్చోకూడదు

చేటలో వడ్లు నెరపడం, కుంచం వారగా పెట్టడం, అరికాలితో నువుగింజ తాకడం చేయకూడదు. అలా చేస్తే దరిద్ర దేవత తాండవిస్తుంది. అలాగే సందె వేళ చాకిపీథికి వెళ్ళకూడదు, సానమీద చందనం అలదకూడదు. భాగ్యాన్ని కోరే వాడి ఇంట్లోకూరాడు, నీరాడు ఉండాలి.

ఉప్పు చేతికి ఇవ్వకూడదు. రాత్రిపూట సున్నం మజ్జిగ మొదలైనవి ఇవ్వకూడదు. మంగళవారం అశుభమని చెప్పడం, శనివారం కొత్త గుడ్డలు ధరించరాదనడం, శుక్రవారం ఆడబడుచును ఇంటినుంచి పంపించకూడదనడం, చేతికి ఆరువేళ్ళు ఉన్నా, మెల్లకన్ను ఉన్నా, నాలికపై మచ్చ ఉన్నా అదృష్ట వంతుడనడం మొదలైన నమ్మకాలు ఎన్నో ఉన్నాయి.

దీపం పెట్టిన తరువాత ఇల్లు చిమ్మకూడదు. సాయం సంధ్యవేళ దొడ్డి తలుపు వేసిపెట్టాలి. ఇంట్లో గోళ్ళు వెంట్రుకలు వెయ్యకూడదు, ఒంటిమీద గుడ్డ కుట్టకూడదు. శుక్రవారం డబ్బు ఎవరికీ ఇవ్వకూడదు. అలాచేస్తే దరిద్ర దేవత తాండవిస్తుంది. ఇంటి గోడమీద బొగ్గుతో వ్రాస్తే అప్పు అధికమౌతుంది.

**దృష్టి :**

ఒక వ్యక్తి చూపువల్ల మరొక వ్యక్తికి బాధ, హాని, కష్టము, నష్టము వంటివి కలుగుతాయనే మూఢనమ్మకానికి దృష్టిదోషమని పేరు. గర్భిణిస్త్రీ నడిచేటప్పుడు దారినపోయే పాము మీదనుండి గాని లేదా పాము 'జాడ' మీదనుండి గాని దాటి వెళ్ళడంవల్ల ఆ గర్భస్థ శిశువు యొక్క చూపుకు దృష్టిదోషము ఏర్పడుతుందని పెద్దలు అంటారు.

పిల్లలకు దిష్టి దియ్యడం రకరకాలుగా ఉంటుంది. అన్నం దిగదుడిచి నాలుగు మార్గాల కూడలిలో వేస్తారు. కొన్ని ప్రాంతాల్లో చిన్నపిల్లల చేతులకు దిష్టిపూసలు కడతారు. దిష్టి తగిలితే ఒక్కొపూస పగిలిపోతుందని అందువల్ల అవి ఉంటే దిష్టి తగలదని జానపదులు నమ్ముతారు. మనుషులకు జీడిగింజ, ఉప్పు, ఎండుకొబ్బరి, ఎండుమిరప, పేడనీళ్ళు చీపురు పుల్లలతో దిష్టితీస్తారు, మరికొంతమంది గుండ్రాయికి దారంకట్టి మీదినుంచితిప్పి మండేపొయ్యిలో వేస్తారు. దిష్టి తగిలితే దారం కాలిపోతుందని నమ్ముతారు. ఇంటికి వచ్చిన కొత్తకోడలికి, పురుటాలికి ఎఱ్ఱనీళ్ళు దిగదుడిచి పోస్తారు.

దృష్టిదోషం మనుషులకే కాదు చెట్లకు చేమలకు తగుల్తుందని జానపదులు నమ్ముతారు. చెట్టుకు దిష్టి తగిలితే పూతపిందె రాలిపోయి చెట్టు మాడిపోతుంది. పశువులకు తగిలితే పాలు తగ్గిపోవడం, వేడిచేస్తే విరిగిపోవడం

జరుగుతుంది. పెరటిచెట్టుకు దిష్టి తగలకుండా వెంట్రుకలు కట్టి సున్నం నీళ్ళు చల్లుతారు. పిందెలు రాలిపోతే వాటిని పచ్చని ఆకులలో చుట్టి మూడు బాటలవద్ద విడిచి చుట్టూ బూడిద పోస్తారు. తోటలవద్ద, కొత్త భవనాలవద్ద దిష్టిబొమ్మలు పెడతారు. ఇలాచేస్తే దృష్టిదోషం పోతుందని వారి నమ్మకం.

ఈనిన పశువుకు దిష్టి తగలకుండా మెడకు పాత తోలుచెప్పు, జీడిగింజె, గవ్వ, గొంగడిసుంచు మెడకు కడతారు. "నరునిచూపుకు నల్లరాయైనా పగులు తుంది" అనే సామెత కూడా ఉంది.

**శకునాలు :**

మానవాతీతమైన శక్తులు శకున రూపంలో ఉంటవనే భీతి మూఢ విశ్వాసానికి మొదటి కారణం. ఈ శకునాలు ఎక్కువగా ప్రయాణానికి సంబంధించినవి. ఇవి శాస్త్రీయంగా విశ్వసించలేని నమ్మకాలు. అవైజ్ఞానికాలు కాబట్టి మూఢ నమ్మకాలు.

కామమ్మ కథలో ఆమె అత్తవారింటికి బయలుదేరగా "ఇల్లాలుతుమ్మెను. రెండిళ్ళ సందున పిల్లి అడ్డమయ్యెను, నంబితంబళ్ళ వాడెదురు పడెను. నాగుపాముల జోడు, కొత్తకుండల కావడి అడ్డమొచ్చినవి." అట్లే కాకమ్మకు వచ్చిన కలలన్నీ చెడ్డ ఫలితాన్ని సూచించేవే. మారయ్య బ్రహ్మలోకానికి పోయినట్లు చూడరాని భూమి చూచినట్లు, అగ్నిగుండంలో దుమికినట్లు, అర్తి పూసలదండ తెగి నేలపడ్డట్లు, నొష్ట కుంకుమ నేల రాలినట్లు కామమ్మకు కలలు వచ్చినవి. ఈ కలలన్నీ జరుగబోయే మారయ్య మరణానికి సూచనలు.

శుభ సూచకాలగు శకునాలు కూడా ఉన్నవి. పాలుపొంగితే ఐశ్వర్యం పొంగుతుందని నమ్ముతారు. దువ్వెన దువ్వుకుంటుండగా జారిపడినా కాకి అరచినా, పొయ్యి అరచినా చుట్టాలు వస్తారని నమ్ముతారు.

ఎండకాస్తున్నప్పుడు వానకురిస్తే కుక్కల, నక్కల పెండ్లి అవుతుందని, కప్ప గడప తొక్కినా కప్ప ఎగిరి పడినా వానరాకతో శుభం కలుగుతుందని జానపదులు నమ్ముతారు. అందుకే,

"కప్ప గడప తొక్కినాదీ
శుభము చూరు చెప్పినాదీ
కప్పలెగిరే వానలమ్మా
పొలములో కనకమే పండునమ్మా"—

అని జానపదుడు పాడుకుంటాడు. నీటి మీద చేపలు ఆడుతుంటే, తూనీగలు ఎగురుతుంటే వానవస్తుందనే నమ్మకం జనుల్లో ఉంది.

పల్నాటి వీరచరిత్రలో కోడిపోరు సందర్భంలో "బ్రహ్మనాయని విజయ మగునేని సంపూర్ణముగా నాదమొప్పార కూయమని చిట్టిమల్లును" పరివారం కోరింది. అది మొదట అట్లే కూసి తిరిగి రెట్టించి కూయమనగా ఉత్సాహము మాని ఒడలు స్రుక్కించి హీనస్వరముతో కూసెను. దానిని బట్టి తొలిపందెములో విజయము కలుగునని మలిపందెము జరిగినచో పరాజయ హేతువనీ నమ్మారు.

"బ్రహ్మన్న పక్షమువారు పోరుకాయత్త పడుచుండగా దేవుని మెడలోని తోమాల తెగి కింద పడెను. ఎదుట నెత్తుకొని వచ్చుచున్న నిండుకడవ విచ్చెను. శవమొకటి సరినడకల ముందుకు సాగెను. చెట్టుమీద పులుగెగసిపోయెను. వంట కట్టెలబండి పడి దొర్లిపోయెను. కోడె లేగలు కోరాడెను. నక్షత్రములు చుట్టి వచ్చెను. నక్కలు కూసెను."

రాత్రిపూట కుక్క ఏడుస్తే అశుభం, బల్లి పలికితే శుభం, గుడ్లగూబ ఇంటిమీద వాలితే అశుభం. ఇలాగే జంతుజాలానికి సంబంధించిన నమ్మకాలన్నీ కొటుంబికాలే.

"కానరాని గట్లమీద మన ఇద్దరికీ తలంబ్రాలు
బాయిలోన బల్లి పలికె బన్న సరము కొలుకులూసె"

శుభ సమయంలో బల్లి పలికితే అశుభమని ముఖ్యంగా పెళ్ళి పందిట్లో పలికితే వధువు విధవయై పోతుందని, మాటల సందర్భంలో బల్లి పలికితే ఆ మాట తప్పక జరుగుతుందని జానపదుల నమ్మకం.

బొబ్బిలి యుద్ధంలో మల్లమ్మదేవి మరది వెంగళరాయుడు మరణించగా గోపాలస్వామికి దీపారాధన చేసి శకునమడిగింది. ఆ స్వామి అన్నీ అపశకునాలే చెప్పినాడు.

"నొష్టయున్న తిరుమణిరేఖ నేలను బడినది.
మెడలోయున్న పూలహారముతెగి నేలను బడినది.
యెదుటయున్నయఖండదీపము గప్పునయారెను.
తూర్పున యున్న గోపాలస్వామి పడమట తిరిగెను.
పడమటయున్న గాలిగోపురంపటపట పగిలింది.
కానరాని చీకటి యిపుడు కమ్మెను గుడిలోన"

ఈ అపశకునాలన్ని బొబ్బిలి వారి పరాజయాన్ని మరణాన్ని సూచించాయి.

కాళింది మడుగుపాటలో బాలకృష్ణుడు నదిలో దూకినపుడు—

"ఆవేళ మందలో అపశకునమాయె
పెక్కులుతోచె నందాదులకును
పగలు చుక్కలు పొడిచె గ్రద్దలవి యుగిరె
కాకులు మూకలై కూయంగ దొడగె
కుడికన్ను అదరెనే యశోదకపుడు
నందగోపుని ఎడమ బాహువూ అదరె"—

అంటూ అపశకునాలను వివరించాడు. ఆడవారికి కుడివైపు మగవారికి ఎడమవైపు అదిరితే అపశకునం. కుడినుండి తుమ్మడం, అన్నము చేదవడము విడెము వేసుకుంటే పులమారడం మొదలైనవన్నీ అపశకునాలే.

లక్ష్మణమూర్ఛలో లక్ష్మణుడు మూర్ఛపోతే నంది గ్రామంలో భరతునకు

"అనుజుడు లక్ష్మణుడు అడవి లోపలను
తలకు చమురు చేత తడవుకొని కృశియించ
మొదలంట బురదలో మునిగి దుఃఖమున
కష్టంబు పడుచున్న కడుచెడ్డ స్వప్నములు"—

కలిగెను. తలకు నూనె యంటినట్లు కల రాకూడదని యిప్పటికి జనుల విశ్వాసం.

శాంతగోవింద నామాలు అను పాటలో దశరథుడు భార్యలతో కలసి శాంతనడుగ బయలుదేరినపుడు—

"రామచిలుకలు రెండు ప్రేమతో యెదురయ్యె
వేశ్యాస్త్రీలు వచ్చి సురాభాండములు వచ్చె
గరుత్మంతుడు వచ్చె"—

ఇవన్నీ శుభశకునాలని జనుల నమ్మకం.

**మరణం :**

మరణానికి సంబంధించిన కల్పనలు వాటి ఆధారంగ ఏర్పడిన నమ్మకాలు అనేకం. శవంకాళ్ళను స్మశానంవైపు పెడ్తే శవందయ్యమై తిరిగిరాదని జనుల విశ్వాసం. శవాన్ని తీసుకువెళ్ళేటప్పుడు మధ్య దించుతారు. దీన్ని దింపుడుకల్లం అంటారు. మరణించినవ్యక్తిలో ఏమన్నా జీవం ఉందేమో మళ్ళీ బతుకుతాడేమో అనే నమ్మకం అలా చేయిస్తుంది. ఈ నమ్మకం ఆఫ్రికా దేశంలో కూడా ఉంది. స్మశానానికి తీసుకువెళ్ళేటప్పుడు మధ్యలో శవాన్ని మూడుసార్లు దింపడం వారిలో ఆచారం. తిరిగి బతుకుతాడేమో అనే నమ్మకమే ఆచారంగా మారింది.

శవం ఎదుట పడకూడదనడం, శవాన్ని తాకరాదనడం ఇవన్నీ అశుభం కలుగుతుందేమో అనే అనుమానంతో ఏర్పడిన నమ్మకాలు. కొన్ని గ్రామాల్లో శవంవెంట వెళ్ళినవారు శవంమీద ఒకరాయిని, ఆకును పెట్టి నమస్కారం చేస్తారు. పలుగురాయిని దేవతగా గ్రామీణులు భావిస్తారు అందువల్ల శవం దయ్యమై రాకుండా దేవత చూస్తుందని వారి మూఢవిశ్వాసం.

భర్తమరణిస్తే పదవరోజు భార్యను వితంతువుగా చేస్తారు. ఆరోజు ఆ స్త్రీని ఊరి చెరువుగట్టుకు తీసుకువెళ్ళి ఆ తతంగం నిర్వహిస్తారు. ఆమె ఇంటి నుండి బయలుదేరగానే ఇంట్లోని ముత్తైదువలు చిన్న పసుపు దారాన్ని మంగళ సూత్రాలకు కట్టుకుంటారు. ఆ స్త్రీ ఇంటికి తిరిగి వస్తున్నదనగానే ఆ దారాన్ని

విప్పివేస్తారు. ఆమెకు చూరమైన పసుపు కుంకుమలు తమకు రావాలని దారం కట్టుకొని, ఆమె వైధవ్యం తమకు రాకూడదని దారం విప్పడం చేస్తుంటారు. ఇక్కడ మూఢ విశ్వాసమే ఆచారంగా మారింది.

కనుము పండుగనాడు పుట్టింటి క్షేమంకోరి స్త్రీలు "కాకి పిడచలు" అనే వ్రతం చేస్తారు. మంత్రరహితమైన శ్రాద్ధ కర్మమిది. ఇది నమ్మకం మీద ఏర్పడిన ఆచారమే.

**సహగమనం :**

ఈ ఆచారం మధ్య ఆసియానుంచి భారతదేశంలో ప్రవేశించి ఉంటుందని పాశ్చాత్య పరిశోధకులు చెప్పారు. సర్వోక జాతివారిలో, ఇండో - జర్మానిక్ జనుల్లో ఈ ఆచారం ఒకప్పుడు ఉండేది. వితంతు బలి అనేక ఆఫ్రికా జాతులలో ఉంది. రెడ్ ఇండియన్స్‌లో కూడా ఈ ఆచారం ఉండేది. కాని పతిచితిపై సతిశయనించి దట్టమైన పొగరాగానే అందులోనుంచి ఆమె తటాలున తప్పించుకొని బయటికి వచ్చేది. చైనా దేశంలో భర్త చనిపోతే ఆత్మహత్య చేసికొనే స్త్రీ అందరిచే ప్రశంసింపబడేది.

బానిసలను ఉంపుడు కత్తెలను ప్రత్యేకమైన చితిపై దహించేవారు. స్త్రీ బానిసలు రాణులతో కలసి చితిమంటలో పడేవారు. పంజాబులోను, రాజస్థాన్‌లోను ఒక్కొక్కప్పుడు కొడుకు చితిపై తల్లి ప్రవేశించేది. ఆ రోజులలో మాతృ సహగమనం ఉత్కృష్టమైనదిగా పరిగణింపబడేది. అక్కచెల్లెండ్రు సోదరుని చితిలో కలిసే ఆచారం ఉండేది.

గుజరాత్‌లోను రాజస్థాన్‌లోను యజమాని చితి కాలుతుండగా భక్తితో బానిసలు అందులో ప్రవేశించేవారు.

ప్రాణాలు ఉండగానే భూమిలో పాతిపెట్టడం కూడా సహగమనంగా పరిగణించేవారు. నీటిలో మునగడం కూడా సహగమనాచారంగా భావించేవారు. చితి మంట నుండి తప్పించుకొన్న స్త్రీని బలవంతంగా నీటిలో ముంచి చంపేవారు. పశ్చిమ భారతదేశంలో కొన్ని ప్రదేశాలలో గడ్డి గుడిసెలో భార్య

కూర్చొని, భర్త శరీరాన్ని కూడ చేతపట్టుకొని ఎడమచేతిలో కాగడా నుంచుకొని అగ్ని ముట్టించేది.

చితిని చాలా ఎత్తుగా అమర్చేవారు. అగ్నిలో ఆహూతయ్యే స్త్రీ ఆర్తనాదం వినడం అశుభమని నమ్మేవారు. అందుకే చితి మంటలు లేచేటప్పుడు జనులు "అంబకు జయమగుగాక" అని అరచేవారు. బాకాలు ఊదేవారు, మద్దెళ్ళు వాయించేవారు. చితి ముగిసేవరకు ఈ చర్య జరుగుతూనే ఉండేది. సహగమనం చేస్తానని పలికిన స్త్రీ తన నిశ్చయం నుండి మరలితే ఆమె బంధు వర్గానికి దారుణమైన అరిష్టం దాపురిస్తుందని నమ్మేవారు.

ఒక స్త్రీ సహగమనం చేయడంవల్ల భర్త ఎన్ని పాపాలు చేసినా అతడు పుణ్యలోకాలకు వెళతాడనే నమ్మకాన్ని ప్రజల్లో పురాణాలు, స్మృతులు కల్పించాయి.

ఈ సతీసహగమనం వేదకాలంలో బీజ రూపకంగా కనిపిస్తుంది. ఋగ్వేదంలో—

"ఓ నారీ! చనిపోయిన నీ భర్త వద్ద పరుండి యున్నావు. అచట నుండి లెమ్ము. బ్రతికియున్న వారికడకు రమ్ము. నీ పాణిని గ్రహించి నిన్ను వివాహం చేసుకొనగోరినవారితో నీవు భార్యాత్వము పొందుము" అని వుంది. భర్త శవం పక్కన భార్యను పరుండబెట్టి పై మంత్రం చదివి మరలా లేపడం జరిగేది. కాని తరువాతికాలంలో భర్తతోపాటు భార్యను కాల్చడం ఆచారంగా స్థిరపడింది.

శ్రీనాథుడు కాశీఖండంలో—

"ఎన్నికకు రోమకూపంబు లెన్ని కలవు
దివ్య వర్షంబులన్ని మోదించు సాధ్వి
నాక భువనంబునందాత్మ నాథు గూడి
వెఱ పొకింతయు లేక చిచ్చుఁజొచ్చెనేని" -అన్నాడు.

ఈ విధంగా స్వర్గలోకాలను ఎరగా చూపి స్త్రీలను సహగమనానికి ప్రోత్సహించడం జరిగింది. ఆచారం పేరుతో పురుష సమాజం ప్రవేశపెట్టిన సహగమనమనే మూఢవిశ్వాసాన్ని ఆనాటి స్త్రీలు ఉత్తమ ధర్మంగా విశ్వసించారు.

జానపద సాహిత్యంలో కామమ్మ, బాలసన్యాసమ్మ, కాటమరాజు కథ, పల్నాటివీర చరిత్ర, దేశింగురాజు కథ మొదలైన గేయ గాథలలో సహగమనం చెప్పబడింది. దీన్ని జానపద కవి "సాగుమానం" అన్నాడు.

కామమ్మ కథలో కామమ్మ భర్త మారయ్య చనిపోతే గుండానికి దొర గారిని శలవు అడిగింది. దొర

"నీకు నిప్పులో పడియేటి మర్యాద యేమీ
నీకు మంటలో పడియేటి మర్యాద యేమి" అని ప్రశ్నించగా—

"నాకు పట్టడే బొట్టుంటె పది లక్షలయ్యా
నేను పసుపు కుంకుమ లేక ఘడియుండ లేనూ"

అని పలికింది. దొర మారు మనువు చేసుకోమన్నాడు. "మారు మనువుల పెండ్లి మా యింట లేదు" అని పలికి అనేక సత్యాలు చూపి దొర అంగీకారాన్ని పొందింది. చివరకు

"కాలేటి సూర్యుడా దండ మన్నాది
నేను తొక్కిన రా దేవి తోడుగావమ్మా భూదేవి
వేడుకతొ వెంకటేశ్వరుని మదిన దలంచి
ప్రీతితో భీమలింగానికి మ్రొక్కి
చూచేటి ప్రజలకెల్ల దండమన్నాది
దొరలంత గట్టున నిల్వబడ్డారే దొరలంతా
అందరికి ఒక్కటే సలాము చేసె
గుప్పించి ఆ తల్లి గుండాన దూకె
అప్పుడు మంటలో ఒక జాము మాటలాడింది"

బాల సన్యాసమ్మ కథలో సన్యాసమ్మ సహగమనం చేసింది.

కాటమరాజు కథలో అగుమంచి

"పున్నెపు నీరాడి పొలతి వేవేగ
అన్నలిచ్చిన సొమ్ములు ఆభరణములు

ధరియించి అగుమంచి తల్లికి మ్రొక్కి-
పరిజనులతో గూడి బాజార్లవెంట
తిరువీధులూరేగి తెరువు నచటచట
తన వంటి సొమ్ములు తరుణులకిడుచు
అగుమంచి గుండాని కాయత్తమాయె
మంటలు మండెను మింటి పొడవునకు
పంతమున వచ్చేను బాలరాజుల చెల్లెలు
వచ్చి చంపుడుకట్ట వరుసతో నెక్కెను
హస్తములు ముకుళించె సభవారికపుడు
గుప్పున అగుమంచి గుండాన దుమికె
చమురు కుండలు వేసి సఖియలు ఆడలిరి
పొగులుచు వెలవెలపోయి రందరును
గంధపు మ్రాకులు కడకును కదుల
పొందుగా కూర్చిరి ప్రోగుగానపుడు
చందన గంధియు సమసి మసియాయె"

ఇలా సహగమనం చేసింది.

నిప్పులో దూకడానికిముందు సతి గుడ్డలో కొంచము బియ్యం మూటగట్టి తమలపాకులతోపాటు నిప్పులోవేస్తుంది. దైనందిన జీవితంలో తన అలంకరణకు ఉపయోగపడే అద్దం, దువ్వెన కూడ చితిలో పడవేస్తుంది. అవి మరణించిన తరువాత మగనిచెంత అలంకరించుకోవడానికి ఉపయోగపడతాయని నమ్ముతారు. ఇల్లాలు పసుపువన్నె చీరకట్టి తలకు దట్టంగా నూనె పులుముకొని చితిలో దూకేది. కొన్నిచోట్ల భర్త దేహంతోపాటు భార్యనుకట్టి దహనంచేసే వారు. కొందరు అభాగినులకు ఒళ్ళు తెలియకుండా మత్తుమందు ఇచ్చేవారు.

సమీప బంధువులలోగల ఆస్తిమీద దురాశ, పోషించాలనే బాధ మొదలైన స్వార్థపుటాలోచనలవల్ల వితంతువును సహగమనానికి పురికొల్పేవారు.

b) సమాజపరమైన నమ్మకాలు :

వ్యక్తి సమాజంలో ఒక భాగం. వ్యక్తిగతమైన నమ్మకాలను సమాజంలో చాలామంది ఆచరిస్తే అవి సమాజపరాలౌతాయి. మానవాతీత శక్తులవల్ల రోగాలు సంక్రమిస్తాయని నమ్మేవాళ్ళు చాలామంది ఉన్నారు. దెయ్యాలు భూతాలవల్ల అనేక కష్టాలు సంభవిస్తాయని వాటిని పోగొట్టుకోవడానికి తాయెత్తులు కట్టుకోవడం, ఆంజనేయదండకం చదవడం, మాంత్రికుల సహాయం అర్థించడం చేస్తుంటారు. చెప్పులు చేతుల్లో ఉంటే దయ్యాలు దగ్గరకు రావని, యజ్ఞయాగాదుల్లో జాతరల్లో బలి ఇస్తే రోగాలు పోతాయనే నమ్మకంవల్లనే అనేక పరిణామాలు సంభవించాయి. దేవుడు దేవతలు ఒంటిమీదికి వచ్చి కోరికలు కోరడం మొదలుపెట్టారు. తాయెత్తు ఆపదలను, అరిష్టాలను అరికట్టకలదనే విశ్వాసం ఆదిమ సంఘాలలో వ్యాప్తి చెందింది. కొండజాతివారు మంత్రించిన మూలికను తాయెత్తుగా ధరిస్తారు. కొందరు కూట చతురస్రాలు, సూర్యరథ చక్రము స్వస్తిక్ వంటి సాంకేతిక చిత్రాలను తాయెత్తులుగా ధరిస్తారు. సాధారణంగా బీజాక్షరాలు రాసిన రాగిరేకును తాయెత్తుగా ధరించడం ఈ నాటికీ కనిపిస్తుంది.

జానపదుని జీవితంలో పండుగలు వ్రతాలు జాతరలు ఉత్సవాలు భాగమైపోయాయి. వీటిలో కొన్ని సంతోషం కోసం ఏర్పడ్డవైనా, మరికొన్ని మూఢనమ్మకాలకు, మూఢాచారాలకు నెలవులు. ఇవి సామూహికంగా ఆచరింపబడేవే.

పోలేరమ్మ జాతర జరిపేటప్పుడు పొలి అన్నాన్ని చాటలో పెట్టుకొని గ్రామం చుట్టూ చల్లుతారు. ఆ అన్నం పొరుగూరివారు తీసుకుపోతే ఉత్సవ ఫలితం వారికే దక్కుతుందని నమ్ముతారు. అందుకే పొలి అన్నం ఊరుదాటకుండా చూస్తారు.

పొలాల అమావాస్యకు ముందు పట్టేనోములో పిలకలతో ఉన్న కంద దుంపను పసుపురాసి బొట్టుపెట్టి స్త్రీలు కొలుస్తారు. తోరానికి పసుపుకొమ్ములు కట్టి ముత్తైదువులు మెడలో వేసుకొని

"శక్తి దప్పినా భర్త తప్పరాదు
వాక్కు దప్పినా వరము దప్పరాదు
అక్షతలు దప్పినా ఐదువతనము తప్పరాదు"

అని పలుకుతారు. ఈ వ్రతంచేస్తే ఐదవతనం ఉంటుందని వారినమ్మకం. ఇది సామూహికంగా చేసేవ్రతం.

**వ్యవసాయం :**

వ్యవసాయానికి సంబంధించిన నమ్మకాలనేకం. నూటికి 90 పాళ్ళు జానపదులు వ్యవసాయానికి సంబంధించినవారే.

ఇంటికి ఆడపడుచువస్తే గృహలక్ష్మి కాబట్టి ఆమెచేతనే విత్తనాలుకలిపించి విత్తనపు కడవ నింపి అది నెత్తికెత్తి పొలంలో తొలివిత్తనం ఆమెచేతనే వేయిస్తారు. ఇలాచేస్తే శుభమని, పంటలుబాగా పండుతాయని వారి నమ్మకం. కొన్ని ప్రాంతాల్లో విత్తనాల కుండలో బంగారు వస్తువు పెడతారు. అలా బంగారం పెట్టడంవల్ల చేను బంగారంలా పండుతుందని భావం. పంటవచ్చిన తరువాత ఆడబిడ్డగంప ఇవ్వడం కూడా అనవాయితీయే.

వరికుప్ప నూర్చిన తరువాత పంట ఇంటికి చేరవేయడానికి వీలులేనప్పుడు ధాన్యం రాశి పోసి ఆ రాశిచుట్టూ పిడక బూడిద పోస్తారు. దీన్ని పొత్తి పోయడం అంటారు. అలా చేయకపోతే శక్తులు వచ్చి రాశిని ఎంగిలి చేస్తాయని అందువల్ల 'బర్కతు' ఉండదని నమ్ముతారు. మరునాడు పొత్తికి కొబ్బరికాయ కొట్టందే అందులో చేయి పెట్టరు. కొంతమంది కోళ్ళనుకూడా కోస్తారు. ఈ ఆచారం గృహాల్లోకి కూడా విస్తరించింది. బాలెంత చాప చుట్టూ, మశూచి సోకిన వారి చుట్టూ పొత్తి పోయడం కూడా కనిపిస్తుంది. దుష్టశక్తులను నిలువరించే నమ్మకమే దీనికి కారణం. ఈ నమ్మకం వెనుక శాస్త్రీయమైన దృష్టి ఉంది. బూడిద ఉంటే చీమలు మొదలైన క్రిములు చేరవు. అందువల్ల ధాన్యం రాశి భద్రంగా ఉంటుంది.

కొన్ని ప్రాంతాల్లో—
"కోతగాడు కోతగాడు నా పైరు
ముట్టకు అంటకు నా పైరు

గుడ్డిదానవైపో ఎలకమ్మా
దూరకు దూరకు నా యిల్లు
దూరాలంటే ఒక యిల్లు
ఊరంతా యిల్లూ పాతల్లూ"-

అంటూ చేనుచుట్టూ తిరుగుతూ ఎలుగెత్తి పాడుతుంటే ఎలుకలు చేలనుంచి పారి పోతాయని కర్షకుల నమ్మకం. బహుశా చప్పుడుకు భయపడి పారిపోతాయేమో. ఎందుకంటే పిట్టల్ని పారద్రోలడానికి డబ్బాలు కొట్టే అలవాటు ఉంది.

తోటలకూ, పాదులకూ, మొక్కలకూ పచ్చపురుగులు పడ్తే రైతులు శ్రీవత్స గోత్రపు బ్రాహ్మణుని దగ్గరకు వెళ్ళి తాటాకుమీదగాని కాగితం మీద గాని—

"శ్రీవత్స గోత్రము వారి సింహము వచ్చినది
పచ్చపురుగల్లార విచ్చిపొండు"

అనే మంత్రాన్ని రాయించి, రాసిన పత్రాలకు పసుపురాసి సాంబ్రాణి ధూపము వేసి పచ్చపురుగులున్నచోట కడతారు. అలాచేస్తే పచ్చపురుగులు విచ్చిపోతాయని వారి నమ్మకం. దీని వెనుక శాస్త్రీయమైన దృష్టి ఉండవచ్చు.

విజయదశమి వెళ్ళిన తరువాత రెండుమూడు రోజులు పశులకాపర్లు నూవుల కట్టెతో గాని కందికట్టెతోగాని చొప్పతోగాని సుమారుపది అడుగుల పొడవుగల కట్టలను కట్టారు. వాటిని "కొట్టంగోల" అంటారు. రాత్రిపూట ఈ కొట్టంగోల కొనలకు నిప్పంటించి రెండవ కొనను చేతపట్టుకొని వారి పశువుల మీదుగా తిప్పుతూ-

"కొట్టంగోల కోడిగుడ్డు కోల
మాపసు పిడుదులన్నీ మీతాతను పట్టా"-

అనిపాడుతూ వీధులవెంట తిరుగుతూ ఊరిబయట పారవేస్తారు. అలాచేస్తే పశువులకు పట్టే పిడుదులు, జోరీగలు, దోమలు వాటిని విడిచిపోతాయని వారి నమ్మకం.

కలుపుబోనం, అలుకుబోనం అని జానపదులు నిర్వహించే ఆచారాలు వ్యవసాయానికి సంబంధించినవే. కలుపు పట్టేముందురోజు, అలుకుజల్లే ముందు రోజు నిండుకుండ అన్నం, పసుపు, కుంకుమ పొలందగ్గరకు తీసుకువెళ్ళి మడి మడువ దగ్గరమూడు పలుగురాళ్ళుపెట్టి పూజచేసి ఆకులో అన్నంపెట్టి నైవేద్యం చేస్తారు. మిగిలిన అన్నాన్ని మళ్ళలో చల్లుతారు. ఈ పలుగురాళ్ళు గ్రామదేవతకు ప్రతీకలు. అలాచేస్తే తమకార్యక్రమం నిర్విఘ్నంగా సాగుతుందని వారినమ్మకం.

అలాగే వరిఆకులకు "సల్లతెగులు" దగిలినప్పుడు పెరుగన్నం పలుగు రాళ్ళకు నైవేద్యంపెట్టి మళ్ళలో చల్లుతారు. ఆకులకు సల్లతెగులు తగులుతే అమ్మ వారు పోసినట్లు భావిస్తారు. పెరుగన్నం అమ్మవారికి నైవేద్యంగా పెట్టే ఆచారం నగరాలలో కూడా కొన్ని ఇండ్లలో ఉంది. స్ఫోటకం రాకుండా ముత్యాలమ్మకు 'చలేపారం'; 'వేడేపారం' పెడతారు. అంటే చద్ది అన్నం, వేడి అన్నం పెరుగులో కలిపి నైవేద్యంగా పెడతారు.

సాధారణంగా గ్రామాలలో పొలం గట్లమీద, చెరువు కట్టమీద చిన్న చిన్న గంగమ్మ గుడులు కనిపిస్తాయి. అలా ఉండడంవల్ల పంటలు బాగా పండు తాయని వారి నమ్మకం. గ్రామ దేవతలకు పశుబలి ఇచ్చి వాటి రక్తము కలిపిన అన్నం తమ ఇండ్లకు తీసుకువెళ్ళి ఇంటి నాలుగు మూలల, పశువుల మీద చల్లు తారు. ఇలా చేస్తే రాబోయే సంవత్సరం వరకు ఆ గ్రామంలో ఎట్టి అరిష్టాలు కలుగవని వారి నమ్మకం దీన్ని పొలి జల్లడం అంటారు.

చేనుకు నరబలి ఇవ్వడం పర్వతాల మల్లారెడ్డి కథలో కనిపిస్తుంది. మల్లారెడ్డి తండ్రి చేనుకు వేటను బలి ఇచ్చి—

"ప్రతి సంవత్సరం చేను యిటు పండితేను
ప్రతి సంవత్సరం నర పొలి యిచ్చెదను—"

అని మొక్కుకుంటాడు. తరువాత కొడుకును చేనుకు బలి ఇచ్చాడు—

"మొక్కిన విడువక గొంతుకోసినాడు
దోసిట్లో రక్తము పట్టినాడు
కొత్త చేనులో పొలి చల్లినాడు
నాల్గు తుంటలు శవమును నరకినాడు
కొత్త చేనులో పూడ్చిపెట్టినాడు"

కొందరు ఆటవికులు పంటకు చిన్న పిల్లలను బలియిచ్చి, ఆ ముక్కలను గాదెలలో దాచిన పంట అక్షయంగా పండుతుందని నమ్ముతారు. మనుష్య రక్తం చిందనిదే పసుపు కొమ్ములకు చిక్కని యెఱ్ఱరంగు రాదని ఖోండ్‌ల నమ్మకం.

నెల్లూరు జిల్లాలో జరిగే, లేబూరు కంకాళమ్మ జాతరలో ఊరవతల పొలంలో బండి చక్రాన్ని వేస్తారు. ఏ వైపు ఆ బండి చక్రం పడితే ఆ వైపు బాగా పండుతుందని నమ్ముతారు.

కొత్తగా పశువులను కొంటే ఇంటికితెచ్చి పసుపు కుంకుమ కలిపిననీళ్ళు వాటికాళ్ళపైపోసి ముందు కుడికాలుపెట్టి గడపదాటిస్తారు. అలా చేస్తే పశువులు ఆ ఇంట్లో చాలాకాలం ఉంటాయని నమ్ముతారు. ఎడమకాలు పెట్టిన పశువు ఎక్కువకాలం ఉండదని భావిస్తారు.

**వర్తకం :**

వర్తకులు వ్యాపారాన్ని ప్రారంభించడానికి ముందు అంగడిలో నేలపై ఉప్పునీరు చల్లుతారు. అలా చేయడంవల్ల వ్యాపారం బాగా అభివృద్ధి చెందుతుందని వారి నమ్మకం. ధాన్యం కొలిచేటప్పుడు ఏడుసంఖ్యను పలకరు, ఆరున్నొకటి అంటారు. సాధారణంగా 7, 13 మంచి సంఖ్యలు కావని భావిస్తారు.

వర్తకులు దీపంపెట్టిన తరువాత పసుపు, కుంకుమ అమ్మరు. అలాగే శుక్రవారంనాడు అప్పులివ్వరు.

**వైద్యం :**

జానపదుల్లో ఆచరించే వైద్యవిధానాలలో పసరుల వాడకం, కాల్పులు వేయడం, విభూదులు, రక్షరేకులు కట్టడం, దేవతలకు ముడుపులు చెల్లించడం, బలులివ్వడం అమలులో ఉన్నాయి. పొంగుజ్వరం, ఆటలమ్మ, మశూచి మొదలైన వ్యాధులు అమ్మవారి ఆగ్రహానికి కారణాలుగా వచ్చినవని భావించి ఆ దేవతకు నైవేద్యాలు బలులు ఇవ్వడం చేస్తుంటారు.

కొన్ని వ్యాధులకు, కొన్ని నరాలనుకాల్చే పద్ధతి జానపదుల్లో వుంది. పొట్టపై చిన్నప్పుడే సూదికాల్చి చురకలు వేస్తారు. వాతలువేస్తే ఆ వ్యక్తికి శాశ్వతంగా కడుపునొప్పి రాదని నమ్ముతారు. చెడ్డకురుపువేస్తే చుట్టకాల్చి వాతపెడతారు.

కాలిలో ముల్లు గుచ్చుకుంటే ఆ ముల్లుగల చెట్టు ఆకుల పసరుపోసి రుద్దితే ముల్లు గుచ్చుకున్న నొప్పి తగ్గుతుందని నమ్ముతారు.

ముఖ్యంగా వైద్యం నమ్మకంమీద ఆధారపడి ఉంటుంది. వైద్యంమీద నమ్మకముంటేగాని అది పనిచెయ్యదు. కొన్ని రత్నాలు ధరిస్తే రోగాలు రావనే నమ్మకం ఉంది. అలాగే భూతబాధ తొలగించడానికి మంత్రంచదివి నెమలి ఈకతో తుడిస్తే, వేపరెమ్మలతో కొడితే వెళ్ళిపోతుందని జానపదులు నమ్ముతారు. తుమ్మపువ్వు, ప్రియంగుపుష్పం, మారేడువేరు, దేవదారుపుష్పం మెత్తగా నూరి ధూపంవేస్తే దయ్యాలు, భూతాలు, గ్రహాలు శాకినీఢాకినీ రాక్షస పిశాచ గణాలు పారిపోతాయని నమ్మకం. పుష్యమీ నక్షత్రంతో కూడిన ఆదివారం తెల్లగుంటి విండ వేరు పెరికి తెచ్చి చంటి బిడ్డ మెడకు కడ్తే పిశాచాల బాధ ఉండదని నమ్ముతారు.

ఆదివారం తెల్ల గన్నేరు వేరు తెచ్చి కుడి చేతికి కట్టుకుంటే అగ్ని భయం ఉండదని నమ్ముతారు. నల్లిని చంపి వాసన చూస్తే తల నొప్పి తగ్గు తుందట.

ఆ యా వృత్తులకు సంబంధించిన నమ్మకాలు జానపద సాహిత్యంలో అనేకం. వృత్తుల పుట్టుకకు సంబంధించి ఆ యా వృత్తుల వారిలో కొన్ని నమ్మకాలు ఉన్నాయి.

**బలిజలు :**

పార్వతీదేవి పరమశివుణ్ణి సంతోషపెట్టడానికి తగిన అలంకారాల కోసం బ్రహ్మ హోమం చెయ్యగా అందులోనుంచి గాజులు, పసుపు, గంధం, నల్లలు, దువ్వెన, తాటికమ్మలు వాటి వెనుక కంచర గాడిద, బలిజ యువకుడు జన్మిం చాడు. కంచర గాడిదపై అలంకరణ సామగ్రిని వేసుకొని అమ్ముకుంటూ ఉంటాడు బలిజ యువకుడు అందుకే బలిజల వివాహ సందర్భాలలో గాడిద పోలువేస్తారు.

**గొల్లలు :**

కొమిరెల్లి మల్లన కథలో కురుమల పుట్టుకను గురించిన అంశాలున్నాయి. ఈ కథలో పుట్టలోనుండి వెల్వడిన బూరు క్రిములను (గొర్రెలు) చూచి మల్లన భయపడగా ఈశ్వరుడు సాక్షాత్కరించి గొర్రెలను పెంచిన సంపద అభివృద్ధి చెందుతుందని గొర్రెల సంరక్షణను కుల వృత్తిగా చేసుకొమ్మని ఆజ్ఞాపించాడు.

బీరప్ప పండుగలో బీరప్పభార్య కామరతికి చెల్లెలు మహంకాళికి ఒడి బియ్యం పోస్తారు. దేవతలకు ఒడి బియ్యం పోయడంవల్ల పాడి పంటలు అభివృద్ధి చెందుతాయని నమ్ముతారు.

కురుమలకు 'గౌడ' అను బిరుదు చేరడానికి ఒక కథ ఉంది. కురుమల దేవుడు బీరప్పకు కల్లు తాగాలని కోరిక కలిగి తన మీసాన్ని కుదువబెట్టి కల్లు తాగి ఆ తరువాత మీసమిమ్మని అడిగాడు. అంతలో ఉడుత ఆ మీసమును ఎత్తుకొని పోయింది. ఆ నాటి నుండి గౌండ్లు తమ 'గౌడ' యను బిరుదును కురుమలకప్పగించారు.

**దక్కలి :**

జాంబవంతుడు తన పెద్ద కొడుకును చంపి విశ్వకర్మకు పనిముట్లు చేసి ఇచ్చాడు.

"డొక్కమటి కొలిమిజేసెనూ
చర్మంబు తిత్తిజేసెనూ
అస్తములే పట్టుదెరలుగా
పాదములే బాడిశలన్నా
బొత్నెళ్ళే ఉలులజేసెనూ"

కొడుకు వెన్నుపూసలోని ఎముకలు మిగలగా వాటిని పారవేశాడు. శివుడు వానిపై విభూతివేసి సంజీవిపుల్ల మోపి బ్రతికించాడు. అతడు జాంబవంతుని ఇంటికి వెళ్ళక ఇంటిబయట నున్న పెంటకుప్పపై కూర్చున్నాడు. అందువల్ల జాంబవంతునికి దక్కనివాడై "దక్కలి" వాడయ్యాడు. మాదిగలకన్న దక్కలికులం తక్కువ కులం. ఈ విషయం జాంబపురాణంలో చెప్పబడింది.

**పద్మసాలెలు :**

వస్త్రాలు నేసేవారు మార్కండేయునికి వస్త్రాలు ఇవ్వడం మానివేశారు. అప్పుడు మార్కండేయుడు కోపంతో యజ్ఞంచేయగా అందులో నుండి ఒక పురుషుడు ఉద్భవించాడు. అతడే సాలెలకు మూలపురుషుడని నమ్ముతారు.

**పిచ్చుకుంట్లు :**

త్రిమూర్తుల వివాహానికి గోత్రం చెప్పేవాడు కావలసివచ్చి బ్రహ్మ మట్టి బొమ్మనుచేసి ప్రాణం పోశాడు. బొమ్మ చేసేటప్పుడు ఒక కాలు కుంటిగా ఉంది. అతని సంతానం పిచ్చుకుంట్లయ్యారు.

**జాలర్లు :**

జాలర్లు చేపలవేటకు వెళ్ళేటప్పుడు గంగను పూజిస్తారు. కొబ్బరి పువ్వుకు ఏర్పడ్డ మిట్టరేకులాగా ఉంటుంది. దానిలో పుల్లగుచ్చి దారంకట్టి అందులో దీపం వెలిగించి సముద్రపు టొడ్డున ఇసుకలో పెడతారు. వేటకు వెళ్ళేరోజు క్రితం రాత్రి భార్యతో ఉండరు. వేటనుండి జాలరులు తిరిగి రాకపోయినా వేట విఫలమైనా భార్యల పాతివ్రత్యాన్ని శంకిస్తారు.

**కుమ్మరి :**

పార్వతి పరమేశ్వరుల వివాహానికి అవిరేణి కావలసివచ్చింది. నవ బ్రహ్మల్లో ఒకణ్ణి గుండబ్రహ్మగా సృష్టించి విష్ణుమూర్తి చక్రం సారెగా ఇచ్చాడు. శివుడు మూడో నేత్రాన్ని గుబ్బిగా, గజాశూలాన్ని చక్రంతిప్పే కర్రగా, శరీరంమీది చర్మాన్ని వాటి పాతగా, ఎముకను వాలుబద్దగా ఇచ్చి కోయడానికి ఒక నరం ఇచ్చాడు. అప్పుడు అవిరేని కుండలు గుండబ్రహ్మచేత చేయించి వివాహం జరిపారు.

మొదట కుమ్మరివారు కాల్చని కుండలే వాడేవారు. కుండ చేస్తుంటే ఒక పక్షి పచ్చికుండమీద వాలి అంచు మడతపడింది. గుండయ్య నీరులేక ఉమ్మితో అంచును సరిచేశాడు. ఎంగిలికుండ శివుడికి పనికిరాదు కాబట్టి కాల్చమన్నాడు శివుడు. అప్పటినుంచీ కుండలను కాల్చడం ప్రారంభమైందనే నమ్మకం వారిలో ఏర్పడింది.

**c) రాజకీయపరమైన నమ్మకాలు :-**

రాజు యుద్ధభూమికి వెళ్ళేటప్పుడు అయిదు విధాల వాయిద్యాలను వాయించే వారు. పంచమవాద్యాల ధ్వని మంగళకరమని యుద్ధంలో విజయం కలుగుతుందని జనుల విశ్వాసం. యుద్ధంలో వీరమరణం చెందిన వారు స్వర్గానికి వెళ్తారు. వీరులు యుద్ధానికి వెళ్ళే ముందు వారి ఆయుధాలకు ఉపహారమివ్వడం ఆచారం.

పల్నాటి వీరచరిత్రలో యుద్ధానికి వెళ్ళే బ్రహ్మనాయుడు కొంత సాదమును, కొంత నీటిని చేర్చి కుంతానికి కట్టాడు.

యుద్ధంలో బ్రాహ్మణుని బ్రాహ్మణుడే ఎదుర్కోవాలి. ఖడ్గ తిక్కనను శివబ్రాహ్మణుడగు శివదేవయ్య ఎదుర్కొన్నట్లు కాటమరాజు కథలో చెప్పబడింది. యుద్ధంలో బ్రాహ్మణుని చంపినచో బ్రహ్మహత్యాపాతకం కలుగుతుందని వీరులు జంకేవారు. ఖడ్గతిక్కన యుద్ధానికిరాగా-

"బుద్ధి చాలని యట్టి భూసురోత్తముడు
యుద్ధంబు సేయనుద్యోగించినాడు
సర్వదా బ్రాహ్మణుడు చావకపోడు
బ్రహ్మహత్య మనకు బాపుకోరాదు" అని సంశయించారు.

అందువల్లనే బాలచంద్రుడు అనపోతును యుద్ధానికి రాకూడదని నిషేధించాడు.

రాజులు విష్ణ్వంశ సంభూతులని ప్రజలు నమ్మేవారు. జపాన్ దేశపు చక్రవర్తి మరణానంతరం అతనిని సూర్యదేవతగా ప్రజలు కొలిచేవారు. అలాగే ఈజిప్టు, బాబిలోనియా, పర్షియా దేశపు రాజులు దైవాంశ కలిగినవారు. యూదుల రాజు భగవంతునిచే అంగరాగ పరిలిప్త దేహుడై భూమికి వస్తాడని ఆ ప్రజల నమ్మకం. అందువల్ల రాజు సహజ మరణం చెందకూడదు. అతనికి సంబంధించిన ఏ చిన్న ఆపదైనా భూమిని వణికిస్తుందని ప్రపంచ పరివ్యాప్తంగా ఆదిమజాతుల నమ్మకం.

## d) ధర్మపరమైన నమ్మకాలు :

**నీతులు :**

కొన్ని నమ్మకాలు నీతి ప్రధానమైనవి. మరికొన్ని కేవలం నీతులా లేక నమ్మకాలా అని వేర్పాటు చెయ్యడానికి వీలులేకుండా ఉంటాయి. 'మానవసేవే మాధవసేవ' అనేది నీతి అయితే అలా చేస్తే పుణ్యం వస్తుందనేది నమ్మకం.

గోవు పాటలో గోవు ఇలా అంటుంది.

"సత్యవాక్యము దప్పి నేను స్వామి ద్రోహము చేసినట్లు
పుట్టినింటివారికెల్లా అత్తయింటివారికెల్లా
కీర్తి సంపద పోయినట్లు" -

అసత్యం పలకడం వల్ల ఇంత ప్రమాదం ఉంది. స్వామి ద్రోహం కలుగుతుంది, కీర్తి సంపద పోతుంది. ఇదీ నీతికోసం ఏర్పడ్డ నమ్మకమే.

దానం, ధర్మం చేస్తే పుణ్యం వస్తుందంటారు. సుఖపడే వాడిని పూర్వ జన్మలో పెట్టి పుట్టాడని నమ్ముతారు. "చిలుక ముగ్గు" పాటలో ఈ విషయమే చెప్పబడింది.

"పెట్టిన వారికే పుట్టుటే సాక్షి
పెట్టని వారికి పుట్టనిదే నిజము
పెట్టినవారికే పెద్దకాలమ్మ"

అన్నదానం చెయ్యడం, ఉపకారం చేయడం చాలా గొప్ప పనులు. కాబట్టి-

"అన్నమిచ్చిన వాని నాలినిచ్చిన వాని
అపహసించుట హాని ఓ కూనలమ్మా
ఆడితప్పిన వాని నాలి నేలని వాని
నాదరించుట హాని ఓ కూనలమ్మా
జపతపంబులకన్న చదువుసాములకన్న
ఉపకారమే మిన్న ఓ కూనలమ్మా"

ఇవి నీతి ప్రధానాలైన నమ్మకాలే.

**ధర్మపరీక్షలు :**

తన సత్యాన్ని నిరూపించుకోవడానికి పరీక్షలకు లోనుకావడం రామాయణ కాలం నుంచీ ఉంది. ఈ అంశం గ్రామాలలో పూర్వం ఉండేది. సత్యాన్ని నిరూపించుకోవడానికి మరిగే నూనెలో చేతులు పెట్టడం, బాగా కాలిన గడ్డపారను దుయ్యడం చేసేవారు.

ఒక వ్యక్తి తప్పుచేశాడు అని ఎదుటివాళ్ళు నమ్మినప్పుడు ఈ పరీక్షలు పెట్టేవారు. మరిగే నూనెలో చేతులు పెట్తే చేతులు కాలకపోతే తప్పు చెయ్యలేదని, కాలితే తప్పు చేశాడని నమ్మేవారు. సత్యాన్ని నిరూపించుకోవడానికి చేసేదే అగ్నిపరీక్ష రామాయణంలో సీతాదేవి అగ్నిప్రవేశం చేసింది.

అలాగే జానపద కవి రచించిన సీత అగ్నిప్రవేశములో ఈ ఘట్టం వర్ణింపబడింది.

"గుండమ్ము కెదురుగా సీత యేతెంచి
ముమ్మారు ప్రదక్షణం చేసి నిలుచుండె
దోసెడు ముత్యాలు గుండాన బోసి
ముందు శ్రీరాములను హృదయమున దలచి
వేయికోట్ల జన్మములు యెత్తినగాని
గోవిందు నాకు పతియుగావలెను
అని పల్కి అగ్నికి వందనం చేసి
కొలను జొచ్చినట్లు అగ్నిలో జొచ్చె
కణకణ నిప్పులూ కుంకమ్ములాయె
పరిచున్న నిప్పులూ పన్నీరు ఆయె
దాపిన నిప్పులూ చందనంబాయె
మండేటి నిప్పులూ వడగళ్ళు ఆయె"

ఇలా ఆమె శీలపరీక్షకు నిలబడి మానధనురాలనన్న విషయాన్ని ఋజువు చేసుకుంది.

సూర్యఖాండవ కథలో రాజకుమార్తె సత్యవతి భగవద్విలాసముచే గర్భవతి అయింది. కూతురి శీలాన్నిరూపించడానికి తండ్రి కల్లుకడవ నామె తలపై పామునుచుట్ట కుదురుగా చేసిపెట్టి, కల్లు తొణకకుండ పాము కరువకుండ పొలిమేరలు దాటాలని కట్టడిచేశాడు. ఆమె ఆ కట్టడిని గడచి నేటి 'కలకడ' ఉన్నచోట కల్లుకడవను దించి తాను నదిగా ప్రవహించింది.

సత్యం కలవారు నిప్పు పట్టుకుంటే కాలదని, నిప్పునుసైతం ఒకి గడతా రని వారిని ఇతరులు ఏమీ చెయ్యలేరని జనులు నమ్ముతారు.

కామమ్మ కథలో దొర కామమ్మను-
"చంద్రబొగ్గులుతెచ్చి పోగుపోయించి
అప్పుడు కమ్మర్ల పిలిపించి కొలిమిపెట్టించె
జోడిపిరంగి గుండ్లు కాలేసినారు కొలుములలో
అప్పుడు కాలేటిగుండ్లు చేతబట్టించి
వింటివా కామమ్మ వివరంబుగాను
భూమిలో నీ సత్యమింక చూడవలెను
వెన్నముద్దవలె యెగురెయ్యమనెను
ఆ మాటల కప్పుడు ఘల్లున నవ్వి
కాలేటి సూర్యుడా దండమన్నాది
అప్పుడెంచి యేడుమార్లు యెగరేసినాదీ ఆ గుండ్లు" ఇలా పరీక్షించాడు.

బాలసన్యాసమ్మ కథలో సన్యాసమ్మ ఫిరంగులు పేల్చినా వచ్చిన గుండ్లను చేతబట్టి యేడుఘడియలు వెన్నముద్దలవలె ఎగరేసింది. సీసము కరుగబెట్టి ఇవ్వగా సన్యాసమ్మ నీరులాగా తాగి దొరలకాశ్చర్యము కలిగించింది.

ఇటువంటి పరీక్షలు ఎక్కువగా పతివ్రతల కథల్లోనే కనిపిస్తాయి. పతివ్రతలకు సాధించరానిదంటూ ఏమీలేదని ప్రజలు నమ్ముతారు.

ఆదిమ సమాజం నుండి నమ్మకం అనేది కొనసాగుతూనే ఉంది. మానవుడిలోని భయమూ బలహీనతలు ఆధారంగా అనేక ఆధార రహితమైన మూఢనమ్మకాలు వ్యాపిస్తూనే ఉన్నాయి. వైజ్ఞానికంగా చాలా అభివృద్ధి చెందిన

ఆధునిక సమాజంలో కూడా ఇవి తప్పవు. జానపదుల్లోలాగానే నాగరికుల్లోనూ ఇవి తప్పవు. మానవుడిలో మౌఢ్యమే నశిస్తేతప్ప గుడ్డి నమ్మకాలు నశించడ మన్నది జరుగదు వాటి రూపంలో కొంచెం అటూ ఇటూ మార్పులు రావచ్చు. గొప్ప శాస్త్రవేత్తల్లోకూడా ఇవి స్పష్టంగా కనిపిస్తాయి. 9 ని అదృష్ట సంఖ్యగా 13 ను దురదృష్ట సంఖ్యగా భావించేవాళ్ళు ఇప్పటి నాగరిక సమాజంలో ఎంత మంది లేరు? ముందు కుడికాలు మేజోడు తొడుక్కోవడం ఒకరికి అదృష్టసూచక మైతే ఇంకొకరికి మరొకటి. పాత నమ్మకాలు కొన్ని పోయినా వాటి స్థానంలో కొత్తవి కొన్ని వస్తూనే ఉంటాయి. సంఘపరంగా హాని కలిగించనంత వరకు వీటితో బాధలేదు. ఏమైనా మానవుడి మౌఢ్యం పూర్తిగా తొలగితేనే ఇటువంటి నమ్మకాలు తొలిగేది.

## ఉపయుక్త గ్రంథాలు


**తెలుగు**

అండమ్మ. ఎమ్ — నల్లగొండ జిల్లా గ్రామదేవతలు
M. Phil. Dessertation
ఉస్మానియా యూనివర్సిటీ 1983.

కృష్ణకుమారి నాయని — తెలుగు జానపద గేయగాథలు
నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్ 1977.

,, — నల్లగొండ జిల్లా ఉయ్యాలపాటలు
ఉస్మానియా విశ్వవిద్యాలయము 1983.

,, — జానపద గేయాలు, సాంఘిక చరిత్ర
సాహిత్య అకాడమి 1974.

కృష్ణశ్రీ — స్త్రీల రామాయణపు పాటలు
ఆంధ్ర సారస్వత పరిషత్ 1955,

,, — స్త్రీల పౌరాణికపు పాటలు
ఆంధ్ర సారస్వత పరిషత్ 1963

,, — పల్లెపదాలు
ఆంధ్ర సారస్వత పరిషత్

గోపరాజు కొఱవి — సింహాసన ద్వాత్రింశిక
సాహిత్య అకాడమి 1982

తిక్కన — భారతము అనుశాసనిక పర్వం
సాహిత్య అకాడమి 1974.

తెలుగు భాషాసమితి — విజ్ఞాన సర్వస్వం
Vol : 4 1961
Vol : 10 1965.

పినవీరన పిల్లలమర్రి — శృంగార శాకుంతలం
సాహిత్య అకాడమి 1967.

ప్రతాపరెడ్డి సురవరం — ఆంధ్రుల సాంఘిక చరిత్ర.

మూర్తి. డి. బి యస్ ఆర్. సి. హెచ్. — సామాజిక పరిణామంలో స్త్రీ, ప్రజాశక్తి
బుక్‌హౌస్ 1984.

మోహన్ జి. ఎస్. — జానపద విజ్ఞాన వ్యాసావళి
శ్రీనివాస పబ్లికేషన్స్
మలయనూరు-1981.

రంగనాథుడు — రంగనాథ రామాయణము
వావిళ్ళ రామస్వామి శాస్త్రులు & సన్స్
1960.

రఘుమారెడ్డి యెల్దండ — పల్లెపదాలలో ప్రజాజీవనం
యెల్దండ 1979.

రామరాజు. బి — తెలుగు జానపదగేయ సాహిత్యం
జానపద విజ్ఞాన ప్రచురణలు
హైదరాబాదు. 1978.

,, — తెలంగాణా జానపద గేయాలు
సుదర్శన్ ప్రింటర్స్
హైదరాబాదు 1968.

రెడ్డి. జి. యన్. — మాండలిక వృత్తిపదకోశము.
Vol. V కుమ్మరం.
సాహిత్య అకాడమి 1976.

సంగీత నాటక అకాడమి — త్రివేణి
బాలాత్రిపుర సుందరి ప్రెస్
సికిందరాబాదు, 1960.

సుందరం ఆర్. వి. ఎస్. — జానపద విజ్ఞానం
సాహిత్య అకాడమి, 1963

సోమన పాల్కురికి — బసవపురాణము
వావిళ్ళ రామస్వామిశాస్త్రి & సన్స్, 1966.

శ్రీనాథుడు — కాశీఖండం
వావిళ్ళ రామస్వామిశాస్త్రి &సన్స్, 1948.

**సంస్కృతము**

మల్లయ్యశాస్త్రి బంకుపల్లె — ఋగ్వేదము
1940.

వాల్మీకి — రామాయణము
బాలకాండము
శ్రీ జయలక్ష్మి పబ్లికేషన్,
హైదరాబాదు. 1979.

**ఆంగ్లము**

Anthony Christie — Chinese Mythology
Hamlyn Publishing
Group Ltd.
Middlessex, 1968.

Maria Leach — Standard Dictionary of Folk
Lore & Mythology Vol. 1 & 2
1949.

Max Mullar — India what cant it Teach us?
Longmans, Green & Co. Ltd.
1934.

Stewart C. Easton — The Heritage of the Past
Rine Hart & Company,
New York, 1956.


ఇంకా జానపద గేయగాథలు, జానపద గేయాలు.

# సామెతలు, పొడుపు కథలు – సమాజం

— వి. వి. యల్. నరసింహారావు

'సామెతలు పొడుపు కథలు' అనేవి సంస్కార ప్రచురమైన మానవ సమాజానికి చిరకాల సంక్రాంతమైన సాహిత్య కళాస్వరూపాలు. సామాజిక జీవనంలో మానవుని హృదయవికాసాన్ని, బుద్ధి విశేషాన్ని, వాగ్విలాసాన్ని పట్టియిచ్చే మౌఖిక కళాస్వరూపాలివి. క్రమంగా లిఖితరూపం పొందాయి. ఇప్పటికీ మౌఖికంగానే బ్రతుకుతున్నవి వేలు లక్షలు.

ఇద్దరిమధ్య ఓచిన్న అభిప్రాయభేదం వస్తే సమాధానంకోసం న్యాయనిర్ణేతలా పనిచేస్తుంది సామెత. అవతలి మనిషి 'అదరగణ్యం'గా మాట్లాడుతుంటే తెలివిగల ఇవతలి మనిషికి మెత్తని ఆయుధం సామెత.

"ఏం చేసుకు బతికే దమ్మా అంటే

నోరు చేసుకు బతుకు బిడ్డా అందట" వెనకటికి ఒకావిడ. భావ చమత్కారం, శబ్ద చమత్కారం - రెండూ చోటుచేసుకున్న ఇటువంటి సామెతలు కొండంత వైరాలనుకూడా మంచులా మాయంచేసి, చిరునవ్వులు చిందించి, సామాజిక జీవనాన్ని సుఖతరం చెయ్యగలుగుతాయి.

చిన్నపిల్లలు చౌకాకించ దాచిపెట్టుకొని అవతలిపిల్లల నోరూరిస్తూ ఇదే మిటో కనుక్కోమంటూ ''చింపిరి చింపిరి గుడ్డలు ముత్యాలవంటి బిడ్డలు''

అని పొడుపు కథ వేస్తే "ఓస్ ఇదేనా ! ఆమాత్రం కనుక్కోలేమా?" "మొక్కజొన్న కంకోచ్" అని ఇట్టే పొంచిన కథను విప్పేస్తారు.

నోరుచేసుకు బతికినా ఆనోరు మంచిదైన ఒక జాతి సాహితీ సౌరభం ముత్యాలవంటి బిడ్డల పసిమనస్సుల్లోకి ప్రాకి జాతి సంస్కృతిని గుబాళింపచేసే మౌఖిక సాహితీ స్వరూపాలు సామెతలు, పొడుపు కథలు.

ప్రపంచంలోని సర్వమానవజాతుల్లోను ఇవి ఉన్నాయి. భాషాసాహితీ విషయికమైన సాంఘిక వికాసం పెరిగినకొద్దీ తాముా పెరిగిన జానపద కళా ప్రక్రియలివి.

సంఘమంటే- స్వయంవ్యక్తిత్వంతో నిర్ణయించుకొన్న సంస్కృతినిపట్టి వ్యవహరించే మనుష్య సమూహం (Adamson Hoeble's 'Man in the Primitive World') ఆదిమానవులనుండీ ఆధునిక నాగరిక జీవులవరకూ ఆచారాలు అలవాట్లు నమ్మకాలు మతరాజకీయాలు - అన్నీ కలగలిసి సామాజిక జీవిత స్వరూపాన్ని నిర్ధరిస్తున్నాయి. నాటి జానపద కళా ప్రక్రియలు నేటి నాగరిక జీవితంలో కొంత కొంతమార్పు చెందినా మౌలికమైన వాటి లక్షణాలు వాటివే. అవి జానపదాలలోని జనుల బతుకుల్లో నాని నాని జాతి సంస్కృతికి చెరగని చిన్నెలుగా నిలిచాయి. జానపద సాహితీ మధుకోశాన్ని తాకితేచాలు - మానవుల అనుభవసారమనదగ్గ తేనె జాలు చింది పడుతుంది.

జానపద వాఙ్మయంలోని వచనశాఖకు చెందినవి సామెతలు, పొడుపు కథలు. ఇవి కథా కథన సహితాలు కాకపోయినా, పౌరాణిక గాథల నుండి పుట్టినవి కావచ్చు. "రామాయణమంతా విని రాముడికి సీతేమౌతుందన్నాట్ట!" ఇది ఈ కోవకు చెందిన సామెత "బావిలో సీతమ్మ మునిగి మునిగి లేచె" ఇది వెన్నముద్ద అనే అర్థమిచ్చే పొడుపుకథ. పొడుపుకథ సామెతలాగా సుబోధకంగా ఉండదు. బుద్ధికి పనికల్పించే సమస్యలక్షణం ఉంటుంది. అందుకే వీటికి 'సమస్యలు' 'సమిచ్చలు'- 'riddles' అని ప్రతీతి ఏర్పడ్డది. 'సమస్యలే' జానపదుల ఉచ్చారణలో 'సమిచ్చలు', సామెత అనేది 'సామ్యత' నుండి పుట్టిందంటారు. సామ్యత అనేది తద్ధితం మీద తద్ధితం. సమత్వలక్షణం సామ్యం, అంటే పోలిక. సామ్యత్వ లక్షణం సామ్యత్వం. సామ్యత్వంనుండే సామెతపుట్టి వుండక్కర్లేదు. సమత నుండే సామెత పుట్టి వుండవచ్చు. సమత్వ లక్షణం కూడా పోలిక కలిగి వుండటమే. సంస్కృతంలోని 'సూక్తి', కన్నడంలోని 'గాదె', తమిళంలోని 'పళమొళి' ఇంగ్లీషులోని Proverb సామెతకు పర్యాయాలే. సూక్తి అంటే సుభాషితం. గాదె అంటే గాథ. పళమొళి అంటే పాతమాట, Proverb అంటే లోకోక్తి కనుక జనప్రసిద్ధమైన ప్రాచీన సుభాషితమే సామెత. "పరులసొమ్ము పాపిష్టిది"- ఇందులో దృష్టాంతంగాని సామ్యంగాని సూటిగా కనబడదు. సామెతలో దృష్టాంత సామ్యాలు యాదృచ్ఛికాలే కాని అనివార్య లక్షణాలు కావు.

అయితే కొన్ని కొన్ని పొడుపు కథలు జన వ్యవహారంలో అమిత ప్రాచుర్యం పొంది క్రమంగా అవి సామెతలుగా స్థిరపడ్డ సందర్భాలూ ఉన్నాయి.

"ఇద్దరు పెళ్ళాల మొగుడు ఇరుకునబడి చచ్చాట్ట"- ఇది ఆదిలో పొడుపు కథే. "అడకత్తెరలోని పోక" అని దీని అర్థం. కాని క్రమంగా ఇది సాంసారిక సంకటం స్ఫురింపచేసే సామెతగానే స్థిరపడింది. ఇంతకంటే ప్రసిద్ధమైన ఉదాహరణం చూద్దాం.

"అరటాకు మీద ముల్లు పడ్డా, ముల్లు మీద అరటాకు పడ్డా అరటాక్కే ప్రమాదం"- అరటాకంటే ఆడపిల్ల, ముల్లంటే మగవాడు. ఇది కూడా ముందు పొడుపు కథగానేపుట్టి క్రమంగా సామెతగా స్థిరపడింది. సమాజంలో కన్నెపిల్లల దుఃస్థితిని అద్దం పట్టిచూపే సామెత ఇది.

మొత్తం మీద స్వరూప స్వభావాన్నిబట్టి చూస్తే సామెతకూ పొడుపు కథకు పోలానిబంధం ఒకటి ఉన్నదని స్పష్టం. అయినా లక్షణ పరిశీలనమీద రెండింటిమధ్యా స్పష్టమైన విభజన రేఖ గీసే అవకాశం ఉన్నట్లు కనిపిస్తుంది.

ఒక్క మనభాషలోనే కాక ప్రపంచంలోని బహుభాషల్లో సామెతలు పొడుపు కథలు విస్తరించివున్నాయి. ఆ యా జాతుల ప్రవృత్తుల్ని ఇవి అద్దంపట్టి చూపుతున్నాయి. కనుకనే వీటి అధ్యయనం శాస్త్రీయ మార్గాల్లో జరగాలన్న తహ తహ భాషా సాహిత్య పరిశోధకుల్లో ప్రారంభమైంది.

1546 లో John Haywood అనే రచయిత సామెతల్తోనే పూర్తి కావ్యం రాయవచ్చని నిరూపించాడు. 'A Dialogue of proverbs' అనే గ్రంథం అట్లా పుట్టిందే. సామెతల అధ్యయనం చేసిన వారిలో మొట్టమొదటి చాంపియన్ అనిచెప్పదగ్గ Champion ఉన్నాడు అతను అనేక భాషలనుండి వేనవేల సామెతలు సేకరించి వాటిని ఇంగ్లీషులోకి అనువదించి 'Racial Proverbs' అనే సంకలన గ్రంథంగా రూపొందించాడు. సామెతల అధ్యయనం కోసం 1944 లో American Dialect Society కి అనుబంధంగా Proverbial Sayings Committee ఒకటి ఏర్పడింది. మనదేశంలో ఆంధ్ర తమిళ కన్నడ దేశాల్లో ప్రత్యేకంగా ఇటువంటి సంస్థలు ఇంకా ఏర్పడవలసి వుంది.

**సామెతలు - సమాజం :**

సమాజంలో మానవుడి వివేకాన్ని ప్రతిబింబించేదిగా ఉండటం సామెత యొక్క ముఖ్య లక్షణం. ఒక ఉక్తి, సామెతగా రూపొందటానికి ముందు అది సాంప్రదాయికమైన బలం పుంజుకోవాలి. ఇందుకు దీర్ఘకాలం పట్టవచ్చు. మానవుల చిరకాల అనుభవాలు సూటిగా పదునుగా, పరిమితపదాల్లో పొదివి చెప్పినవి కనుక సామెతలు సాహిత్య లక్షణ దృష్టితో చూచినప్పుడు ఆలంకారికోక్తుల్లాగా, దృష్టాంతల్లాగా ప్రతీక రచనల్లాగా ద్యోతకమౌతాయి. అనేకదేశాల్లో అత్యంత ప్రాచీనకాలంలోనే అనేక సామెతలు పుట్టాయి. వేదంలో, బైబిల్లో, కొరాన్లో సామెతల-ఛాయలుగల వాక్యాలు లేకపోలేదు. బుద్ధుడు, అరిస్టాటిల్, ప్లేటో మొదలైన మహామహులు సామెతలు వాడినవారే. సామెత పుట్టుకకి జీవితానుభవమే మూలకారణం కనుక మానవజీవితాన్ని పరిశీలించిన వారికి పద పదాన సామెత పొడసూపుతూనే ఉంటుంది.

1972లో Richard M. Dorson ప్రచురించిన Folklore and Folklife అనే రచనలో Roger D. Abrahams - Proverb లక్షణాల్ని సూక్ష్మేక్షికతో వింగడించేందుకు ప్రయత్నించాడు. అతని పరిశీలనని బట్టి సామెత సంక్షిప్తమై కించిత్ హాస్యజనకమై సాంప్రదాయికమై, దైనందిన జీవిత చర్యల్లో నుండే కాక, నిర్మాణాత్మక విద్యా వ్యాసంగం న్యాయ నిరూపణం మొదలైన సందర్భాల నుండి కూడా పుట్టిందిగా కనిపిస్తుంది. కవిత్వానికి ఎన్ని లక్షణాలున్నాయో దాదాపు సామెతకీ అన్ని లక్షణాలుంటాయి. అచితూచి వాడిన పదజాలం, ఛందోవాసన, లయానుగతి, అనుప్రాస, ఆలంకారికత, ఉక్తి చమత్కారం సహజోక్తి రామణీయకం - అన్నీ సామెతల్లో ఎడనెడా కనిపిస్తూనే ఉంటాయి.

భారతదేశం ప్రాథమికంగా వ్యావసాయిక దేశం. కృషిమూలకమైన ప్రవృత్తికల దేశం. సోమరితనానికి చోటులేని ప్రవృత్తి కర్షకుడిది దానికి భిన్నంగా ఏమాత్రం సోమరితనం కనిపించినా అతడు సహించడు. ఆ సోమరిని మృదువుగా మందలిస్తాడు. తనకు పరిచితమైన జంతుజాలాన్నే ఉపమాన పరికరాలుగా వాడుకుంటాడు అట్లా పుట్టిందే ఈ సామెత.

"మెయ్యబోతే ఎద్దుల్లో - దున్నబోతే దూడల్లో."

దీనికి అనుబంధంగా పుట్టిన సామెతే - 'తిండికి తిమ్మరాజు, పనికి పోతరాజు' సమష్టి హిందూ కుటుంబ వ్యవస్థలో తండ్రి తరవాత తండ్రంతవాడు ఇంటికి పెద్దకొడుకు. కుటుంబ బాధ్యతంతా అతనిదే. కష్టనిష్ఠురాలు భరించి, ఇంతవార్ని అంతవార్ని తమ్ముళ్ళనీ చెల్లెళ్ళనీ ఎక్కడీసుకొచ్చి పెళ్ళిపేరంటాలు జరపవలసిన బాధ్యతకూడా అతనిదే. కష్టాలు భరించటంలో అతడు జడప్రాయుడుగా వర్తించవలసి వుంటుంది. చెక్కుచెదరని దార్ఢ్యంతో వ్యవహరించవలసి వుంటుంది. ఇంతకష్టం ఉంది కనుకనే

"ఇంటికి పెద్దకొడుకై పుట్టేకన్నా
అడవిలో తుమ్మ మొద్దై పుట్టింది మేలు"

అతని కష్టసుఖాల్లో పాలుపంచుకునే అర్ధాంగి పెద్దకోడలు. బాధ్యతల బరువుతో సతమతమయ్యే మగణ్ణి కంటికి రెప్పలా కాపాడుకొంటుంది ఇల్లాలు. కమ్మని కూరచేసి ఆయన మెప్పు పొందాలనుకుంటుంది. కూర బాగున్నా చమత్కారం కోసం పొరుగింటి పుల్లమ్మ చేసిన కూరను ప్రస్తావిస్తాడు. ఇల్లాలు మొగం చిట్లించుకొని 'అవును పొరుగింటి పుల్లకూర రుచి' అని దెప్పిపొడుస్తుంది. 'మీ పని ఇట్లా వుందా?' అని ఓ కొంటెపని తలపెడుతుంది. 'తేలు తేలండీ' కెవ్వున కేక పెడుతుంది. వెంటనే అతడు "మొగాళ్ళను పిలవ్వే" అంటాడు.

ఆలుమగల సరస సల్లాపాలన్నీ ఆడపిల్ల పెళ్ళి చెయ్యొచ్చేసరికి అదృశ్యమై పోతాయి. ఒకప్పుడు కన్యాశుల్కం, మరొకప్పుడు వరశుల్కం. కావడికుండల్లా మారటమేతప్ప మొత్తంమీద ఆడపిల్ల బతుకు అరిటాకులాంటిదే. అందుకే "ఆడపిల్ల పెళ్ళి అడుగుదొరకని బావి అంతంచూచేవే" అనే సామెత పుట్టింది. కన్యాశుల్కపు రోజుల్లో ఆడపిల్లకు 'ఓలి' ఇవ్వటం ఉండేది. ఒకరకంగా వధువును డబ్బిచ్చి కొనుక్కోవటమే. 'ఓలి' తక్కువని ఒక వరుడు గుడ్డి పిల్లను పెళ్ళి చేసుకొన్నాట్ట ఆవిడ కళ్ళు కనిపించక దగ్గరున్న కుండలన్నీ బగల కొట్టిందట. అప్పుడు పుట్టిన సామెత. "ఓలి తక్కువని గుడ్డిదాన్ని పెళ్ళాడితే దొంతి కుండలన్నీ పగలకొట్టిందట". ఇహ ఇల్లరికపు టల్లుళ్ళనుగూర్చి చెప్పక్కర్లేదు.

అత దత్తగారింట చేరాడో క్రమంగా ఇల్లు గుల్ల కావలసిందే. అతను సంపాదించవలసిన అక్కరలేనివాడు. కూర్చొని తింటుంటాడు. గొడ్ల కొట్టంలోని కొమ్ముల బర్రె చందమే. కొమ్ములు పొడుగు కనుక గుమ్మంపట్టక లోపలినుంచి బైటకు బైటనుంచి లోపలికి వచ్చే వీలులేక పొద్దస్తమానం కొట్టంలోనే ఉండి మేస్తుంటుంది. ఈ సామెత పాడిపశువుల దృష్టాంతంతో కర్షక సమాజంలో ఇల్లరికపు టల్లుణ్ణి గూర్చి చెప్పేందుకు పుట్టింది.

"ఇల్లరికపుటల్లుడు ఇంటికిచేటు
కొమ్ములబర్రె కొట్టానికిచేటు."

స్త్రీల అలంకారాలనుగూర్చి ఎన్నివేల సామెతలు పుట్టాయో! "తెలుగు సామెతల్లో స్త్రీ" అన్న ఒక్క అంశంగూర్చి ఎంత అధ్యయనమైనా చెయ్యవచ్చు.

"చీర సింగారించేసరికి ఊరుమాటు మణిగిందట" పెళ్ళిళ్ళలో పేరంటాల్లో అయితే బరబర్లాడే పట్టుచీరల సింగారింపు కార్యక్రమం సామాన్యమైంది కాదు. ఒక్క చీర సింగారింపే కాదు కొప్పు ముడుచుకోవటమూ అంతపనే. కాంతకు కొప్పు కవిత్వానికి మెప్పు లాంటిది. రాసిన నాలుగు పద్యాలు మెచ్చుకొనేవాడు లేకపోతేమానె, వినే దిక్కుకూడా లేదే? కనుకనే కవితకు మెప్పు ఎంత అవసరమంటే కాంతకు కొప్పు ఎంత అవసరమో అంత. మెప్పు లేకపోయినా రాసుకుపొయ్యేవారున్నారు. కొప్పు లేకపోయినా దర్జాగానే ఉన్న కాంతలు లేరా?

'కవితకు మెప్పు కాంతకు కొప్పు' అనే సామెత చిత్రమైన ఈ సామాజిక వాతావరణాన్ని అందంగా చిత్రించి చూపుతుంది.

ఎవరెన్ని చెప్పినా మనిషి జీవితంలో అలంకారాలు వేరు, అవసరాలు వేరు, ప్రాథమిక అవసరాలు తీరిన తరువాతే భోగప్రసక్తి. కూడు - గుడ్డ - గూడు ఇవి ప్రాథమిక అవసరాలు.

"ఆకలి రుచెరగదు - నిద్ర సుఖ మెరగదు"

దవాగ్నిలా పేగులు దహించివేసే ఆకలికి పదార్థాల రుచులతో పనిలేదు. పొట్టకోసం పగలంతా ఛాకిరిచేసినవాడికి పిలవకుండానే వస్తుంది నిద్ర. పట్టు

పరుపులతోను, యూఫోమ్ బెడ్స్‌తోను పనిలేదు. అసలైన నిద్ర సుఖమెరగదు. నిద్రమాత్రలు మింగితేకాని కునుకురాని దురదృష్టవంతులకు నిద్ర సుఖం ఏం తెలుస్తుంది?

కామక్రోధాలు సర్వమానవ సహజాలు. అయినా అవి కలవారిలో ప్రదర్శితమయ్యే తీరు లేనివారిలో ప్రదర్శితమయ్యే తీరు ఒకటికాదు. పేదకు కోపం వస్తే పెదవి కొరుక్కోవటం తప్ప నోరువిప్పి కసితీర ఒక్కతిట్టుకూడా తిట్టలేడు. అందుకే పుట్టింది—

"పేద కోపం పెదవికి చేటు అనే సామెత" అతను బ్రదుకులో బాగుపడటానికి చేసే ఏ చిన్న ప్రయత్నమైన ఇట్టే బెడిసికొడుతుంది.

"కొండనాలుక్కి వేస్తే ఉన్న నాలుక వూడిపోయిందట!"

ఆ అభాగ్యుల బ్రతుకు అంతే. నిరాశా నిస్పృహాలతో చావే శరణ్యమనుకుంటారు.

"ఇవ్వాళ చస్తే రేపటికి రెండు. ముక్కుమూసుకుంటే మూడు నిమిషాలు ఆకలితో అలమటించి ఆత్మహత్య చేసుకొనేకంటే మదించినవాణ్ణి నరికి మిట్టపల్లాలు ఏకం చెయ్యాలనుకుంటాడు. అప్పుడు 'ఓడలు బళ్ళు బళ్ళు వోడలు అవుతాయి.

ఇట్లా జీవిత సర్వస్వాన్ని కాచివడపోసిన సామెతలు నిత్యజీవితంలో మన మాటల్లోనే పెనగొని పొయ్యాయి. అందుకే "సామెతలేని మాట ఆమెతలేని ఇల్లు" అంటారు. సమాజానికి పట్టిన నిలువుటద్దం సామెత. సంఘజీవి అయిన మనిషి సామెతలో తన్ను తాను చూచుకొని లోపాలు సవరించుకోవటానికి ప్రయత్నించవచ్చు. 'చేసుకున్న వారికి చేసుకున్నంత మహదేవ' ఎవరి తప్పులకు వాళ్ళే బాధ్యులు కావాలనే ఉద్బోధ ఇందులో ఉంది. భక్తిశ్రద్ధలనేవి అంతరంగంలో నుంచి పుట్టాలి. ఆడంబరంకోసం, ప్రదర్శనకోసం భక్తిప్రపత్తులు చూపరాదు. ఆ బాపతువాళ్ళకు ఏకాగ్రత ఉండదు. వారు శివాలయంలో శివలింగం ముందు నిలిచి, చిత్తం శివునిమీదే నిలిపామనుకున్నా ఆలయం బైట విడిచి వచ్చిన చెప్పులు ఎవరు కాజేసుకుపోతారోననే ధ్యాసతో ఉంటారు. ఇటువంటి కపట భక్తుల కోసం పుట్టిందే—

"చిత్తం శివునిమీద భక్తి చెప్పులమీద"

అనే సామెత. వేమన్న ఆటవెలదులు అచ్చమైన సామెతలకు మచ్చుతునకలు.

"చిత్తశుద్ధి లేని శివపూజలేలరా!
భాండశుద్ధి లేని పాకమేల?
భక్తి కలుగు కూడు పట్టెడైనను చాలు" —వేమన

సమాజాన్ని సంస్కరించాలని పూనుకొన్న కవి సంస్కర్త వేమన. కాబట్టి ఆయన రచనల్లో ఆటవెలది మూడవ పాదం విధిగా సామెత లక్షణాన్ని పొదువుకొని బహుళ ప్రచారం పొందింది.

గట్టిగా మాట్లాడితే ప్రాచీన పద్యకవుల్లో కూడా అర్థాంతరన్యాసం చేసిన సందర్భాలన్నీ చాలవరకు సూక్తుల్లాగో, సుభాషితాల్లాగో సాగి సామెతల్లాగే వ్యాప్తి చెందాయి.

'లేడి కడుపున పులిబుట్టునె?' (ఆది 6-57) —నన్నయ

'ఆవగింజంత భూతి మైనలదికొనిన గుమ్మడికాయంత వెట్టి పుట్టు'
(హ.వి.2-100) —శ్రీనాథుడు

'పేరలుకం జెందిన యట్టి కాంత లుచిత వ్యాపారముల్ నేర్తురే?'
(పా.హ. 1-121) —తిమ్మన

ఏమైనా వ్యావహారిక సౌలభ్యం కోల్పోయి, కృతకగ్రాంథిక భాషాఫక్కిలో అర్థాంతరంగా బడి, ఛందస్సు మూసలో ఒదిగిన ఈ సూక్తులకంటె జానపదుల గుండెల్లో నుండి దూసుకొచ్చిన సామెతలు సహజత్వాన్ని పుణికిపుచ్చుకొని, ఎంతో ఆహ్లాదం కలిగిస్తాయి.

ఏ సామెతనైనా యథాతథంగా దాని మానాన దాన్ని బ్రతకనియ్యాలి. గ్రంథ సంస్కరణ కలవాటుపడ్డ చేతుల్తో సామెతమీద నగిషీచెక్కే దుర్మార్గానికి పాల్పడరాదు. పనిలేని మంగలి పిల్లితల - కాదు, పిల్లతల - కాదు పెళ్ళాం తల గొరిగినట్లుంటుంది. కన్నడంలో ఈ సామెత పెళ్ళాన్నే వరించింది."కెలస పిల్లద మురవ హెండతి తలె బోళిసిద". సామెతను సంస్కరించటం ఆత్మహత్యా సదృశమని వేరే చెప్పనక్కర్లేదు.

**పొడుపు కథలు - సమాజం**

సామెతల్లాంటి పొడుపు కథలు కొన్ని వున్నా పొడుపు కథ అవతరణం సామెత అవతరణం వంటిదికాదు. ఆలోచననీ, బుద్ధిశక్తినీ పరీక్షించే లక్షణం పొడుపు కథలో అనివార్యం. జానపద వాఙ్మయంలో గేయాలు, కథాగేయాలు, గద్య కథలు పుట్టిన తరువాతనే ఇది పుట్టి వుంటుంది. సహజమైన సూక్తి లక్షణం దాటి బుద్ధిని గిజ గిజ లాడించే సమస్యగా ఇది రూపొందటం వల్ల పొడుపు కథ ప్రాక్తన దశ దాటి మానవుడి విజ్ఞాన వివేకాలు వికసించే దశలోనే ఉద్భవించి వుంటుంది.

పొడవటమంటే గుచ్చటం. పచ్చబొట్టు పొడవటమంటే పచ్చబొట్టు ఏర్పడేటట్లు సూదితో గుచ్చటమే కదా! జవాబుకోసం గుచ్చి గుచ్చి అడిగిన ప్రశ్నలే పొడుపు కథలై వుంటాయి. అవధాన ప్రక్రియలోని సమస్యవంటిదే ఈ పొడుపు కథ. అవధాని బుద్ధి శక్తి పరీక్షించబడినట్లే పొడుపుకథ విప్పేవారి బుద్ధిశక్తి కూడా పరీక్షించబడుతుంది. జవాబు చెప్పేవార్ని తికమక పెట్టటంకోసం వేసే ప్రశ్నలే పొడుపు కథలని Roger D. Abrahams, Alan Dundes పొడిచిన కథను అనాయాసంగా విప్పగలిగితే కలిగే ఆనందం అంతాయింతా కాదు! ఈ ఆనందమే పొడుపుకథల పరమలక్ష్యం.

పొడుపు కథలుకూడా సామెతల్లాగే ప్రసిద్ధమైన ప్రపంచ భాషలన్నింటిలోనూ ఉన్నాయి. సంస్కృతంలో, 'ప్రహేళిక', ఇంగ్లీషులో 'Riddle' కన్నడంలో 'ఒగటు' (ఒగటినకథె) తమిళంలో 'విడుకతై' - ఇట్లా ఒకో భాషలో ఒకోపేరుతో వర్ధిల్లింది పొడుపుకథ. తెలుగులో ఇది పద్నాలుగు పేర్లదాకా సంతరించుకొంది. 'పొడుపు' అనేమాట ప్రహేళిక నుండి పుట్టిందని చెప్పటం కష్టం. గుచ్చిగుచ్చి పొడిచినట్లు అడిగే లక్షణంవల్లనే అది పొడుపుకథ అయి వుంటుంది. పర్యాయాలుగా విడుపుతట్టు, మారుతట్టు, మారుకథ, శాస్త్రం, సమస్య, సమీచ్చ, చిటుకు, చిట్కా, చిక్కుముడి, యక్షప్రశ్న, అడ్డుకథ, ఒడ్డుకథ, వేసేకథ, విప్పేకథ - ఇట్లా అసంఖ్యాకమైన పర్యాయపదాలతో వర్ధిల్లిన పొడుపు కథ మానవమేధావికాసానికి గుర్తుగా నిలిచిన గొప్పసాహిత్య ప్రక్రియ అనక తప్పదు.

అలవోకగా గుండెల్లో నుంచి దూసుకొచ్చే సామెతకంటే ఇది ఎంతో భిన్నమై ఆలోచనను పురికొల్పుతుంది. అలంకారికంగా వింగడించి చూడవగిన సాహిత్యస్థాయి ఇందులో ఉంటుంది. రూపకం, రూపకాతిశయోక్తి, వ్యతిరేకలక్షణ, వ్యాజ, గూఢ వక్రోక్తులు విలక్షణంగా దర్శనమిస్తాయి పొడుపుకథల్లో. ఉక్తిలో వక్రత అతిశయించిన సందర్భాలూ ఉంటాయి. అందుకే కాబోలు Encyclopaedia of Religion and Ethics లో దీన్నిగూర్చి 'అర్థస్పష్టతలేని రూపక' మనీ 'రూపక సముదాయ' మనీ చెప్పబడింది. ఉపమేయాన్ని నిగరణం చేస్తూ ఉపమానాన్ని మాత్రమే చెప్పకు పోతుంటే అర్థస్పష్టత లేకపోయే అవకాశం ఉంటుంది. Encyclopaedia Britanica పొడుపుకథలోని హాస్య లక్షణాన్నిబట్టి దాన్ని ప్రాచీన ప్రక్రియగా భావించటం జరిగింది.

తెలుగులో నేదునూరు గంగాధరం, చేకుమళ్ళ కామేశ్వరరావు, ఆర్వీయస్ సుందరం(1988)కసిరెడ్డి వెంకటరెడ్డి, వెలగా వెంకటప్పయ్య (1981)మొదలైన వారుపొడుపు కథనుగూర్చి కృషిచేశారు.పాశ్చాత్యుల్లో Kenneth W. Clarke Mary W. Clarke 1963లో Introducing folklore అనే గ్రంథంలో Archer Taylor మొదలైనవారు పొడుపు కథను వర్గీకరించిన తీరులను గూర్చి వివరించారు. వర్గీకరణ పద్ధతుల్లో కొన్ని గ్రంథాలయాల్లో పుస్తకాల్ని వింగడించిచూపే పద్ధతుల (Classification methods) వలె కనిపిస్తున్నాయి.

పొడుపుకథను తొట్టతొలిగా పరిశీలించిన గౌరవం అరిస్టాటిల్‌ది కావచ్చు నంటారు ఆర్వీయస్ (1) The Rhetorie, Book-III Chapter-II (2) The Poetics XXII లో పొడుపు కథను (Riddle) గూర్చిన వివరణ కనిపిస్తుంది. తరువాత తరువాత 19వ శతాబ్దిలో శాస్త్రీయమైన అధ్యయన పద్ధతులు కూడా మొదలెట్టారు పాశ్చాత్య విద్వాంసులు. వీరిలో Archer Taylor, C. F. Potter మొదలైనవారు పేర్కొనదగ్గవారు. భారతీయుడైన దుర్గాభగవత్ The Riddle in Indian Life Lore and Literature సుప్రసిద్ధం. కన్నడంలో రాగౌ సంకలించిన 'నమ్మ ఒగటుగళు' - లక్కప్పగౌడ సంపాదకత్వంలో వెలువడింది.

మన సాహిత్యంలో బాగా వెనక్కిపోయిచూస్తే ఉపనిషత్కాలంనాటికే పొడుపుకథా లక్షణం ఆవిర్భవించినట్లు కనిపిస్తుంది. ముండకోపనిషత్తులోని

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్ అన్యో అభిచాకశీతి."

అనే మంత్రంలోని పక్షులు రెండూ ఉపమానాలు మాత్రమే. ఉపమేయాలు జీవాత్మ పరమాత్మలు. పండును రుచిచూసే పక్షి జీవాత్మ. నిర్లిప్తంగా చూస్తూ వుండే పక్షి పరమాత్మ. ఈ మంత్రంలో పొడుపుకథ లక్షణం ఉంది.

పొడుపు కథకు యక్షప్రశ్న అనే పేరు రావటానికి వ్యాసుడే కారణం. సంస్కృత భారతంలో ఆరణేయపర్వంలో యక్షప్రశ్నలున్నాయి. యజ్ఞకార్యం మొదలుపెట్టిన బ్రాహ్మణుడు అగ్ని దరికొల్పేందు కుపయోగించే అరణిని కోల్పోయి 'దానిని సంపాదించి యి'మ్మని ధర్మజుని కోరగా, అతడు అందు కోసంపోయి ఒక యక్షుడడిగిన ప్రశ్నలకు జవాబులు చెప్పి కార్యసాధనచేస్తాడు.

| | **యక్షప్రశ్నలు** | **ధర్మజుని జవాబులు** |
|---|---|---|
| 1. | కిం స్విత్సుప్తం న నిమిషతి? (నిద్రించియును కన్నుమూయ దెద్ది?) | మత్స్యః సుప్తో న నిమిషతి (కన్ను మూయదు సుప్తమయ్యు మీను) |
| 2. | కింస్విత్ జాతం న చోపతి? (పుట్టియును చేతనత్వంబు పొరయుదెద్ది?) | అండం జాతం న చోపతి. (పుట్టియును గ్రుడ్డు చేతన పొరయ కుండు) |
| 3. | కస్య స్విత్ హృదయం నాస్తి? (రూపు కల్గియు హృదయంబు లేనిదెద్ది?) | అశ్మనో హృదయం నాస్తి (హృదయ రహితంబు ఱా రూపు) |
| 4. | కిం స్విత్ వేగేన వర్ధతే? (వేగంబుకతమున నెద్ది పొలుచు?) | నదీ వేగేన వర్ధతే (ఏఱు రయముకతన వర్తించు) |

1-4. సంస్కృతం వ్యాసభారతం B.O.R.I. III 297-42, 43.
తెలుగు - ఎఱ్ఱన భారతం ఆరణ్య-7-437, 438.

1938 లో యస్. వి. గోపాల్ అండ్ కో మద్రాసు వారు ముద్రించిన పురాణం పిచ్చయ్య శాస్త్రిల 'యక్ష ప్రశ్న' అనే యక్షగానంలో ఈ సందర్భం ఎట్లా వుందో చూడండి.

యక్ష ధర్మజ సంవాదం దరువుగా రూపొంది కమానురాగంలో చాపు తాళంలో నడుస్తుంది,

యక్షుడు :- ఏయదియొ నిద్రించి కన్నులు మూయకుండును తెల్పుమా?

ధర్మజుడు :- గాఢ నిద్రితమయ్యు మీనము కనులు మూయదు నిక్కము. ఇట్లా సాగిపోతుంది.

తెలుగునాట 17 వ, శతాబ్దిలో అద్వైత మతాన్ని అఖిల జనులకు సుగమం చేసిన పోతులూరి వీరబ్రహ్మం తత్త్వ రచనల్లో అనేకం మర్మ కవితా లక్షణాలు కలిగి పొడుపు కథల్ని తలపిస్తాయి.

1. 'మూడు కాల్వలు దాటలేరన్నా యీ మూఢ జనులు మూడు కాల్వలు దాటలేరన్నా!'
   మూడు కాల్వలంటే! - ఈషణత్రయం-దారేషణ, పుత్రేషణ, ధనేషణ.
2. 'మూడారువాకిళ్లు మూయవలెనన్నా!'
   మూడు ఆరు తొమ్మిది - శరీరానికున్న నవరంధ్రాలు-
3. 'ఆరిటిమీదనె చిద్రూపం'
   ఆరంటే? షట్చక్రాలు - మూలాధారాది షట్చక్రాలు.

వేలూరి శివరామశాస్త్రి గారు ఈ రచనల్లోని రూపకాతిశయోక్తి, వ్యతిరేక లక్షణాది ఆలంకారికగుణం బహుధా మెచ్చుకొన్నారు. (కోలవెన్ను పరబ్రహ్మ తీర్థుల 'జగచ్ఛిల్పము' పై అభిప్రాయం) ఉపమేయాన్ని నిగరణం చేసి ఉపమానం మాత్రమే పేర్కొనటం ఇక్కడ గుర్తించ తగిన అంశం. ఇది పొడుపు కథ లక్షణాల్లో ఒకటి.

వర్ణన ద్వారా వస్తువుని గుర్తించేట్లు చెయ్యటం కూడా ఉంది.

"చెట్టుపై నివసిస్తానుగాని పక్షిని గాను
చర్మం ధరిస్తానుగాని సోమయాజిని గాను
మూడు కళ్లుంటాయిగాని శూలపాణిని గాను
నీళ్లుంటాయిగాని కుండనుగాను మేఘాన్ని గాను." (నేనెవర్ని? టెంకాయను) దీనికి మూలం సంస్కృతంలో ఉంది.

"వృక్షాగ్రవాసీ నచపక్షిరాజః, చర్మాంగధారీ నచ సోమయాజీ,
త్రినేత్రధారీ నచ శూలపాణిః, జలంచ బిభ్రన్నఘటో నమేఘః"

మొత్తం మీద వీటి తత్త్వాన్ని పరిశీలించిన కొద్దీ బుద్ధిశక్తిని పరీక్షించే లక్షణమే ప్రధానంగా కనిపిస్తుంది. చిన్నప్పుడు నే చదువుకున్న చాటువుల్లో పద్యరూపమైన పొడుపు కథలు ఇంకా నాకు జ్ఞాపకం.

'వెలది నీ ప్రాణేశు పేరేమి చెపుమన్న -
తనమీది జీర్ణవస్త్రంబు చూపె'

జీర్ణవస్త్రమంటే కుచేలం - కుచేలుడి భార్య తన మగనిపేరు చమత్కారంగా చెప్పిన సందర్భం. మగనిపేరు మగువలు వాచ్యంగా చెప్పని అలవాటు కూడా ఇందులో ద్యోతకం. ఇక 'దీని భావమేమి తిరుమలేశ' అనే మకుటంతో ఎన్నెన్ని పొడుపు కథలు వెలిశాయో మనకు తెలుసు.

'కుతిక నలుపుగాని శితి కంధరుడుగాడు, పాముగాదు, నెమిలిపక్షిగాను
గంతు లిడచు నడచుగాని కప్పయుగాదు దీని భావమేమి తిరుమలేశ!'
(ఊరపిచ్చుక)

గణిత, తర్క, వైద్య, జ్యోతిష శాస్త్రాలకి సంబంధించినవి ఎన్నో పొడుపు కథలున్నాయి. ఇట్లా శాస్త్ర సంబంధములైనవి కూడా ఉన్నాయి కనుకనే వీటికి శాస్త్రాలనే పేరు కూడా వచ్చింది.

పొడుపు కథలు పుట్టిన పరిస్థితులు వాటి రూపు రేఖలు కొంత కొంత పరిశీలించ బడినాయి. ఆర్థికంగా, చారిత్రకంగా, సామాజికంగా వీటికిగల సంబంధ బాంధవ్యాలు కూడా పరిశీలించటం అవసరం.

పూర్వకాలం రాజులు పండిత సభలు నిర్వహించి పొడుపు కథల పోటీలు పెట్టిన సందర్భా లున్నాయి. ఓడిపోయిన వాళ్ళు డబ్బు చెల్లించటమో, గెలిచిన వారికి లొంగి దాస్యం చెయ్యటమో, దేశాంతరగతులు కావటమో చేసేవాళ్ళు. ఇది ఓటమికి శిక్ష. సంస్కృత ప్రాకృతాంధ్ర భాషాపోషకులైన పలువురు ప్రభువులు తమ సభల్లో కవి పండితుల కిచ్చిన సమస్యలు, ప్రహేళికలు, వారు జవాబుగా చెప్పిన చాటువులు పొడవటానికీ విప్పటానికీ ఉదాహార్యాలే. పెద్ద పెద్ద యుద్ధాల్లో

రాజులు జన నష్టాన్ని నివారించటం కోసం ఇరు పక్షాలకు ప్రతినిధులుగా ఇరువురు పండితుల నెన్నుకొని వారిమధ్య పొడుపు కథల పోటీలు పెట్టి, వారి గెలుపోట ములు యుద్ధంలోని గెలుపోటములు గానే భావించేవారట. వీటికి చారిత్రకాధారాలు గట్టిగా చూపలేకపోయినా దంత కథలుగా వీటికి ప్రచారం లేకపోలేదు.

పొడుపు కథలకి సంబంధించి కొన్ని నమ్మకాలు, మూఢవిశ్వాసాలు కూడా వున్నట్లు తెలుస్తోంది. వానలు కురవటానికి, రాజ పుత్రికలకు తగిన రాజకుమా రులు దొరకటానికీ పొడుపు కథల వంటి ప్రహేళికలు ప్రయోగించేవారట !

వీటివల్ల ఆర్థిక ప్రయోజనాలూ అతిమాత్రంగానే ఉండేవి. కవి పండితులు రాజాశ్రయం పొందడం కోసం, సభాసన్మానాలు పొందటం కోసం పొడుపు కథలు విప్పే శక్తి ఎంతగానో ఉపయోగించేది. అల్పయాచకులవలె ఊరికే చెయ్యి చాపటంకంటె బుద్ధిజ్ఞానాలకు సంబంధించిన చమత్కార విద్యలు ప్రద ర్శించి ధనార్జన చెయ్యటం మేలుకదా! పొడుపు కథలు అందుకూ్కడా వినియోగిం చేవి.

ఇక జానపదులైన సామాన్య మానవుల జీవితాల్లో ఇవి ఎటువంటి వెలు గులు కుమ్మరించాయో ప్రత్యేకంగా పరిశీలించతగిన విషయం. పనిపాట్లు చేసు కుని హాయిగా ఇంత ఆరగించి, ఏ రచ్చబండల మీదనో ఆసీనులై జానపదులు జరిపే విజ్ఞాన గోష్ఠుల్లో పొడుపు కథది అగ్రస్థానం.

సంసారంలోను, సమాజంలోను మనిషికి మనిషికి పొత్తు కలిపేది మాట. మాట్లాడేందుకు అతి ముఖ్యమైన సాధనం నాలుక. రుచులు తెలుసుకొనేందుకూ అదే సాధనం. ఇటువంటి ఈ సాధనాన్ని పొడుపు కవి ఎంత సున్నితంగా వర్ణించాడో చూడండి:

1. గూట్లో గులాబిపూవు, ఎంత గుంజినా రాదు.
2. చిట్టెడు నీళ్ళలో చిలక పొర్లాడు.

ఎర్రటి నాలుక గులాబిపువ్వు లాంటిదట. చిలకలా ఎన్నో మాటలు చెబుతుందట. ఎంత వ్యాఖ్యానమైనా చెయ్యవచ్చు. అందుకవకాశమిచ్చే గంభీరత

పొడుపు కథలో ఉంటుంది. ముఖాముఖి మాట్లాడే అవకాశం లేని మనిషిని పలకరించాలంటే మార్గం ఉత్తరమే. జాబు ఉపయోగం తెలిసిన పొడుపుకవి పారవశ్యంతో పాట పాడేశాడు.

"సుట్ల సుట్ల పొట్లకాయ, సూసిరా పొట్లకాయ
మళ్ళిరా పొట్లకాయ, మాటదే పొట్లకాయ!"

జాబును పొట్లకాయతో పోల్చటం వల్ల ప్రాచీనకాలపు జాబుల రూపురేఖలు ఊహించుకోవలసివస్తుంది.

పొట్లకాయ ప్రసక్తి వచ్చింది గనుక ఒక్కమాట. కమ్మగా తినేందుకు నిత్యావసర వస్తువుల్లో కూరగాయలు ముఖ్యమైనవి. అరటి, దోస, మిర్చి, ఉల్లి ఎన్నో ఉన్నాయి. వీటిని దృష్టిలో వుంచుకొని పొడుపుకవి ఎంత కమ్మగా కథా గేయం అల్లాడో చూడండి.

"సుట్ల సుట్ల బావికాడ సుందరమ్మ తోటకాడ
ఆకు పుట్టె పోక పుట్టె
కొడుకును కొట్టేసె, కోడలు ముండమోసె."

నిరంతరంగా నీళ్ళు అందించే ఏతపుబావి; దానిని ఆవరించుకొని అందాల అరటితోట, అరటాకు, అరటిమొవ్వు, అరటిగెల, గెల కొట్టేసిన తరువాత చెట్టునే కొట్టేసే పద్ధతి - అంతా సూచితం. కోడలు ముండమోసె అనటంతో కొడుకులాంటి చెట్టే తెగిపడిపోతే దాన్ని ఆశ్రయించుకొన్న ఆకులు (కోడలు) వాడి వత్తలైపోవా?

చారలున్న గుండ్రని దోసకాయను ఎట్లా వర్ణిస్తాడో చూడండి.

"సార సారల చెంబు, సక్కన్ని చెంబు
ముంచితే మునగదు ముత్యాల చెంబు

కూరలోకి కారం కావాలి. అందుకు కావలసినది ఎర్రటి మిరపకాయలు పచ్చని ఆకులున్న చెట్టుకు ఎర్రటి మిరపకాయ ఎట్లా వుందంటే—

"పచ్చని సెట్టుకింద పిట్ట సమర్తాడె''

అన్నట్లుందట. సమర్తన్న ఒక్కమాటతో సృష్టిలోని రజోగుణ లక్షణం మొత్తం చెప్పినట్లైంది. ఎంత గడుసైనవాడు పొడుపు కవి!

కూరలోకి కారమెంత అవసరమో ఉల్లిగడ్డ అంతే అవసరం. ఆ మాట కొస్తే "ఉల్లి చేసినమేలు తల్లికూడా చెయ్యదు'' అంతేకాదు శ్రీ మహావిష్ణువులాగే శంఖ చక్రాలు ధరించివున్న జాణ ఉల్లిగడ్డ.

''అడ్డంకోస్తే చక్రం, నిలువుకోస్తే శంఖం''

కోసినప్పటి ఆకార రేఖల్ని గుర్తుచేస్తూ శంఖచక్ర ప్రస్తావనవల్ల పోషణ కర్త అయిన శ్రీమహావిష్ణువు స్ఫురిస్తాడు.

కాఫీ అనేది దేశంలో ఎప్పుడడుగుపెట్టినా అది పొడుపు కథల్లోకి ఎక్కిం దంటే కొంతకు కొంత ప్రాచీనత సంతరించుకొన్నట్లే. అది సంతరించి పెట్ట డానికే ఆధునికుడు ఈ పొడుపుకథ సృష్టించి వుంటాడు.

"సలసల మరిగిన ద్రవాలు రెండు
గరగరలాడెడు గుండలు రెండు''

కాఫీ అంటే 'కెఫిన్' గల కాఫీయే కానక్కర్లేదు. పాతకాలపు ధనియాల కాఫీ అయినా కావచ్చు. పిండిమరలు బాగా అందుబాటులోకి రాని రోజుల్లో గుండ కావాలంటే తిరగలే శరణ్యం. (కొన్నిటికి రోలూ రోకలి వాడటం కూడా కద్దు) ఈ తిరగలిని పొడుపుకవి ఎంత చమత్కారంగా వర్ణిస్తాడో చూడండి.

''పిలక పట్టుకొని గిరగిర తిప్పితే మొరుగు''

పిలకంటే తిరగలి పిడిఅనీ, మొరగటమంటే తిరగలి మోతనీ వేరే చెప్ప నక్కరలేదు. తిరిగేకల్లు (రాయి) గనుక తిరుగలి. గృహ వాతావరణాన్ని దృష్టిలో వుంచుకొనిచూస్తే ఇన్నిన్ని పొడుపుకథలు పుట్టుకొచ్చాయి. ఇల్లు అనగానే ముందు దాటవలసింది గడప. గడపమాను అడవిలో పుట్టింది. కాని ఇంటికి గడపై పసుపు కుంకుమ పూజలంది మహాలక్ష్మిలా వెలిసింది. అందుకే అంటాడు పొడుపు కవి——

"అడవిలో పుట్టింది అడవిలో పెరిగింది
మాయింటి కొచ్చింది మహాలక్ష్మిలాగుంది"

ఇంటికి కళ దీపం. ఇంట్లో దీపం పెట్టటమంటే కాపురం నిలబెట్టడమనే అర్థం. చీకటి బ్రతుకులకు చిరువెలుగు దివ్వెలు ఎంత అవసరమో మరీ మరీ

చెప్పక్కర్లేదు. పొడుపు కవి తన కవితాశక్తి అంతా కుమ్మరించి దీపం నిలబెడ తాడు చూడండి :

"అద్దంకి చెరువులో ముద్దంకి పిట్ట
ముక్కున బంగారం పెట్టుకొని తోకతో నీళ్ళు తాగుతుంది."

అంటే వత్తి కొనకొండి ప్రమిదలోని నూనెను తాగుతుందన్నమాట.

ప్రమిదను గూర్చిన వర్ణనకూడా అద్భుతమే.

"అందమైన చెరువులో ముద్దొచ్చే పిట్ట
మూతికి బంగారం, తోకతో నీరు త్రాగేను."

మనిషికి బహిఃప్రపంచంతో సంబంధం కలిపేది కన్ను, నోరు-వాటిని ఫనిచేయించేది మంచిమనసు. రెప్పలు విచ్చి చూడాలి, నోరు విచ్చి మాట్లాడాలి, రెప్పలు చప్పుడు లేకుండా విచ్చుకుంటాయి, మూసుకుంటాయి. కంటిపాపలో బహిః ప్రపంచం ప్రతిఫలిస్తుంది.

"కిట కిట తలుపులు కిటారి తలుపులు
ఎప్పుడు తీసిన చప్పుడు కావు"

సినిమా ప్రపంచానికూ్కడా ఎక్కిన (జమీందార్) కనురెప్పల పొడుపు కథ ఇది. చిత్ర రచయితలు కూడా పొడుపు కథను బాగానే వాడుకొన్నారు. కంటిపాపను 'కులుకుల పాప' అంటాడు వెనుకటి పొడుపు కవి. పైనా క్రిందా వుండే రెప్పలు 'పలక' లంటాడు పాతకాలపు పొడుపు కవి.

"కింది పలక పైన పలక
పలకల సందున కులుకుల పాప"

ఈ పొడుపు కథే కొద్ది మార్పుతో నాలుకను కూడా సూచిస్తుంది.

"కిందొక పలక పైనొక పలక
పలకల కిందొక మెలికల పాము"

జీవితంలోని అన్ని రసాల్లోకి శృంగారం బంగారం. పొడుపుకథను అది ఎంతగా వలగొన్నదో పరిశీలించి తెలుసుకోవలసిందే. పొంగే వయసులో వున్న కన్నెపిల్ల పైటకొంగు ఏ కొంటెవెధవో గుంజాడు. పొడుపుకవి ఆ దృశ్యాన్ని ప్రకృతి కన్వయించి అద్భుతంగా చిత్రించాడు. ఆ అమ్మాయి మాటల్లోనే చిత్రిం చాడు.

"సిటుకు సిటుకు మట్టె లెట్టుక
మంచినీళ్ళబాయి కోతె
కొంటె ముండా వాడు కొంగు గుంజె"

ఆ కొంటెముండా వాడెవడో కాడు. రేగు కంప. ముళ్ళకంపలో చిక్కు కొన్న బ్రతుకు అంతేనేమో!

సమాజం నడిబొడ్డున అలముకొన్న రేగుకంపల్ని ఏరివెయ్యటం కూడా పొడుపు కవి లక్ష్యాల్లో ఒకటి. బుద్ధిని వికసింపజేస్తూ చమత్కారాన్ని చిందింప జేస్తూ, సామాజికులకు ఆనందం కలిగించటమే పొడుపు కథ పరమలక్ష్యం.

ఇన్ని మాటలెందుకు? పొడుపు కథ అనేది - నిలిచి నిబ్బరంగా రసస్థితికి తీసుకుపోలేకపోయినా, బుద్ధిని గిలకొట్టి వస్తువును గడుసుగా ధ్వనింపజేస్తుంది. చిరునవ్వులు చిందింపజేస్తుంది. లయబద్ధంగా కదిలి చెవికింపు గలిగిస్తుంది. క్రీడా వినోదం కలిగిస్తుంది. తత్త్వాన్ని స్పృశించి ఆనందం కలిగిస్తుంది. శాస్త్ర విజ్ఞానాన్ని ప్రసాదిస్తుంది. పిల్లలకు సంతోషం కలిగిస్తుంది. గంతులు వేయి స్తుంది. పెద్దల్ని పరవశింపజేస్తుంది. సంఘంలో వున్న 'గోడమీద బొమ్మల' కొండీలు విరిచి రక్షణ కల్పిస్తుంది.

తూర్పున ప్రొద్దుపొడిచి, లేయెండ విరిజిమ్మినట్లు పొడుపుకథ విజ్ఞాన వికాసాల్ని విస్తరింపజేస్తుంది. మనిషి అంతర్వాణిని ఒకతట్టు తట్టి లేపుతుంది. మారు కథలు, మారుతట్లు, చిటుకులు, చిట్కాలు ప్రదర్శిస్తుంది. చిక్కుముళ్ళు విడదీసి, సమస్యలు పరిష్కరించి, అడ్డు కథలు విడమరిచి. ఒడ్డు కథలను మన్నించి, మనస్సు కాహ్లాదం కలిగిస్తుంది. జనంలో ప్రచారం పొందిన పొడుపు కథలు వెంటనే ఆనందం కలిగిస్తాయి. ప్రచారం పొందనివి నిదానంగా ఆనందం కలిగిస్తాయి. ఆనంద సిద్ధి మాత్రం తథ్యం.

**తుది పలుకు :**

మన దేశంలో కూడా పాశ్చాత్య దేశాల్లో వలెనే జానపద సాహిత్య అధ్య యనం సశాస్త్రీయంగా జరుగుతున్నమాట వాస్తవం కాని ప్రత్యేక అధ్యయన సంస్థలు ఇంకా వృద్ధిచెందాలి.

నానుడులకు న్యూనుడులు సృష్టిస్తున్నట్లే, పాత సామెతలనుండి కొత్త సామెతలు కొత్త జీవితాల కన్వయిస్తూ రాయవచ్చు. కాని చిరకాలంగా చెలామణిలో వున్న సామెతలకూ, పొడుపు కథలకూ కొత్త తొడుగులు తొడిగి ఆధునిక జీవితానికి అన్వయించే ప్రయత్నం కత్తిమీద సామువంటిది. అయినా ప్రయత్నించటంలో తప్పులేదు.

అన్నిటికంటే ముఖ్యమైంది - ఇంకా అలబ్దంగానే వుండి అంతరించిపోతున్న పాత సామెతల్నీ, పొడుపు కథల్నీ సేకరించే ప్రయత్నం. ఇది క్రమబద్ధంగా జరగాలి. సమాజ శ్రేయస్సుకి ఇది ఎంతో అవసరం. ఈమార్గంలో ఇంతవరకు కృషి జరిపిన వారికి కృతజ్ఞత చెపుతూ, కొత్తగా కృషికి పూనుకొనే వారికి స్వాగతం పలకటం మనవిధి.

**సంప్రతించిన గ్రంథాలు :**


1. ఆంధ్రుల జానపద విజ్ఞానం -డాక్టర్ ఆర్వీయస్ సుందరం 1983
2. 'పొడుపుకథలు', 'గోడమీద బొమ్మ' -డాక్టర్ వెలగా వెంకటప్పయ్య 1981, 1979
3. తెలుగు సామెతలు -డాక్టర్ దివాకర్ల వేంకటావధాని మొ॥ సంపాదకత్వం 1974
4. సామెతలు శ్రీమతి సి. వేదవతి 1983
5 తెలుగు జానపద గాథలు మొదలైన అనేక గ్రంథాలు -డాక్టర్ నాయని కృష్ణకుమారి 1977

# లిఖిత జానపద సాహిత్యం

## — ఆర్వీయస్. సుందరం

లిఖిత సాహిత్యంలేని నిరక్షరాస్య సమాజంలో భావాభివ్యక్తి మౌఖికంగానే జరుగుతుంది. జానపద విజ్ఞానమంతా మౌఖికంగానే ప్రసారమౌతుందని అనేక విద్వాంసులు భావించారు. విద్యావంత సమాజంలో మౌఖిక ప్రసారం లేదని కాదు. కాని విద్యావంతుల అభివ్యక్తి బుద్ధి శక్తిని ప్రతిబింబించేది; జానపదుల పల్కులు ముగ్ధభావ ప్రతినిధులు. అలాగని జానపదుల ముఖతః వెలువడేదంతా జానపద విజ్ఞానం కాదు. మౌఖిక ప్రసారం జానపద విజ్ఞాన పరిధిని నిర్ణయించే ఒక మానదండమని మాత్రమే విద్వాంసులు భావించారు.

మౌఖిక ప్రసారం జానపద విజ్ఞానాన్ని నిర్ధరించే సూచికగా అంగీకరించడంతోగల చిక్కును ఇటీవలి జానపద విద్వాంసులు గమనించారు. జానపద నృత్యాలను నోటితో నేర్పాల్సిన అవసరం లేదు. వృత్తికళల్ని మౌఖికంగా బోధించాల్సిన అవసరంలేదు. చిత్రకళను, సాంప్రదాయిక ప్రతీకలైన 'స్వస్తిక్' లాంటి వాటిని చూచి కూడా తెలుసుకోవచ్చు. నమ్మకాలు, వంట-వార్పు, దుస్తులు, ఆభరణాలు, కర్మకాండలు మొదలైనవికూడా జానపద విజ్ఞానంలో భాగమే. అందువల్ల ఇటీవలి విద్వాంసులు శాబ్దిక విజ్ఞానం, శాబ్దికేతర విజ్ఞానం, జానపద విజ్ఞానంలో రెండు ముఖ్య విభాగాలుగా పేర్కొంటున్నారు.

జానపద సాహిత్యం శాబ్దిక కళ. మౌఖిక జానపద విజ్ఞానానికే జానపద సాహిత్యమనేది మరోపేరు. అంటే జానపద సాహిత్యం మౌఖికంగా ఒక తరం నుంచి మరోతరానికి సంక్రమిస్తుందన్నమాట. మౌఖిక ప్రసారం వల్లనే జానపద సాహిత్య ప్రధాన లక్షణమైన మౌఖిక సంప్రదాయం అన్నది ఏర్పడుతుంది. దీనివల్లనే మౌఖిక సాహిత్యానికి అనేక పాఠాంతరాలు ఏర్పడతాయి.

ఇక లిఖిత జానపద సాహిత్యం అన్నది అర్థంలేనిదని పిస్తుంది. జానపదుల్లో లిఖిత సాహిత్యమే లేనప్పుడు, లిఖితమైంది జానపద సాహిత్యమని అంగీకరించనప్పుడు, లిఖిత సాహిత్య ప్రమాణాలే వేరయినప్పుడు లిఖిత జానపద సాహిత్యమేమిటి? అనే ప్రశ్న ఉదయిస్తుంది. కాని లిఖిత జానపద సాహిత్యం అనే పేరును, మూడురకాల సాహిత్యానికి అన్వయించి చెప్పవచ్చుననిపిస్తుంది :

1 భాషా విజ్ఞానం, మానవశాస్త్రం మొదలైన వాటిలాగే జానపద విజ్ఞానాన్ని అంతర్జాతీయ స్థాయిగల ఒక శాస్త్రంగా రూపొందించాలని కృషి చేస్తున్న విద్వాంసులు కొన్ని సూత్రాలను రూపొందించారు. జానపద విజ్ఞానం పల్లెటూరికి మాత్రమే సంబంధించిందికాదనీ నగర జానపద విజ్ఞానంకూడా ఉండవచ్చనీ వీరి వాదం. అంటే జానపద విజ్ఞానాన్ని అది ఉత్పత్తి అయ్యే స్థలాన్ని బట్టి కాక దాని స్వరూపాన్ని బట్టి, దాన్ని సృష్టించే మానవ మనస్తత్వాన్నిబట్టి నిర్ణయించాలి. జానపదసాహిత్యం సామాన్యంగా మౌఖికమని ఒప్పుకున్నా, నగర జానపద విజ్ఞానంలో భాగంగా కొన్ని లిఖిత జానపద సాహిత్య ప్రక్రియలు మౌఖిక సూత్రానికి అపవాదంగా వెలువడ్డాయి. మరుగుదొడ్లలో రాతలు, ఆటోగ్రాఫ్ రాతలు, పుస్తకాల మార్జిన్ రాతలు, సమాధి ఫలకాల మీద రాతలు, గొలుసు జాబులు మొదలైన వాటిని ఉదాహరణాలుగా పేర్కొనవచ్చు.

2. విద్యావంత సమాజంలోని వారే జానపద సాహిత్య ప్రమాణాలకనుగుణంగా కొన్ని సాహిత్య ప్రక్రియల్ని సృష్టిస్తారు. అవి వందల కొద్దీ ఏళ్ళు సామాన్య జనం నోళ్ళలో నాని జానపద సాహిత్యంలో భాగంగానే చలామణీ అవుతాయి. వీటి రచయితలు మరుగునపడి రచనలు మాత్రం జానపదులవిగానే ప్రచారంలో ఉంటాయి. అంటే లిఖిత సాహిత్యంగా మొదలై లిఖిత జానపద సాహిత్యంగా రూపొంది తర్వాత జానపద సాహిత్యంలో భాగంగానే పరిగణింపబడేవి ఈ వర్గం కిందికి వస్తాయి. ఉదాహరణకు కొన్ని అన్నమయ్య కీర్తనలు, రామదాసు కీర్తనలు, మర్యాద రామన్న కథలు, తెనాలి రామలింగని కథలు మొదలైన వాటిని పేర్కొనవచ్చు.

3. విద్యావంతులు లిఖిత సాహిత్య ప్రమాణాలనూ మౌఖిక సాహిత్య ప్రమాణాలనూ కలగాపులగం చేసి రాయగా ఏనాడూ మౌఖిక సంప్రదాయంగా రూపొందని సాహిత్యం మూడోరకం. దీన్నే జానపద సాహిత్యంగా కొందరు పిలుస్తారు. కాని దీనికి మంచి పేరు జానపద సాహిత్యాభాసం (ఫేక్ ఫోక్ లిటరేచర్). ఇలాంటి జానపద విజ్ఞానాభాసాన్నే 'ఫేక్‌లోర్' అంటారు. విజ్ఞత గల ఏ జానపద విద్వాంసుడూ ఇలాంటి దాన్ని జానపద సాహిత్యంలో చేర్చడు. ఎంకి పాటలు బంగారి మామ పాటలు 'జానపదబ్రహ్మ' కొసరాజు సినిమా సాహిత్యం ఇలాంటిదే. ఇవన్నీ జానపద సాహిత్యానుకరణలే కాని జానపద సాహిత్యం కాజాలవు.

పై చర్చవల్ల నిజమైన లిఖిత జానపద సాహిత్యం ఏది అనే విషయం స్పష్టమయిందను కుంటాను. పై మూటిలో మొదటి దాన్ని మాత్రమే సరైన అర్థంలో లిఖిత జానపద సాహిత్యమని పిలవవచ్చు. రెండవది మొదట లిఖిత జానపద సాహిత్యంగానే వెలువడినా తర్వాత మౌఖిక సంప్రదాయంలో భాగం కావడంవల్ల అది జానపద సాహిత్యమే అవుతుంది గాని లిఖిత సాహిత్యం కాదు. మూడవరకం జానపదాభాసమేగాని జానపద విజ్ఞానంలో భాగమే కాదు.

పై నిర్ణయాలు తీసుకోడానికి కారణాలేమిటి, లిఖిత సాహిత్యాన్నీ మౌఖిక సాహిత్యాన్నీ వేరు చేయడానికి అనుసరించాల్సిన ప్రమాణాలేమిటి అన్న విషయాలను వివరించాల్సి ఉంది.

మౌఖిక సాహిత్య సూత్రాలు Oral - Formulaic theory అనే పేరుతో ప్రసిద్ధమయ్యాయి. ప్యారి (Parry) అనే విద్వాంసుడు హోమర్ మహా కావ్యాలను యూరపు వీరగాథా కవిత్వంతో పోల్చి మౌఖిక గేయ లక్షణాలను విశ్లేషించడానికి ప్రయత్నించాడు. ఈ సిద్ధాంతాన్ని జానపద కథలు మొదలైన వాటికి కూడా అన్వయించి మొత్తంమీద మౌఖిక - లిఖిత సాహిత్యాల మధ్య గల వ్యత్యాసాలను గమనించవచ్చునని ఈ సిద్ధాంతకర్తల అభిప్రాయం. "The Singer of Tales" (1960) లో లార్డ్ వీరగాథాకారుల రచనా విధానాన్ని చక్కగా విశ్లేషించి చూపాడు. సి. ఎం. బౌరా 'ప్రిమిటివ్ సాంగ్' అనే పుస్తకంలో ఆదివాసుల కవిత్వాన్ని విశ్లేషించే ప్రయత్నంలో భాగంగా

మౌఖిక సాహిత్య ప్రధాన లక్షణాలను చక్కగా వివరించి చూపాడు. ఆయన చెప్పిన ముఖ్య లక్షణాలను ఇలా క్రోడీకరించవచ్చు.

1. ప్రాచీన కవిత్వంలో ఒక్కొక్క పాదమూ కనిష్ఠాంశంగా ఉండడం సామాన్యంగా కనిపిస్తుంది. (పు. 72).

2. ప్రాచీన కాలపు మౌఖిక కవిత్వం ఆధునిక కవిత్వంలాగా వివిధ రకాల జనులకోసం ఉద్దేశింపబడింది కాదు. ప్రాచీన సమాజంలోని కవి తన చిన్న గుంపు కోసమే కవిత్వాన్ని రచిస్తాడు. (పు. 72)

మౌఖిక సాహిత్యాన్నే ఆశుసాహిత్యమనే పేరుతో చెప్పి లక్షణ చర్చ చేసిన వారిలో ముఖ్యులు డా. వెల్చేరు నారాయణరావు. లిఖిత సాహిత్యానికీ అలిఖిత సాహిత్యానికీ వేరే విమర్శా ప్రమాణాలను అన్వయింప జేయాలని వీరి వాదం. కాని వీరి లక్షణ చర్చ అంతా కేవలం కథాగేయాలను, కొంతవరకు గేయాల్ని దృష్టిలో పెట్టుకొని సాగింది. లార్డ్, సి. ఎం. బౌరా మొదలైనవారు కవిత్వానికి మాత్రమే అన్వయించి చెప్పిన ప్రమాణాలనే తెలుగుకు అన్వయించి చెప్పడంవల్ల ఆశు సాహిత్యమనే పదం చాలా పరిమితార్థాన్ని సంతరించుకుంది. జానపద కథలు, సామెతలు, పొడుపు కథల వంటి ఇతర మౌఖిక సాహిత్య ప్రక్రియలకు వీరి సూత్రాలను అన్వయించడానికి వీలులేదు. అయితే లిఖిత కవిత్వాన్ని గురించిన అనేక విషయాల్ని తెలుగువారికి తెలిపినవారు నారాయణ రావుగారే (తెలుగులో కవితా విప్లవాల స్వరూపం).

పై వారి చర్చల్ని, సిద్ధాంతాల్ని దృష్టిలో ఉంచుకొని లిఖిత సాహిత్యాన్ని జానపద సాహిత్యం నుంచి వేరు చేయడానికి మార్గాలేమైనా ఉన్నాయా అని అన్వేషించవచ్చు. మౌఖిక సంప్రదాయం గల జానపద సాహిత్యంలోని చరణాలలో, వర్ణనలలో, కథా కథనంలో పడికట్టు పద్ధతి ఉండడం ముఖ్య లక్షణంగా పేర్కొనవచ్చు. లిఖిత సాహిత్యంలో పునరుక్తి దోషమైతే మౌఖిక సాహిత్యంలో గుణం. పునరుక్తి ఎక్కడున్నా దోషమే అని పండితులు వాదించవచ్చు. కాని జానపద సాహిత్యంలో కథా శ్రవణం లేక గీత శ్రవణం ఉంటుంది కాబట్టి పునరుక్తులు చైతన్యవంతమైన ఆలంబనాలవుతాయి. జానపద సాహిత్యం కథా

రూపం కలదైతే ఆ కథ సరళరేఖలాగా కొనసాగకుండా వర్తుల క్రమంలో ముందుకు సాగుతుంది. జానపద కథలకు ఒక ప్రారంభమని, నిర్దిష్టమైన ముగింపని ఏదీ ఉండదు. పడికట్టు వర్ణనలు అన్ని పాత్రలకూ వర్తిస్తాయి. జానపద సాహిత్యానికి ఒక శ్రోత అంటూ ఉంటాడు కాబట్టి స్వగతాలు ఉండవు.

లిఖిత సాహిత్యాన్ని రూప విశ్లేషణద్వారా పై ప్రమాణాలను అన్వయించి మౌఖిక సాహిత్యాన్నుంచి వేరు చేయవచ్చు. కాని తెలుగు సాహిత్యం విషయంలో కొన్ని చిక్కులున్నాయి. కొన్ని దేశాల్లో లిఖిత సాహిత్యమే ఒక వర్గానిది, మౌఖిక సాహిత్యమే మరో వర్గానిది. కాని తెలుగుదేశంలోనే కాక భారతదేశం లోని పలు ప్రాంతాలలో అగ్రవర్ణాలలోనూ మౌఖిక సాహిత్యం ఉంది; వెనుక బడిన తరగతుల్లోనూ ద్విపదలాంటి ఛందస్సులు ప్రచారంలో ఉన్నాయి. దీని వల్ల మౌఖిక సాహిత్యం లిఖితరూపం పొందడమూ సాధ్యమైంది, లిఖితరూపంలో మౌఖిక సాహిత్యమూ నిర్మాణమయింది.

దీనివల్ల తేలేదేమిటంటే మనదేశంలో నిరక్షరాస్యులకూ మౌఖిక సాహిత్య ప్రమాణాలతోబాటు లిఖిత సాహిత్య ప్రమాణాల పరిచయమూ ఉంది. అలాగే విద్యావంత సమాజంలో లిఖిత సాహిత్యంతోబాటు మౌఖిక సాహిత్యమూ ప్రచారంలో ఉంది. ఈ కారణాలవల్లనే జానపదుల లిఖిత సాహిత్యానికీ, నన్నయాదుల లిఖిత సాహిత్యానికీ ముడిపెట్టి సంబంధాలను గాని వ్యత్యాసాలను గాని విశ్లేషించడం సరియైన పద్ధతి కాదని కవిసేన ప్రచురించిన పత్రాల్లో శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ గారు అంటారు. శర్మగారి మాటలు తెలుగు వారి నేపథ్యంలో సమంజస మనిపిస్తాయి. కథలు, సామెతలు, పొడుపుకథలు మొదలైనవి మౌఖికాలేగాని ఆశు సాహిత్యమని చెప్పదగినవి కావు. అందువల్లనే నారాయణరావు గారి అభిప్రాయాలను జానపద సాహిత్య ప్రక్రియ లన్నిటికీ అన్వయించి చెప్ప డానికి వీలుకాదని పైన చెప్పాను.

విద్యావంతుల సాహిత్యం గాని జానపద సాహిత్యం గాని పరస్పర ప్రభా వానికి లోనుకాలేదని చెప్పే సాహసం ఎవరికీ లేదు. ప్రఖ్యాత విద్వాంసులైన విలియం ఆర్. బేస్కమ్ శాబ్దిక కళ (Verbal art) అనే ఉపన్యాసం ఇస్తూ (1958) చెప్పిన మాటలు గమనించదగ్గవి. ఇవి తర్వాత Journal of

American Folklore (1955) లో అచ్చయ్యాయి: "Verbal art is composed and transmitted verbally, while literature is composed in writing and transmitted in writing. Yet it is obvious that these two traditions have not followed independent courses, but have intermingled and influenced one another."

పై కారణాలవల్లనే కొన్ని సందర్భాలలో శిష్టకవుల రచనలు కూడా తెలుగులో జానపదుల హృదయాలను చూరగొన్నాయి ఏగంటి వారి వచనాలు, చిట్టన్నగారి వచనాలు, అన్నమయ్య రచనల్లో జానపద శైలిలో రచితమైన కీర్తనలు, రామదాసు భజనకీర్తనలు మొదలైన వాటిని ఇక్కడ పేర్కొవచ్చు. కాని వీటిలో కొన్ని మాత్రమే జానపద గేయాలుగా చలామణీ అవుతున్నాయి. ఎందుకంటే శిష్టకవుల రచనల్లో భావాలు, శైలి, అనుభవం జానపదుల రచనల కంటె భిన్నంగా ఉంటుంది. అన్నమయ్య రచనల్లో లాలిపాటల వంటి చాలా కొద్ది మొత్తంలో రచనలు తప్ప జానపద శైలిలో వెలువడిన వేవీ జానపద గేయాలుగా మారలేకపోయాయి. రామదాసు కీర్తనలు కూడా భజనకూటాలలో తప్ప సామాన్య జనప్రవాహంలోకి చొచ్చుకుపో లేదు.

ఇటీవలి కాలంలో గద్దర్, వంగపండువంటి వారు జానపదరీతుల్లో పాటలు కట్టి మౌఖికంగానే ప్రచారం చేస్తున్నారు. వీరి పాటల్ని జానపద గేయాలుగా పేర్కొనవచ్చా అంటే వీలుకా దన్నదే జవాబు. జానపద గేయాలకు తరతరాలలో వాడుకవల్ల అనేక పాఠాంతరా లేర్పడతాయి. వాటిని పాడేవారు అవి తమవే అని భావిస్తారు. తమ పదాలను, భావాలను చేరుస్తారు. పాట రచయిత పూర్తిగా అప్రధానుడై పోతాడు. ఈ లక్షణాలేవీ లేని ఇటీవలి జానపద అనుకరణ గీతాలు జానపదాభాసాలు మాత్రమే.

అన్నమయ్య కాలంనుంచీ నేటివరకూ కూడా ఎంతో మంది ఉన్నత సమాజ సాహితీపరులు మౌఖిక సాహిత్యాన్ని సృష్టించాలని చూచారు. కాని వారిలో చాలా కొద్దిమంది మాత్రమే జయం సాధించగల్గారు. లయపరంగా భావపరంగా, శైలీపరంగా జానపదుల స్థాయిలో రాయగల్గినవారు మాత్రమే త:

సాహిత్యానికి మౌఖిక సాహిత్య స్థాయిని రాబట్టుకోగల్గారు. వ్యక్తిత్వాన్ని వదలి పెట్టలేనివారు, తమ ముద్రను సాహిత్యంలోనుంచి పారద్రోలలేనివారు, సామూహిక పునస్సృష్టికార్యానికి దోహదం చెయ్యలేని శైలిలో రాసేవారు జానపద సాహిత్య నిర్మాణం చెయ్యలేరు. సులభంగా రాయడం, అకృతక శైలిలో రాయడం, సామూహిక సుప్తప్రజ్ఞను ప్రతిబింబించేలా రాయడం శిష్టసాహితీ వేత్తలకు కష్టమే అవుతుంది. అందువల్లనే మనం జానపద సాహిత్యాన్ని లిఖిత సాహిత్యంనుంచి వేరుచేసి చూడగలుగుతున్నాం.

* * *

ఈ చర్చను ఇంతటితో నిలిపి ప్రముఖ జానపద విద్వాంసులు కొంత వరకు వివరించి చూపిన అసలైన లిఖిత జానపద సాహిత్యాన్ని గురించి కొంత చెప్తాను.

లిఖిత జానపద సాహిత్యం ఎక్కువగా నగర జానపద విజ్ఞానంలో భాగం. నాగరిక సమాజం లిఖిత రూపాలకు ఎక్కువ ప్రాధాన్యం ఇస్తుంది. కాని నాగరికుల్లో జానపద మనస్తత్వం మాత్రం పూర్తిగా మరుగున పడిపోదు. మనిషి ఎంత నాగరికుడైనా అతనిలో ప్రాచీన మానవుని మనస్తత్వం సుప్త ప్రజ్ఞా స్థితిలో అడగి ఉంటుంది. అందువల్లనే ఒంటరిగా ఉన్నప్పుడు ఒక విధంగా ప్రవర్తించే వ్యక్తి పదిమందితో ఉన్నప్పుడు మరో విధంగా ప్రవర్తిస్తాడు. అలాగే మనసులోని లోపొరల్లో అడిగిన ఆశలు, ఆకాంక్షలు, ఆశయాలు వివిధ ప్రదేశాల్లో, వివిధ రీతుల్లో వ్యక్తమవుతాయి. ఉదాహరణకు విద్యాధికుడైన యువకుడు కూడా ఎవరిమీదన్నా విపరీతమైన ద్వేషం కలిగినప్పుడు ఏ ఆకాశరామన్న ఉత్తరమో రాసి దాన్ని తీర్చుకుంటాడు. కామోద్రిక్తుడైన తరుణవిద్యార్థి మగురుదొడ్లో కూర్చొని చిత్రాలు గీస్తాడు, పిచ్చిపిచ్చిగా రాస్తాడు. ఇలాంటి రాతలు మౌఖిక ప్రసారం కలవి కావు. కాని మిగిలిన అన్ని విషయాలలోను జానపద సాహిత్యానికి సమానమైనవే. అచేతన స్థితిలో, సామూహిక స్పృహతో, ప్రాచీన మానవుని మనస్సును ప్రతిబింబించే వెలువడినవి. అందువల్ల ఇలాంటివన్నీ లిఖిత జానపద సాహిత్యంలో చేరుతాయి. వీటిలో కొన్ని ఈ క్రింద విధంగా ఉన్నాయి.

1. మనకంటూ ఒక సాంప్రదాయిక లేఖా సాహిత్యం వుంది. క్షేమ సమాచారాలు రాసేటప్పుడు 'క్షేమం' అని పైన రాయడం, ప్రియమైన, గంగా భాగీరథీ సమానురాలైన, కుంకుమ శోభితురాలైన, చిరంజీవి వగైరాలతో ప్రారంభించడం మొదలైన వాటిని ఇక్కడ పేర్కోవచ్చు. శుభ కార్యాలను సూచించటానికి జాబులను ఒక విధంగా, అశుభ కార్యాలను సూచించడానికి మరో విధంగా రాయడం మన సంప్రదాయం. పాశ్చాత్యులలో ప్రేమలేఖల విషయంలో కూడా అనేక సంప్రదాయా లున్నాయి. కవరుమీద S.W.K. అని రాసిఉంటే అది ప్రేమలేఖ అన్నమాట (S.W.K = Sealed With Kiss).

2. మరుగుదొడ్డి రాతలు లిఖితజానపద సాహిత్యమే. అమెరికా వంటి అభివృద్ధి శీలదేశాల్లో మరుగుదొడ్లు స్వచ్ఛంగా, అందంగా నిగనిగలాడుతూ ఉన్నా గోడలమీద రాతలు కనిపించక మానవు. ప్రొ॥ రీడ్ మరుగుదొడ్లమీద రాతల్నే కాకుండా, మెట్లమీద బండలమీద పేర్లు, పద్యాలు చెక్కడం మొదలైన వాటిని పరిశీలించి వాటికి జానపద శాసనశాస్త్రం అని పేరుపెట్టాడు. ముఖ్యంగా మరుగుదొడ్డి రాతలు అశ్లీల పదజాలంతో కూడి ఉంటాయి. అయితే మన సత్వ పరిశీలనకు అవిచాలా బాగా దోహదం చేస్తాయి. అలన్ డండెస్ ఒక సందర్భంలో గోడమీది బొమ్మలు, రాతలను (mural writings) గురించి చెపూ "one folklorist is primarily interested in those mural inscriptions which are traditional in both form and content" అన్నారు. ఇలాంటి రాతల్ని ఇంగ్లీషులో latrinalia అంటారు.

3. ఆటోగ్రాఫ్ పుస్తకాల వాడుక నాగరికుల్లో ఉంది. ఆటోగ్రాఫుల్లో కొందరు ప్రముఖ రచయితల వాక్యాలను రాస్తూ ఉంటారు. మరికొందరు తామే పద్యాలను వాక్యాలను ఊహించి రాస్తుంటారు. ఆశీర్వచనాలు, ఆశయాలు, వందనాలు, ఉపదేశాలు వగైరా ఈ రాతల్లో కనిపిస్తుంటాయి. కొందరు ఊరక సంతకం చేసి వదిలేస్తారు.

4. ముద్రిత గ్రంథాల్లో మార్జిన్‌రాతలు కూడా లిఖిత జానపద సాహిత్యమే. కొందరు తమది ఇతరులది అనే భేదం లేకుండా పుస్తకాల్లో శాసనాలు లిఖిస్తారు. కొన్ని రాతలు అభిప్రాయాల రూపంలో, కొన్ని విమర్శల రూపంలో మరికొన్ని

వ్యాఖ్యాన రూపంలో ఉంటాయి. ఈ విధంగా రాయడమనేది ఒక సంప్రదాయంగా ఏర్పడింది కాబట్టి ఇదీ జానపద సాహిత్యంలో ఒక భాగమే.

౯. సాంప్రదాయిక పత్రాలు, ఉత్తరాలు మొదలైన వాటినికూడా ఈ శీర్షిక కిందికే చేర్చవచ్చు. ఋణపత్రాలు, దానపత్రాలు, భూవ్యవహార పత్రాలు మొదలైనవి రాయడంలో కొన్ని పద్ధతులున్నాయి. గొలుసు ఉత్తరాలుకూడా లిఖిత జానపద సాహిత్యంలో ఒక భాగమే. ఏదైనా విషయాన్ని రాసి "దీన్ని మళ్ళీ నకలుచేసి మీ స్నేహితులకు పంపాలి. లేకుంటే మీకు అశుభం జరుగుతుంది'' అనే బెదరింపుకల ఉత్తరాలు అప్పుడప్పుడూ వస్తూ ఉంటాయి. ఇలాంటి గొలుసు ఉత్తరాలను రాసే సంప్రదాయం మనలోనేకాక అభివృద్ధిశీల దేశాల్లో కూడా ఉంది.

గోడలపై నినాదాలు రాయడం, బ్యానర్లపైన నినాదాలు, స్వాగత వాక్యాలు రాయడం మొదలైనవి కూడా ఈ శీర్షికకిందనే చేర్చవచ్చు. అయితే ఏదో ఒక పార్టీతరఫున గాని, వ్యవస్థిత సంఘాల తరఫునగాని, రాజకీయ సంస్థల తరఫున గాని రాసేవి జానపదసాహిత్యం క్రిందకి రావు. అలాగే వ్యాపార ప్రకటనలు మొదలైనవి కూడా ఈ విభాగంలో చేరవు. అవ్యవస్థితంగా, విభిన్న పాఠాలతో జానపద మనస్తత్వాన్ని ప్రతిబింబించేవి మాత్రమే లిఖిత జానపద సాహిత్యం కిందికి వస్తాయి. సమాధి రాళ్ళమీద రాతలు, పుణ్యక్షేత్రాల మెట్లమీద, దేవాలయం గోడలమీద రాతలు, బల్లల మీద విద్యార్థులు రాసే రాతలు మొదలైనవి కూడా లిఖిత జానపద సాహిత్యంలో చేర్చవచ్చు.

యక్షగానాలు, తాళపత్ర గ్రంథాల రూపంలో దొరికే వీరగాథలు స్త్రీల పాటలు మొదలైనవి లిఖిత జానపద సాహిత్యంలో చేర్చవచ్చా అనే అంశం గురించి చెప్పి ఈ ప్రసంగ వ్యాసాన్ని ముగించవచ్చు. లిఖితరూపంలో ఉండే జానపద సాహిత్యంగా పేర్కొన్న నగర జానపద విజ్ఞాన విషయాలు కాక మరేవైనాసరే మౌఖిక సంప్రదాయం కలిగి ఉండాల్సిందే. ఏనాడూ మౌఖిక సంప్రదాయంలో బతకని యక్షగానాలు, వీరగాథలు మొదలైనవి జానపద సాహిత్యం కా నేరవు. అందువల్ల రంగాజమ్మ, విజయరాఘవనాయకుడు లాంటి వాళ్ళు రాసిన యక్షగానాలు జానపద సాహిత్యం కానేకావు. జానపదాభాసాలు

మాత్రమే. ఒకవేళ మౌఖిక రూపంలో ప్రచారమవుతూ కూడా (పల్నాటి వీర చరిత్ర, కాటమరాజుకథ లాగా) గ్రంథస్థమై ఉంటే అలాంటివి జానపద సాహిత్యంలో భాగమే అవుతాయి. లిఖిత రూపంలో ఉంటే అలాంటి సాహిత్యాన్ని గ్రాంథిక జానపద విజ్ఞానం అనో చారిత్రిక పాఠం (historical variant) అనో పిలవవచ్చు. అందువల్ల లిఖిత జానపద సాహిత్యమన్నదొకటి వేరుగా ఉందనీ, గేయం, కథ, కథాగేయం వంటివి లిఖిత రూపాన్ని పొందినా అవి తప్పక మౌఖిక ప్రసారం పొందాలని ఈ చర్చవల్ల తేలుతోంది.

**ఉపయుక్త గ్రంథాలు**


1. ఆంధ్రుల జానపద విజ్ఞానం - ఆర్వీయస్. సుందరం, ఆం. ప్ర. సాహిత్య అకాడెమీ, హైదరాబాదు, 1983.
2. జానపద సాహిత్య స్వరూపం - ఆర్వీయస్. సుందరం, 1976.
3. తెలుగు - కన్నడ జానపద గేయాలు - ఆర్వీయస్. సుందరం, 1979.
4. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - వెల్చేరు నారాయణరావు, 1978.
5. Contributions to Folkloristics, William R. Bascom, 1981.
6. Folklore and Folklife, Richard M. Dorson (Ed.), 1972.
7. Marxism and Poetry, George Thomson.
8. Primitive Song, C. M. Bowra, 1963.
9. The Study of Folklore, Alan Dundes (Ed.), 1965.

# ప్రచార సాధనాలుగా జానపద కళా రూపాలు

—ఎల్లోరా

ఏ మనిషీ పుట్టుకతోనే సంస్కృతిని వంట పట్టించుకుని రాడు. అందుకే సంస్కృతి కృత్రిమమైనది. సంస్కృతి సాముహికమైనది. పరిణామక్రమంలో ఏర్పడినదీ. అందులో జాతి లక్షణాలూ, ప్రాంతీయ లక్షణాలూ ఉంటాయి. అందరూ ఒకే రకం సంస్కృతి కలిగి ఉంటారని లేదు.

అంటే కొందరిలో సంస్కృతి బలహీనమైనదిగా ఉంటే, మరి కొందరిలో ఆ సంస్కృతి ద్వారా తాము స్పందించడమే కాకుండా ఇతర జాతులవారిని సైతం స్పందింపజేసి, ప్రభావితులను చేసేదిగా ఉంటుంది. సంస్కృతి మానవుని అవసరాలలో ఒకటి అనేది ప్రధాన విషయం. ఆ యా కాలాలలో ఆ యా జాతులలో, మతాలలో అప్పటి నమ్మకాలను ఆచారాలను నిర్దేశించుకొన్నదే సంస్కృతి.

అసలు మానవుని పరిణామ క్రమంలో ఆదిమానవునినాటి నుంచి ఏకత్వం నుంచి భిన్నత్వం వరకూ జాతి, ప్రాంతం, మతం, నమ్మకం, మాయ, కళ ఇలా ఎన్నో ఎన్నెన్నో.

రాయికి ముక్కులు చెక్కి వేటాడడం నుంచి రాయిని రాయిని రాపాడించి నిప్పును పుట్టించుకొన్నప్పటి నుంచి అలా అలా అభివృద్ధి పొందిన ఆలోచన, సహకారభావం కళారూపాలకు అడుగులు వేసింది. సంస్కృతీ వికాసానికి దారి తీసింది.

పని ముట్లను ఉపయోగించడం వలన అభివృద్ధి పొందిన సహకారంవల్ల మానవుడు చాలా ఎదిగాడు. నూతన పరిణామ క్రమంలో అది చాలా ప్రాధాన్యత గల అంశం. సామూహిక శ్రమలో భావ ప్రకటనా విధానం రూపొందింది.

అంటే - ఈ వరుసలో మొదట శ్రమ, తరువాత శ్రమతో కలిసిన భాష, భావ వినిమయం అభివృద్ధి చెందింది. మానవుడు అనుకరణశీలి. ఆదిమానవుడు అనుకరణని ఎక్కువగా చేశాడు. అంటే - ప్రకృతిని అనుకరించడం అలా అనుకరించడంలో ఆంగికాభినయం చేసేవాడు. ఈ ఆంగికాభినయం కార్యనిర్వాహణాభివృద్ధికి సంబంధించిన వాస్తు గత ప్రయోజనంతో కూడిన శ్రమ. సామూహిక శ్రమలకు సంబంధించిన కంఠ, శరీర చలనాలు వాస్తవ క్రమంనుంచీ వేరుచేయబడిన ఆట పాటలు ఒక స్వతంత్ర కార్యాచరణగా నిర్మాణం చేయబడింది. కాలక్రమేణా గణ సమాజంలో పంటలు బాగా పండడానికి చేసే నృత్యాలు, ప్రకృతి సంక్షోభాన్ని నివారించడానికి చేసే నృత్యాలు ఉండేవి.

ప్రాచీన కాలంలో మత ప్రచారానికి కళను ఒక సాధనంగా ఉపయోగించడం జరిగింది. శైవకవులు, వైష్ణవకవులు కళను కళకోసం కాక, మత ప్రచారానికి ఉపయోగించారు. అందుకే వీరి రచనలలో కళాత్మకత, సౌందర్యారాధనకన్నా ప్రచార ధోరణి ఎక్కువగా కనిపిస్తుంది. పల్నాటి యుద్ధం, బొబ్బిలి కథలు ప్రచారం కోసం వెలసినవే. పురాణమతం, పురాణ సంచయం అంతా ప్రచార సాధనాలే.

మొదట్లో పేర్కొన్నట్లు అనుకరణే కర్మకాండకు పునాదిగా మారింది. అనుకరణనృత్యం. పంటలు చిగురించిన మొక్కలు ధ్వంసం అవుతూంటే వ్యవసాయం చేసే ఆడవారు గాలి వాన - దట్టంగా వచ్చేపంట అంకురించి వికసించే విషయాన్ని అనుకరిస్తూ నృత్యాలు చేస్తారు. నాట్యంచేస్తూ పంటను తమను అనుకరించమని ఆహ్వానిస్తూ - అంటే పిలుస్తూ పాటలు పాడతారు. అంటే ఒక గాఢమైన నమ్మకం వీరిలోబలంగా ఉంది.

ఈ నృత్యం చేసేవారు పంట పండటాన్ని నాటకీకరించడంతో పంటలు వృద్ధికావడానికి ఒత్తిడి చేశామని విశ్వసించేవా రన్నమాట. అనుకరణకు సంబంధించిన ఈ క్రియే ఆదిమ మాయకు పునాది. ఇక్కడ మనకు మూడు విషయాలు గోచరిస్తాయి.

1) ఆనాటి మానవ సమాజం లేదా సంఘం. 2) మానవుని మనో వికారాలు వాటి పరిణామం 3) అనూహ్యాలు అయిన ఏదో మానవాతీత శక్తులపై గల విశ్వాసం.

ఇక్కడ మనం "టోటమిక్" విధానం గురించి ఒక్కసారి పరిశీలన చేయాలి. ఈనాడు మనలను ఆశ్చర్య చకితులను చేసే కొన్ని వింత వింత ఆచారాలు ఆటవికజనుల్లో ఉన్నాయి. అయితే ఈ ఆచారాలలోనూ రాను రాను సంస్కారం, విజ్ఞానం, నాగరికతల వలన వేరుగా కొత్త రూపాలను ఏర్పరచుకొనడం జరిగింది. "టోటమ్" అంటే ఒకానొక జంతువు లేదా ఒకానొక వృక్షం. ఈ జంతువు, లేదా వృక్షం పూజనీయమైనది. అందుకే ఇలా "టోటమ్" గా ఏర్పాటైన జంతువును టోటమ్ తెగవారు హింసించరు. అందుకే దేవునిగా పూజిస్తారు.

మానవుని కర్మాచరణ చైతన్యంతో కూడుకొన్న మనిషిలో ఆత్మాశ్రయంగా వేరుగా ఉండే శక్తి ఉంటుంది. ఈ శక్తిని ఆనాటి పరిస్థితితో పోల్చినప్పుడు అది కర్మకాండగా మనం చెప్పుకోవాలి. ఆదిమ కర్మకాండలో మనం ప్రధానంగా పేర్కొనవలసినది అనుకరణ నృత్యం ఒక్కటి. సామూహిక శ్రమకు సంబంధించిన కథ, శరీర చలనాలు వాస్తవ క్రమం నుంచి వేరు చేయబడి ఆట పాట కలిసిన స్వతంత్ర కార్యాచరణగా ఆవిష్కృతం అయింది.

అనుకరణ నృత్యం శ్రమతో సంబంధాన్ని కోల్పోయి గణసమాజ సంబంధాలను తిరిగి చెప్పేవాహికగా మాత్రమే సేవ చేస్తూ మత ప్రచారంతో పాటు వినోద కార్యాచరణగా పరిణమించింది. ఇక్కడ పురాణం అనండి, జానపద కథాకావ్యం అనండి ప్రారంభ దశను గుర్తుచేసే బృంద భావగీతకను రూపొందించింది.

గణ సమాజం విచ్ఛిన్నమయిన తరువాత శారీరక శ్రమనుండి మానసిక శ్రమ వేరుపడింది. సమాజం వర్గాలుగా చీలిపోయింది. పనిచేసేవారూ చేయించేవారూ ఏర్పడ్డారు. కొత్తగా ఆవిర్భవించిన ఈ నూతన వ్యవస్థలో నైతిక సమర్థకాలుగా దైవపూజలూ, మతపూజలూ ఎక్కువగా ప్రచారంలోకి వచ్చాయి. మతం ఒక ప్రధానపాత్ర వహించింది.

ఆదిలో మాయ నుంచి కళ పుట్టినట్లుగానే ఆదిమ మాంత్రికుని నుండి జానపద కళాకారుడు ఎదిగాడు. ఈ లక్షణాలను ప్రజా గేయాలలో మనం చూడ గలం ఇప్పటికీ. అయితే ఈ ప్రచార, మత కుల గాయకుల అవసరం పెట్టుబడి దారీ వ్యవస్థలో లేకుండా పోయింది. ప్రజానుబంధం కలిగిన కళ అవడంవల్ల ఇతరత్రా వీటిని ఉపయోగించుకొంటున్నారు.

వర్గ సమాజ పూర్వదశలోను, వర్గ సమాజ తొలిదశలోనూ ప్రజానీకంలో ప్రవక్తకు, పురోహితునకు ఉండే గౌరవం కవికి కూడా ఉండేది. ఈ కవి ఆశీస్సుకూ, శాపానికి బలం ఉంటుందని గాఢంగా నమ్మేవారు. కవి ఆశువుగా చెబుతూంటే అవి అతని మాటలు కానట్టూ దైవవాణో, ఆత్మవాణో అతనిచేత పలికిస్తున్నట్లూ నమ్మడం జరిగేది. అంటే జనం దృష్టిలో ఆ కవి దైవాంశ సంభూతుడు. ఆధునిక బూర్జువా సంగీతంలో కూడా పూజా మంత్రాలు, కథా గానాలు వంటి కొన్ని కర్మకాండ పట్టును మనం గమనించవచ్చును.

ఇక్కడ ప్రధానంగా గమనించవలసింది సమాజంలో విప్లవాత్మక ధోరణి బలంగా ఉన్నప్పుడు సంగీతం మతేతరంగానూ, పురోహిత తత్వ వ్యతిరేకంగానూ పరిణమించడం తప్పదు.

అలాగే సంగీత రూపాలు సంప్రదాయక లక్షణాల నుంచి స్వేచ్ఛను పొంది నూతన కల్పనలకు అవకాశం కల్పిస్తాయి.

ఒకనాడు మత ప్రచారంకోసం కళలను ఉపయోగించుకొన్నారు. ఉన్నత వర్గాల నమ్మకాలకు అనుగుణంగా, కర్మ పేరుతో, మతం పేరుతో చివరకు కులాల మాటున కళలనూ విభజించారు.

సనాతన భావాలు గల వారు శాస్త్రీయమైన చరిత్రకన్న పురాణాలలో కనిపించే అభూతకల్పనలే నిజమని వాదిస్తారు. మూఢనమ్మకాలు, ఛాందస భావాలు మత ప్రచారం బలంగా అమలులో ఉన్న నీతికి గాని, న్యాయానికి గాని ప్రచారం చెయ్యడమే సారస్వతం, కళల పని అనుకొంటే సారస్వతం నీతి శాస్త్రంగానూ న్యాయ శాస్త్రం గానూ మారిపోయి నిజమైన సాహిత్య కళా లక్ష్యం పోగొట్టుకొంటుందని గమనించాలి. ఈ దృష్టితో కళారూపాలను పరిశీలించాలి. పురాణాలు, సమష్టి పఠనాలూ, హరికథలూ, బుర్రకథలూ, దానికి సంబంధించిన

సాహిత్యం కళాప్రదర్శనలూ అన్నీ మతం కోసం వినోదపరంగా మత ప్రచారం కోసం పోషించబడిన సాధనాలే.

శైవమత ప్రచారం కోసం, వైష్ణవ మతం కోసం ఇలా ఎన్నెన్నో మతాల ప్రచారానికి ఎన్నెన్ని వచనాలు, ప్రవచనాలు, పాటలు, కావ్యాలు, గీతాలు, నాటకాలు, కథలు, హరికథలు. అయితే కాలం మారి ఒకనాటి ఆలోచన, నేటి అవగాహన-వీటి మధ్య అనేకమైన మార్పులు వచ్చాయి. మానవుడు తనలో తనే సృష్టించుకొన్న సాహిత్యం జానపద సాహిత్యం-తనే ఆవిష్కరించుకొన్న కళ జానపదకళా రూపాలు. సమాజంలో కలిగే రాజకీయ మార్పులు సహజంగా సాంస్కృతిక రంగాలలో మార్పులను తెస్తాయి. ఇక్కడ గుర్తుంచుకోవలసిన అంశం ఈనాడు జానపద కళారూపాలుగా ప్రాచుర్యం పొందిన బుర్రకథ, తోలుబొమ్మలు, వీథి భాగోతం, హరికథ, చిరుతలు, చిందు మొదలయినవి కొత్తగా పుట్టినవి కావని, అయితే అనూచానంగా వస్తూన్న ఈ జానపదకళలూ, రూపాలూ గతంలో మాయ, మత, ఆధ్యాత్మిక భూస్వామ్య భావాల ప్రచారాలకు వాహికగానే పని చేశాయన్నది నిజం.

మూఢ నమ్మకాలతో ఎన్నెన్నో కథలు తరతరాలుగా వీథి గాయకులు గానం చేస్తూ అడుక్కోడం, దయ్యాలపేర, దేవుళ్ళపేర, గుళ్ళపేరిట, గోపురాల పేరిట, శక్తుల పేరిట, మంత్రాల పేరిట, వినోదాల పేరిట, గారడీల పేరిట, తంత్రాల పేరిట, పాటలుగా, ఆటలుగా, కథలుగా, నాటకాలుగా, భజనలుగా, భక్తియుక్తిమోక్షగానాలుగా ఆ యా వర్గాలు, కులాలు, బృందాలు పొట్టకోసం, భుక్తికోసం, బ్రతుకోసం ఎంత మత్తెక్కించాలో అంతా జరిపారు. అక్కడక్కడా ఇప్పటికీ వాటి ప్రచారాలు జరుగుతూనే ఉన్నాయి. ఈ కళారూపాలు ఒక్కో కులానికి ఒక్కో ప్రదర్శన గుత్తగా నిలిచి పోయింది. ప్రభువుల కోసం కొన్ని, అధికారుల కోసం కొన్ని, పండుగల పేరిట పబ్బాల పేరిట, జాతర్ల పేరిట, అమ్మలపేరిట, అమ్మవార్ల పేరిట, స్వాముల పేరిట, భూస్వాముల పేరిట -ఇలా మరెన్నో!

మతం నుంచి, మాయ నుంచి, కులం నుంచి, గణం నుంచి, పెట్టుబడిదారీ విధానం నుంచి కళారూపాలు-ప్రత్యేకించి జానపద కళారూపాలు-జనం నుంచి

జనానికి ప్రస్థానం ప్రారంభించాయి. ఆ ప్రస్థానం నిన్న మతం మత్తులో జరిగితే నేడు స్వాతంత్ర్యం, సౌభ్రాత్రం సౌభాగ్యపథంలో దారి మళ్ళించుకొంది.. అవే పాటలు, అవే మాటలు, అవే కథలు, నాటకాలు ప్రజలకోసం, ప్రజాస్వామిక ఉద్యమాల స్ఫూర్తికోసం, జనధర్మంకోసం ఆలయంలో, ఆ రాగంలో, ఆ గానంలో, ఆ బృందంలో కొత్త భావనలను ప్రదీప్తమొనరించాయి. అలా అలా అనేక కళారూపాలలో విడిచివిప్పారిన ఈ కళారూపాలు నేడు ఉద్యమాల, పార్టీల, విప్లవాల ప్రచారసాధనంగా తుష్టినీ, పుష్టినీ కలిగి జనంలో ఇది మన సాహిత్యం, మన కళ, మనకోసం మనది అన్న తాదాత్మ్యభావబలాన్ని కలిగించాయి.

ఆయా మండలాలలో ప్రాంతాలలో పల్లెల్లో అనేక గణ, కుల, మత, మూఢనమ్మకాలతో ఎన్నో ప్రాంతీయ కళారూపాలు ప్రచారంలో ఉన్నాయి. ఇందులో కొన్నికొన్ని కులాల వారికే పరిమితం, మరి కొన్ని కొన్ని ప్రాంతాల వారికే పరిమితం. అయితే వీటిని ఆనాడు మతప్రచారంగానో, గణ ప్రబోధంగానో, వినోద ప్రదర్శనగా, ప్రచార సాధనంగా వినియోగించినా - కాలంతోపాటు - మానవుని అభిరుచులతో పాటు - సమాజంలో క్షణక్షణానికి వచ్చిన, వస్తూన్న అవసరాలకు అనుగుణంగా ఈ కళారూపాల రూపాలూ మారాయి. ఇక్కడ రూపం మారడం అంటే ప్రక్రియా విధానం మారిందనికాదు. నాడు వీటిని ఉపయోగించు కొన్న స్వార్థం వేరు. నేడు ఉపయోగించుకుంటున్న తీరువేరు. ప్రజలకోసం కళ, కళకోసం కళకాదని నమ్మిన ప్రజాకళాకారులు తిరిగి ఆ పల్లెలకే, ఆ పల్లెపాటలకే, ఆ జానపదకళా రూపాలకే చేరి వారిలో ఒక ప్రగతి మార్గానికి మేలుకొలుపులు ఆలపించారు. అది విశ్వవ్యాప్తంగా జరిగిన మార్పు. ఇక్కడ ప్రదర్శనా విధానంలో, ప్రదర్శకుల ఆలోచనా సరళిలో కొత్తమలుపు. రాజకీయ అవగాహన, పథకాలు చోటు చేసుకొన్నాయి. ప్రజోద్యమాల ద్వారా కలిగిన స్పృహ, ఉద్యమాలకు ఊపిరిగా ప్రచారం అవసరమయింది. అందులో రాజకీయ పార్టీలు ఈ కళారూపాలను తమ తమ ప్రచారానికి సాధనాలుగా మలచుకొన్నాయి.

అయితే, పాతకాలపు కాపులు వీటిని ఉపయోగించడంలో స్వార్థం, కృత్రిమత్వం ఉండడంతో వారిలో ఇవి ఇమడలేదు. ఎక్కడైతే నిజమైన ప్రజోద్యమం ఉందో, ఎవరైతే తమతో కష్టసుఖాలు పంచుకొనగలరో వారినే

ప్రజలు ఆదరిస్తారు. అదే రుజువు అందింది. తెలుగునాట జరిగిన ప్రతి ప్రజా ఉద్యమం చెప్పింది. అప్పుడు ప్రధానంగా తెలుగునాట ప్రజాకళారూపాలకు కొత్త వ్యాఖ్య, కొత్త రూపం కలిగింది. దానికి ఒక ఉదాహరణ ప్రజానాట్యమండలి. రాయలసీమలో కరువు రాక్షసి కరాళ నృత్యం చేస్తున్నప్పుడు, బెంగాలులో కరువు బీభత్సం గావిస్తున్నప్పుడు, ప్రపంచ పరివ్యాప్తంగా ఫాసిజం యుద్ధ రాక్షసిగా దండయాత్రలు చేస్తున్నప్పుడు, ప్రజా నాట్యమండలి తన వంతు కర్తవ్యాన్ని నిర్వహించే సమయంలో ఈ జానపదకళా రూపాలను వారి పార్టీకి ప్రచారసాధనంగా స్వీకరించారు. ఇతర రాజకీయ పార్టీలు కొన్ని జానపదకళా రూపాలను తమ పార్టీ ప్రచారానికో, ఎన్నికల ప్రచారానికో ఉపయోగించినా, జనంలో వారి కళా ప్రచారం నిలవలేదు. ప్రతి కళా రూపాన్నీ వామపక్ష ప్రజా తంత్ర శక్తులు వారి ఆశయాల ప్రచారానికి వాహికగా మలచుకొన్నారు. ప్రజా నాట్యమండలి వారి రాజకీయ ప్రచారానికి ఉపయోగించుకొన్న కళారూపాలలో కోయ వేషం, బుర్రకథ, జముకులకథ, చెంచులు, ఫకీర్లు, జంతర్ పెట్టె, సమష్టి గానాలు, వ్యష్టిగానాలు, కోలాటం, డప్పుల కోలాటం, దేవర పెట్టె, సైసైనృత్యం, పంటసిరినృత్యం, క్వారీపాటలు, పడవపాటలు, జేగంట భజన, హరిహరి పదాలు, గొల్లసుద్దులు, మూకాభినయం, షాడోప్లే ఇలా ఎన్నింటినో వారు తమ ప్రచార సాధనకు, ప్రబోధానికి, తద్వారా ప్రజల్లో చైతన్యం కలిగించడానికి కృషిచేశారు.

ప్రపంచ ప్రజాతంత్ర శక్తులలో సిద్ధాంత విభేదాలు వచ్చి వర్గాలుగా చీలినట్లుగానే ఆంధ్రదేశపు కళారూపాల్లో చీలికలొచ్చాయి. అప్పుడు జనసాహితి వంటి సంస్థలు ఆవిర్భవించడం, విప్లవ రాజకీయ ఉద్యమాలతో కళాకారుల్లో, రచయితల్లో, కవుల్లో మార్పు వచ్చింది. వారూ తమ సిద్ధాంత ప్రచారానికి జానపద కవితలను, ప్రాచీన కళారూపాలను సాధనాలుగా వినియోగించు కొంటున్నారు.

చివరగా ఒక్క మాట చెప్పి ముగిస్తాను.

"కళ కళకోసమా, ప్రజలకోసమా అన్నది ఈనాటి ప్రశ్నకాదు. అలాగే ఆరాధకుల పేరిట, ఉపాసకుల పేరిట కళకు సాంఘిక ప్రయోజనం అంటూ ఏదీ లేదనీ, వుండకూడదనీ చేసే వాదనలు కొత్తవి కావు. కళాతత్త్వం గురించి

ప్రాచీన భారత కళా సిద్ధాంతుల ప్రవచనాల నుండి, నేటి సినిమా వ్యాఖ్యాతల లౌకిక ప్రబోధాల వరకూ పదాలు మారుతూవచ్చినా, మారనిది భావం ఒక్కటే. అది రస సిద్ధి, ఆనందం, అనుభూతి వగైరా వగైరా పారిభాషిక అచ్ఛాదనలో పలాయానవాదం ప్రచారం చేయడమే. సాంఘిక వ్యాపారమైన సాహిత్యం, కళలను సంఘం. ప్రజల నుండి విడివడినవిగా పరిగణించడం అసాధ్యం. అప్పుడప్పుడు ఇది అనేకానేక కారణాలవల్ల నివురుగప్పినట్లున్నా నిప్పులాంటి వాస్తవం.

ప్రజల జీవనాడితో పెనవేసుకొనిపోయి వారి ఆశలకు ప్రతీకగా, ఆశయాలకు ప్రతిధ్వనిగా జీవితాలకు ప్రతిరూపంగా, ఆదర్శాలకు సంకేతంగా నిలచి నిర్దేశిత కర్తవ్యాల నిర్వహణలో వారిను త్తేజపరిచేది సజీవ ప్రజాకళ, అదే మన ప్రజల జానపద కళారూపం. ఇంతటి విలువైన ప్రజా కళారూపాలకు ఊపిరి పోసి, ప్రచార సాధనకు వాహికగా మలచుకొన్న ఘనత ఈనాటి కాలానికి దక్కుతూ ఉంది.

# ఆధునిక యుగంలో జన (జానపద) సాహిత్యం

—దేవరాజు మహారాజు

ఆదిమ మానవుడికి రెండు వరాలుండేవి. ఒకటి నిప్పు. మరొకటి ఆత్మ స్థైర్యం. నిప్పు - శాస్త్ర విజ్ఞానానికి ప్రతీక. మానవుడు లోహాలు కరిగించడానికి ఉపయోగించడంతోనే నాగరికత మొదలైంది. అలాగే మానవుడి ఆత్మస్థైర్యం లేదా నమ్మకం, లేదా ఆశ అతడి కృషికి, నిరంతర సంఘర్షణకు ప్రతీక. దాని వల్లనే అతడు తన పరిసరాలను ఎంతో క్షుణ్ణంగా అర్థంచేసుకో గలిగాడు. అహరహం కొత్త దానికోసం అన్వేషించాడు.

ఆదిమ సమాజంలో మనుషుల ప్రతి పనీ సామూహికంగా ఉండేది. పని ముట్ల తయారీకాని, వేటాడడంగానీ, వేటను పంచుకుని తినడంగానీ అంతా సామూహికమే. పనిముట్ల వాడకం వారి జీవితాల్లో ఒక గొప్పమార్పు తీసు కొచ్చింది. ఈ పనిముట్ల వాడకంలో ఒకరినొకరు బాగా అర్థంచేసు కోవడానికి సైగలు, సంకేతాలూ వచ్చాయి. అదేక్రమంలో భాష పుట్టింది. చెట్లు కొట్టడంగానీ, రాళ్ళు కొట్టడంగానీ సామూహికంగా ఒక క్రమంలో చేసేవారు గనక క్రమంగా ఆ పని ధ్వనుల్లో ఒక లయ ఏర్పడింది ఆ లయకు ఉత్తేజితులై మనుషులు తమ గొంతుకూడా కలిపారు. ఆ రకంగా పాట శ్రమలోంచి, చెమటలోంచి రూపు దిద్దు కుంది. ఆ పాటలో గీతం, సంగీతం వేరువేరుగా లేవు. రెండూ ఒకటే. రెంటినీ విడదీయడం సాధ్యంకాదు. పనివల్ల వచ్చే ధ్వనులు, పనిభారంవల్ల వచ్చే బరువైన ఉచ్ఛ్వాస నిశ్వాసాలు. పని భారంలోని తీవ్రతను తగ్గించుకోవడానికి తీసే కూతలు, అరుపులు మాత్రమే పాటకు సంగీత మయ్యేవి. ఆ తర్వాత భాష పెరుగుతున్నకొద్దీ - కొన్ని కొన్ని పదాల కలయికవల్ల, పదాల విరుపులవల్ల, పదాల్ని సాగదీయడంవల్ల స్వాభావికంగా వచ్చే శబ్ద సౌందర్యం పాటకు సంగీత

మయ్యేది. పదాలు లేకుండా రాగాలు లేవు. పాటలేకుండా వాద్య సంగీతమూలేదు. అవన్నీ తర్వాతి కాలంలో అభివృద్ధి చెందాయి.

ప్రతి పనీ సామూహికంగా జరిగేది కాబట్టి, పాటకూడా సామూహికంగానే వెలువడేది. సమూహంలో నిత్యనూతనంగా బతికేది. అందుకే జానపద గేయాలకు కవి లేడు అనే అభిప్రాయం గట్టిపడింది. శ్రమ విభజన మొదలై కులాలు ఏర్పడ్డప్పుడు వారి వారి వృత్తులను అనుసరించి, అన్ని రకాల పాటలు వెలువడ్డాయి. సమాజంలో స్త్రీ స్థానాన్ని బట్టి, ఏర్పడ్డ ఆచార వ్యవహారాలను బట్టి, మారుతున్న విలువలను బట్టి, పెరుగుతున్న నాగరికతను బట్టి పాటలు వచ్చాయి. వస్తూనే వున్నాయి. జానపదుల పరిధి పెరిగింది గనక, జానపద సాహిత్య పరిధి కూడా విస్తృతమైంది.

ఒకప్పుడు ఒక కొత్త పాటవస్తే అది అందరి సొత్తయ్యేది. అది అందరికీ ఇష్టమయ్యేది. అందరూ కలిసి దాన్ని బతికించే వారు. అప్పుడు ఉన్నత వర్గం- బడుగు వర్గం లేదా జమీందారు - సామాన్యుడు అన్న విభజన వున్నప్పటికీ ఎక్కువమంది సామాన్యులే. వారి జీవన సరళి జీవిత సమస్యలూ ఒకటే. కాని ఇప్పుడు ఈ ఆధునిక యుగంలో సామాన్యులనబడే వాళ్ళలోనే ఎన్నో విభజన లున్నాయి. విద్య, సంస్కారం ఆర్థిక స్తోమతలనుబట్టి, ఆలోచనా విధానం, రాజకీయ పార్టీల ప్రభావాలను బట్టి, దేవుళ్ళు, దయ్యాలు బాబాల ప్రభావాలను బట్టి ఇంకా ఎన్నెన్నో రకాలుగా మనుషులు విడిపోయ్యారు. మనిషికి మనిషికి మధ్య దూరం ఎక్కువైంది. తెరలు గట్టిపడ్డాయి. అందువల్ల మౌఖిక సంప్రదాయం సన్నగిల్లుతూ వస్తోంది. ఒక అజ్ఞాతకవి పాడిన కొత్త పాటవస్తే ప్రజలందరికీ నచ్చుతుందని గానీ, అందరూ కలిసి దాన్ని బతికిస్తారని గానీ, నమ్మకం లేదు. అక్షరాస్యత పెరిగిన కొద్దీ పత్రికల, పుస్తకాల. రేడియో, టీవీల ప్రాముఖ్యం ఎక్కువైంది. అయితే వీటి పరిధి చాలా తక్కువ. జన సాహిత్యాన్ని అందుకోగల స్థాయికి ఇవి ఎదగలేదు.

ఇక్కడ మరొక విషయం గమనించాల్సి వుంది. గ్రామాలు గ్రామాలు గానూ, పట్టణాలు పట్టణాలు గానూ లేవు. ఆధునిక గ్రామాల్లో పట్టణ వాతావరణం కొట్టవచ్చినట్లు కనిపిస్తోంది. బతుకుతెరువు కోసం లక్షల మంది పట్టణాలకు ఎగ

ఙద్దారు. మహా నగరాల్లో సైతం కొన్ని చోట్ల మురికివాడలు,అన్ని చోట్ల మూఢ నమ్మకాలు సజీవంగా ఉన్నాయి. ఉదాహరణకు హైదరాబాద్, సికింద్రాబాద్ మహా నగరాలలో మహంకాళి జాతర, బోనాల పండగ ఇప్పటికీ చూడొచ్చు. కొన్ని ప్రాంతాల్లో వున్న కోళ్ళ పందాల్లాగా ఇక్కడ దున్నపోతుల కొట్లాటలు చూడొచ్చు. వరంగల్ పట్టణ సమీపంలో సమ్మక్క సారక్క జాతర జరుగుతోంది. నిజానికి జానపదుల దేవుళ్ళు-ఆచారాలు-పండగలే ముందు ఏర్పడినవి. గుత్తాధిపత్యం చెలాయించడానికి ఒక వర్గం వారు కొత్త దేవుళ్ళను, కొత్త పూజా విధానాల్ని ఏర్పరిచి, సమాంతరంగా ఒక కొత్త సంస్కృతిని అభివృద్ధి పరిచారు. లేకపోతే సామాన్య జనులు మల్లన్న అని పిలుచుకున్న దేవుణ్ణి శిష్టులు శివుడు అని పిలవాల్సిన అవసరం ఏమిటి? చాలమంది దేవుళ్ళ విషయంలో ఇలా జరిగింది. సమాంతరంగా వుంటూ వచ్చిన రెండు సంస్కృతులూ నేడు సజీవంగా వున్నాయి.

"జన పదములందుండు వారు జానపదులు. వారు పాడుకొను పాటలు జానపద గేయము లనబడును." అనే అభిప్రాయంలో వున్నాం. కానీ ఈ ఆధునిక యుగంలో FOLK అనే మాటకు పరిధి విస్తృతమైంది. అది ఒక పల్లెకు, పల్లె జీవనానికి పరిమితమై లేదు. ప్రముఖ FOLK LORIST అలన్ డండెస్ ప్రకారం జానపదులంటే - ఏ ఒక్క విషయంలోనైనా భావసామ్యం కలిగిన జన సముదాయం. వీరు ఒక భాషకు సంబంధించిన వారు కావచ్చు. ఒక జాతికి, ఒక మతానికి, ఒక వృత్తికి సంబంధించిన వారు కావచ్చు. లేదా ఒకే ప్రదేశంలో వుంటున్న వారు కావచ్చు. ఉదాహరణకు ఒక కుటుంబం, ఒక గ్రామం, ఒక దేశం, ఒక పెత్తందారు దగ్గర పనిచేసే కూలీలు, ఫ్యాక్టరీ వర్కర్లు, ఒక అధికారి దగ్గర పనిచేసే చిన్న ఉద్యోగులు, ఈ రకంగా ఎన్నో సమూహాలున్నాయి. ఇలాంటి సమూహాలకు కేవలం వారివే అయిన సంప్రదాయాలు, నమ్మకాలు, ఆచారాలు, అభిరుచులు సాహిత్య కళారూపాలు వుంటాయి. ఇలాంటి సమూహంలో ఇంతమంది వుండాలి అన్న నియమంలేదు. ఇద్దరికంటె పైగా ఎన్నికోట్ల మందైనా వుండొచ్చు. ఇక్కడే మనం ఒక ముఖ్యమైన విషయాన్ని అర్థం చేసుకొని, ఆచరణలో పెట్టాల్సిన అవసరం వుంది. జానపద సాహిత్యం పేరుతో జనసాహిత్యాన్ని ఒక పరిధిలో బిగించి పెడుతున్న పండితులు తమ ప్రయత్నం ఇక ముందు మాను

కుంటే బాగుండును. జనుల సాహిత్యాన్ని జనసాహిత్యం అని అనడంలో తప్పు లేదు. ప్రజలు పాడుకున్న పాటల్ని ప్రజల పాటలని, వారు సృష్టించుకున్న సాహిత్యాన్ని ప్రజా సాహిత్యం అనీ అనక తప్పదు.పరిధి ప్రజలకు లేనట్లే ప్రజా సాహిత్యానికీ లేదు. అందువల్ల జానపద సాహిత్యాన్ని జన సాహిత్యం అనిగానీ, ప్రజా సాహిత్యం అని గానీ వ్యవహరిస్తేనే బాగుంటుంది.

ఎప్పుడైతే కొత్త కొత్త సమూహాలు ఏర్పడుతుంటాయో అప్పుడు కొత్త జన విజ్ఞానం ఏర్పడుతూ వుంది. అందువల్ల జన సాహిత్యం, నామరూపాలు లేకుండా పోవడం అంటూ జరగదు. అందువల్లనే "In a new light, we shall see that the folk are not dying out, and that there are folk cultures alive and well in United States, Canada and Europe and that new folk cultures are bound to arise"

19 వ శతాబ్దపు జానపద పండితులు జానపదుల్ని మూడు రకాలుగా విభజించారు.

1. ఆదిమ వాసులు
2. పల్లెవాసులు/అనాగరికులు/కింది తరగతివారు
3. నగరవాసులు/నాగరికులు/పై తరగతివారు

ఇది ఖచ్చితమైన విభజన కాదు పల్లెవాసుల్లో పై తరగతివా రుండవచ్చు. నగరవాసుల్లో కింది తరగతివా రుండవచ్చు.

* * * *

ఒక సమూహం సామూహిక శ్రమలోంచి వస్తున్న కొత్త పాటలు పాత సమూహం పాటలకంటె భిన్నంగా వుంటున్నాయి. ఈ మార్పుకు అంతర్వాహిని-నాగరికత! ఉదాహరణకు వేర్వేరు వ్యవసాయపు పనుల్లో పాడుకునేందుకు వేర్వేరు పాటలున్నాయి. కాలానుగుణంగా వ్యవసాయ పద్ధతుల్లో వస్తున్న మార్పులు ఆ పాటల్లోకూడా వస్తున్నాయి. నాగలి స్థానంలో ట్రాక్టరు, మోట బావి స్థానంలో కరెంటు మోటరు బావి చేరి పొయ్యాయి.

పరిశ్రమలు అభివృద్ధిచెంది స్త్రీ పురుషులు కలిసి రాళ్ళు కొడుతున్నప్పుడు, రోడ్లు వేస్తున్నప్పుడు పాట మారిపోయింది. రోడ్డు రోలరు, సిమెంటు, కాంక్రీటు, సూపర్‌వైజర్, కాంట్రాక్టర్ వగైరా పదాలు కలిసాయి. ఎలక్ట్రిక్ స్తంభాలు వేస్తున్నప్పుడు, రైలు పట్టాలు వేస్తున్నప్పుడు పాటలొచ్చాయి. ఇవన్నీ శ్రమలోంచి రూపు దిద్దుకున్నవే.

మొదట కాలువలూ నదులు, తెప్పల, పడవల సహాయంతో దాటాక సముద్రాల్ని ఓడలతో దాటగలిగే టప్పటికి ప్రజల పాటల్లోని విషయం తెప్పల పడవల నుండి ఓడలదాకా పెరిగింది. నడక నుండి, సైకిల్ నుండి, గాడీల (రైళ్ళ) నుండి మోటారుకార్ల దాకా పెరిగింది.

"అర్తి పండ్లొచ్చినాయి చెక్క రాతి బండ్లమీద
అవ్వ నేను బోతున్నానే చెక్కరాతి బండ్లమీద"

"కూర్చుండ కుర్చీలిత్తు
ఊరు తిరుగ బైస్కోలిత్తు"

"చిట్టెమ్మెక్కిన తొక్కుడు బండి
కొయ్యోడెక్కిన రబ్బరు బండి
చీపురుపల్లి స్టేషనుకాడ
చీరె జారిపోయెనురో"

"ఓడెల్తుం దోడెల్తుంది
నా చిన్నీ ముద్దుల మరిదీ
దేశమెల్లీ పోతున్నావా"

"బస్సు పుట్టేనోయ్ బాబు
బస్సు పుట్టేనోయ్
బస్సు పుట్టి బండ్ల వారి
కడుపు కొట్టేనోయ్"

పై గేయాల్లోని మార్పంతా ఒక్కసారి వచ్చింది కాదు. ఎన్నో యేళ్ళకు యేళ్ళుగా ఒకరినుండి ఒకరు నేర్చుకుని, మారిన పరిసరాలకు అనుగుణంగా

మార్పులు, చేర్పులతో తర్వాతి తరానికి అందించగా వచ్చినవి. "చెంగావి పంచెల్లు-చెవుల పోగుల జోడు" అంటూ ప్రియుణ్ణి వర్ణించుకున్న స్త్రీ: న్యాయం, చట్టం, వ్యవహారం అభివృద్ధి చెందిన తర్వాత వర్ణన మార్చుకుంది. "ఓ వాలు గన్నుల పోలీసెంకట సామీ / కఱ్ఱ చేత బట్టుకొని భీమరాజ / కలకటేరు లాగున్నావు" — అని అంది.

ఆంగ్లేయుల పాలనలో వంతెనలు, డాములు వచ్చాక కింది పాట వచ్చి వుంటుంది.

"పుల్లలేరుట కని
కాలవొడ్డుకు వస్తే
డాము కాడ వుండరో ఎంకయ్య
డాముకాడ కూకుండరో"

అలాగే టెలిఫోను రాకముందే "బొంగు మీద బొంగు పెట్టి బొంబాయికి తారు గొట్టినే" అని పాడలేరు కదా!

దేశంలో మిషనరీలు అధికమైన తర్వాత వచ్చిన ఒక పాట. దీన్ని శ్రమజీవులు పనిలోకి వెళుతూ పాడుకునే వారు.

"ఇది మిసనీ అది మిసనీ
గుంటూరు పెద మిసనీ
ఏ మిసనీకి పోదాంరో
లంబాడోళ్ళ రాందాసా
మనమే మిసనీకి పోదాంరో"

"చీరాలా చిన కారూ
పేరాలా పెద కారు
ఏ కారెక్కి పోదాంరో
లంబాడోళ్ళ రాందాసా"

ఆంధ్రులు ఎక్కడెక్కడి నుండో ఇప్పటి ఆంధ్రప్రదేశ్ ప్రాంతానికి వచ్చినట్లే, ఆంధ్రప్రదేశ్‌నుండి ఎంతో మంది ఇతర ప్రాంతాలకు వలస వెళ్ళారు.

కర్నాటక, తమిళనాడు, మహారాష్ట్ర, ఒరిస్సా రాష్ట్రాలలో తెలుగువారు పెద్ద సంఖ్యలో వున్నారు. భారీ పరిశ్రమలలో, కర్మాగారాలలో పనిచేసేందుకు జంషెడ్‌పూర్, టాటానగర్, ఖర్గపూర్, బొంబాయి మొదలైన ప్రాంతాలకు వెళ్ళారు. ఇతర రాష్ట్రాలకే కాదు. బర్మా, మారిషస్, మలేసియా, దక్షిణాఫ్రికా మొదలైన దేశాలకు కూడా వలస వెళ్ళారు. రంగూను మీద లెక్కలేనన్ని పాట లొచ్చిన విషయం అందరికీ తెలిసిందే.

ఉదా॥ రంగమెల్లి పోదాము రంగూన్ మామా.

ప్రస్తుత పరిస్థితుల్లో డబ్బు సంపాదనకు అరబ్ దేశాలకు పోవడం జరుగు తోంది.

"బొంబాయి కాడ ఆఫీసు కాడా
నిలబడి నీ ఫోటు నిలుపు దిగుడాయె
పాసు పోటువ దిగి పదినెల్లు ఆయె
ఏ మాయె నీ పాసు ఎటు దెలువదాయె
మస్కటు పోతనని మనసు బుండంగ
దుబాయి పోతనని దునుకు డెందుకురా"

అలాగే మరో పాట.

"మస్కటు వోతనాని
పైస దెత్తివిరా
వడ్డీకి పెండ్లాన్ని
అమ్మి కట్టావురా
కొయ్యాట (కువైట్) వోతనాని
కోల్ల దింటివిరా
కోల్ల దిన్నా బాకి
కొడుకు నమ్మావురా
విజ (విసా) వచ్చినాది
ఆఫీసు బుండె
ఆఫీసు బందాయె
విజ మర్రిపాయె

ముక్కు పుల్లమ్మ్కక
మూడు ఏలు దెచ్చి
విజ నాకు రాదని
వింటి కత్తివిరా..."

గాలి మోటరు, రాకిటుకూడా పాటల్లో చేరాయి. ఇటీవలి కాలంలో సంచలనం సృష్టించిన 'స్కైలాబ్' పైన కూడా పాటలు ప్రచారంలోకి వచ్చాయి. రేడియో ప్రచారంలోకి వచ్చిన కొత్తలో ప్రజలు దాన్ని 'మాటల పెట్టి' అని వాడుకున్నారు. ఇప్పుడు టెలివిజన్‌ను సినిమా పెట్టి అని అంటున్నారు. ఈ రకంగా శాస్త్రవిజ్ఞాన సాంకేతికాభివృద్ధిని జీర్ణించుకున్న జన సాహిత్యం వుంది. ఇందులో రోబట్, సెటిలైట్ వంటివి ఇంకా చేరినట్టు లేదు.

పండగ నాడు పాత మొగుడేనా అని విసుక్కోవడం మానేసి ప్రియుడితో బాహాటంగా తిరగలేక, సంఘం కట్టుబాట్ల ప్రభావంవల్ల అతణ్ణి ఎక్కడో వెన్నెల్లో చాటుగా కలుసుకొమ్మని చెప్పే పాట లొచ్చాయి. అలా కలుసుకోవడం తప్పు అని దృఢపడి పోయిన తర్వాత సాంఘిక నీతిని బోధించే గేయాలొచ్చాయి.

ఇక్కడ బట్టల గురించి కొంత పరిశీలిద్దాం. శీటిసీరె, సన్న శీరె, వంటి నేత చీరెల తర్వాత పట్టు బట్టలు దేశంలో వాడకాని కొచ్చిన పిదపనే
"పట్టు కోకలు నీ కందమైతే
అందమైతే కొనమనరాదా"
వంటి చరణాలు; అద్దకం పరిశ్రమ మొదలైన తర్వాతనే "బందరు అద్ద కాలు నీ దమ్మోలి చంపరమ్మా" వంటి చరణాలు ఉత్పత్తి సంబంధాలుగా వారి గేయాల్లో చేరా యేమోనని అనిపిస్తోంది. ఈ రకంగా పరిశీలిస్తే ఆభరణాల్లో, అలంకరణాల్లో వస్తువుల్లోనే కాదు. అభిప్రాయాలు, విశ్వాసాలలో వచ్చిన అనేక మార్పులు జనం పాటల్లో కనిపిస్తాయి.

భూస్వామ్య వ్యవస్థలో స్త్రీకి వ్యక్తిత్వం లేదు. వారి పనికి చెమటకు గుర్తింపు లేదు. వారిని 'విలాస వస్తువు' కింద జమ కట్టేవారు. ఆస్తిలో ఒక భాగంగా భావించే వారు. భూదానం, గోదానం లాగా కన్యాదానం వచ్చింది.

| | | |
|---|---|---|
| "అత్త మీది కోడలును | దంసరి | దంసరి |
| సత్తె మంతు రాలినయ్యో | ,, | ,, |
| సత్తె మంతు రాలివయితె | ,, | ,, |
| నిత్తె నీతో వుంటానె | ,, | ,, |
| మొగనాలిని దొరో | ,, | ,, |
| మోసాలు ఎరగనయ్యో | , | ,, |
| మోసాలు ఎరగకుంటె | ,, | ,, |
| సరసాలు ఆడరాయె | ,, | ,, |
| మసక సీకటాయె దొరో | ,, | ,, |
| మాటలొచ్చును దొరో | ,, | ,, |
| మాటలొస్తేను పిల్లో | ,, | ,, |
| మా యింటి కొచ్చెదవే | ,, | ,, |

పెత్తందారు ఇతరుల భార్యల్ని బలవంతంగా అనుభవించడం మొన్న మొన్నటి దాకా జరిగింది. నేటికీ అత్యాచారాలవల్ల అన్యాయమై పోయిన స్త్రీల గురించి జనమే పాటలల్లు కుంటున్నారు. కొన్నేళ్ళ క్రితం భువనగిరిలో కొందరు ఒక అమ్మాయిని చెరచి, నగలు దోచుకుని ఆమెను బావిలోకి తోసి చంపారు. ఆ సంఘటన ఆధారంగా వచ్చిన పాట అశ్రుపూరిత నయనాలతో ఇప్పటికీ అక్కడ పాడుకుంటున్నారు.

ఉదా॥ నక్క అండాలమ్మ ఉయ్యాల పాట
(పబ్లిషర్, రామకృష్ణ బుక్ డిపో, హైద్రాబాద్)
"భువిలోన పేరైన ॥ఉయ్యాలో॥ భువనగిరి గ్రామాన ॥ఉయ్యాలో॥
జరిగినా ఈ వింత ,, జాడ జెప్పెద నంత ,,

అంటూ పాట ప్రారంభమౌతుంది. నక్క చన్నయ్య అనే అతను తన పెద్ద కూతురుకు అండాలు అని పేరు పెట్టుకుని, గారాబంగా పెంచి పెద్ద జేసి పెళ్ళి చేస్తాడు ఆమె ఎంతో గుణవంతురాలు. అత్తమామలకు, భర్తకు ఎంతో సేవ చేస్తుంది. ఒకసారి ఆమె తల్లిగారి ఇంటి దగ్గర వుండగా

| | | | |
|---|---|---|---|
| "పంద్రా ఆగష్టనీ | ॥ఉ॥ | పండగొచ్చిందమ్మా | ॥ఉ॥ |
| స్వతంత్ర దినమని | ॥ఉ॥ | సంతోషమున తాను | ॥ఉ॥ |
| అన్నాలు కూరలూ | ॥ఉ॥ | ఆనందముగ వండి | ॥ఉ॥ |
| తరువాత ఇంటినీ | ॥ఉ॥ | పరిశుభ్రము చేసి | ॥ఉ॥ |
| మల్లె మొగ్గలరీతి | ॥ఉ॥ | ముగ్గులెన్నో పరిచి | ॥ఉ॥ |
| చాటలు మొంటెలు | ॥ఉ॥ | చాలా మాసినవంచు | ॥ఉ॥ |

అండాలమ్మ పేడకు వెళ్ళింది. దారితప్పి దర్గావైపు వెళ్ళింది. ఒక గూండా వచ్చి, దర్గా లోపల పేడవుందని అబద్ధం చెబుతాడు. ఆ అమాయకురాలు నిజమే నను కుంటుంది.

| | | | |
|---|---|---|---|
| ...ఎడమ జేబుల వున్న | ॥ఉ॥ | ఎర్రద స్త్రీని తీసి | ॥ఉ॥ |
| కఠినంబుగా వాడు | ॥ఉ॥ | కండ్లకూ బిగియించి | ॥ఉ॥ |
| ఆ పిల్ల నెత్తుకుని | ॥ఉ॥ | అర్రలోపల వేసె | ॥ఉ॥ |
| అంతలోనా ఆరుగురు | ॥ఉ॥ | హంతకు లేతెంచి | ॥ఉ॥ |

(ఆరకంగా ఆమె ఆగష్టు 15, 1951 న మరణించింది)

| | | | |
|---|---|---|---|
| ...ఆసుపత్రిలోన | ॥ఉ॥ | ఆ తల్లి నుంచిరా | ॥ఉ॥ |
| మరణ మొందిన తల్లి | ॥ఉ॥ | మర్మస్థాలము జూడ | ॥ఉ॥ |
| వారు పెట్టిన బాధ | ॥ఉ॥ | వర్ణించ రాదమ్మ | ॥ఉ॥ |
| ...తెల్లారి మరునాడు | ॥ఉ॥ | తేలెనమ్మ వార్త | ॥ఉ॥ |
| పాడుదరగల వున్న | ॥ఉ॥ | పాత కొట్టిడిలోన | ॥ఉ॥ |
| పేడ చేతుల తోడ | ॥ఉ॥ | పెనుగులాడిన గుర్తు | ॥ఉ॥ |
| ఐదేళ్ళ హస్తాలు | ॥ఉ॥ | అపుడేరు పడ్డాయి | ॥ఉ॥ |
| నేలపై రక్తంబు | ॥ఉ॥ | దూరమై పారింది | ॥ఉ॥ |

ఆ తరువాత,

| | | | |
|---|---|---|---|
| ఊరూరి జనులంత | ॥ఉ॥ | ఊరేగింపులు చేసి | ॥ఉ॥ |
| ఖతలకు ఖతలంచు | ॥ఉ॥ | కఠినంబు దలచిరి | ॥ఉ॥ |
| నల్‌గొండ జిల్లాలో | ॥ఉ॥ | న్యాయాధిపతి వద్ద | ॥ఉ॥ |
| కేసు విచారణా | ॥ఉ॥ | వాసిగా జరిగెను | ॥ఉ॥ |

హంతకులకు ఉరిశిక్ష పడింది కాని హంతకులు హైకోర్టులో అప్పీలు చేసుకన్నారు.

| | | | |
|---|---|---|---|
| హైకోర్టు లోపలా | ॥ఉ॥ | అప్పీలు చేయగా | ॥ఉ॥ |
| అందులో న్యాయాలు | ॥ఉ॥ | అంతమై పోయినయి | ॥ఉ॥ |
| మంచివారల కయిన | ॥ఉ॥ | మాట ఒక్కటి లేదు | ॥ఉ॥ |
| ప్రభు శాసనము నిట్లు | ॥ఉ॥ | పక్షపాతంబున్న | ॥ఉ॥ |
| ప్రజలలో బీదలకు | ॥ఉ॥ | బ్రతుకు దెరువూ లేదు | ॥ఉ॥ |
| మానాలు ప్రాణాలు | ॥ఉ॥ | మంట్ల గలిసి పోగ | ॥ఉ॥ |
| శాంతితో కోర్కున్న | ॥ఉ॥ | స్వారాజ్యమా ఇది | ॥ఉ॥ |
| శక్తి లేని వారు | ॥ఉ॥ | చావవలసిందేన | ॥ఉ॥ |
| విన్న వారల గుండె | ॥ఉ॥ | వెల వెల పోవంగ | ॥ఉ॥ |
| కన్న వారల నెట్లు | ॥ఉ॥ | కలికలి గాకుండు | ॥ఉ॥ |

యథార్థ సంఘటన ఆధారంగా ప్రజాసాహిత్యం ఎలా వెలువడుతుందో పై పాటలో వివరంగా చూడొచ్చు. ఇదంతా ఆధునిక యుగంలో మారుతున్న జీవనంలో మారుతున్న జనసాహిత్యం. ఇదేకాకుండా మరొకరకమైంది కూడా వుంది. అది భూస్వాముల, పెట్టుబడిదారుల, అధికారుల పీడనకు వ్యతిరేకంగా వచ్చిన సాహిత్యం. వ్యావసాయిక సమాజంలో భూస్వామి - రైతుకూలీ వున్నట్టే, పారిశ్రామిక సమాజంలో పెట్టుబడిదారు - కార్మికుడు వున్నారు. రెండుచోట్ల మౌలికంగా దోపిడి స్వభావం ఒక్కటే. ఆ స్వభావాన్ని అనుసరించి ప్రపంచం లోని అన్ని ప్రాంతాల్లో వచ్చినట్లుగానే - మనదగ్గరకూడా కొంత ప్రజా సాహిత్యం వచ్చింది. అలాగే మతం, రాజకీయాలు, సాంఘిక జీవనంపై ప్రభావం చూపుతున్నాయి గనుక, ఆ ప్రభావం ప్రజా సాహిత్యంపై తప్పకుండా వుంది. పీడనకు గురి కానంతవరకు పై వర్గంవారి భావజాలంతో, తాత్విక దృష్టితో సాహిత్యం వచ్చింది. పీడనకు గురి అయినప్పుడు మాత్రం వేరుపడి ఎదురు తిరిగి, వ్యతిరేకంగా గుర్తింపబడింది.

"ఏటికేతంబట్టి
ఎయ్యిపుట్లు పండిస్తె
ఎన్నడొక మెతుకెరగనన్నా"

"చెయ్యలేమయ్యా! మేమెట్టి చాకిరి
ఈ దౌర్జన్య పరులాకు చెయ్యలేమయ్యా!
కాళ్ళకు చెప్పుల జోళ్ళియ్యాలె
కలుపుకు వట్టిగ పోయి రావాలె
కడుపుకు అన్నం పెట్టుమంటె
కస్సురు మంటుతరిమేవారికి ॥చెయ్యలేమయ్యా॥"

"పొగచుట్టుక పల్లెకుబోతె
పల్లెకుక్కలన్ని బౌ బౌమనె...
పండ్లిరుగ బడ్డోన్ని పట్వారి ఎత్తె
ఎత్తలేక పట్వారి నడుమిరుగబడె-"

గ్రామ పాలక వర్గంలో ఒక ప్రముఖుని గురించి ఎంతో వ్యంగ్యంగా చిత్రీకరించడం జరిగింది. అతనిమీద కోపం, కసి-అతడు నడుము విరగ బడ్డాడని చెప్పడంతో తీర్చుకుంటారు. పైవర్గం వారి పెత్తనపు నడుం కూడా విరుగుతోందని మరో అర్థం.

తెలంగాణలో నిజాం పీడనకు వ్యతిరేకంగా లెక్కలేనన్ని గేయాలొచ్చాయి. ఉదాహరణకు ఈ ధూలాపాట చూడొచ్చు-

"లేవూ లేవూ మీరే సాబు
లేవవయ్యా మీరే సాబు
మీరెసాబు సంగడీలు
ఏడుగూరు లంబాడీలు...... ॥లేవూ॥

దొంగలు గాదు గింగలు గాదు
దోచీ నోడె మీరే సాబు
చారెడు చారెడు దోసీనాడు
చార్మీనారు గట్టినాడు...... ॥లేవూ॥

మానెడు మానెడు దోసీనాడు
మక్కా మసీదు గట్టినాడు
మక్కా మసీదు కొమ్మమీద
డేగవోలె వాలుతాడు......" ॥లేవూ॥

ఇప్పటి వరకు ధనస్వాములు పేద జనుల బ్రతుకులతో చెలగాటాలాడి వారిని హింసించారు. ఇప్పుడు వారిపట్ల సరియైన అవగాహన లేని మేధావులు వారి సాహిత్య సంస్కృతులకు వక్రభాష్యాలు చెప్పి-మరో రకంగా హింసిస్తున్నారు. ఇదెంతో జాగ్రత్తగా పరిశీలించాల్సిన విషయం.

వర్తమాన కాలంలో మరొక ప్రయత్నం సాగుతోంది. ఇది రెండు రకాలుగా వుంది. ఒకటి - ప్రజల దగ్గరికి వెళ్ళి ప్రజల దగ్గర్నుండి స్ఫూర్తిని, ఉత్తేజాన్ని పొంది పై వర్గం వారి ప్రక్రియల్లో చేసిన సాహిత్య సృష్టి. ఇక్కడ వస్తువు పై వర్గం వారికి వ్యతిరేకంగా గానీ, అనుకూలంగా గానీ ఉండవచ్చు. రెండు - ప్రజల్లో ఒకరై, ప్రజల బాణిని, భాషను జీర్ణించుకుని ప్రజల ప్రక్రియల్లో చేసిన సాహిత్య సృష్టి. ఇక్కడ వస్తువు పై వర్గం వారికి వ్యతిరేకంగా వుంటుంది. సాంస్కృతిక పోరాటంలో ఇదొక భాగం. మొదటి ప్రయత్నానికి మాండలిక కవిత, కథ, నవల ఉదాహరణలు. పెట్టుబడిదారి వ్యవస్థలో కవిత్వం, కథ, నవల, నాటకం అన్నీ సంప్రదాయ సిద్ధమైపొయ్యాయి. అవి ఉన్నత వర్గాల వారిని లేదా మధ్య తరగతి నాగరికుల్ని మాత్రమే ఆకట్టుకుంటున్నాయి. అక్కడ శిల్పానికి ఎంతో ప్రాధాన్యం వుంది. రచనకు మెరుగు పెట్టడం అవసరం. ఒక రకమైన షో-కేస్ సంప్రదాయం ఇది. జన సాహిత్యంలో ఇది చాలా వరకు లేదు. దానికి ఏ సంప్రదాయమూ లేదు. అందం, ఆకర్షణ కంటె ఈ సాహిత్యానికి అవసరం ముఖ్యం. అందువల్ల అంతర్లీనంగా ఒక లయ వున్నా, చరణాలు పునశ్చరణమౌతూ వుండడం, అనవసరమైన విషయాలు కూడా ఎక్కువగా ఉండడం జరుగుతూ వుంటుంది.

రెండవ ప్రయత్నం అలాంటిది కాదు. ప్రజల్లో కలిసి తిరిగి, వారి వేష భాషలు నేర్చి, వారికి అర్థమయ్యేరీతిలో పాటలు రాసి ప్రజల్లోకి తీసుకుపోవడం. ఇది ఒక మంచి ప్రయత్నం. జానపద సాహిత్యపు ప్రాథమిక లక్షణంగా చెప్ప

బడిన మౌఖిక ప్రచారం ఈ పాటలకూ్కడా వర్తిస్తుంది. కాని పాట రచయిత తెలిసినవాడు కావడం ఒక్కటే ఇక్కడ భేదం.

విప్లవసాహిత్యోద్యమం అందరి దృష్టిని ప్రజాసాహిత్యంపై మళ్ళించింది. చెరబండరాజు, గద్దర్ వంటి కవులు వచన పద్యాన్ని వదిలి ఆశుకవిత్వ రీతిలో పాటలు రాశారు. శ్రీశ్రీ "ఊగరా ఊగరా ఊగరా - ఉరికొయ్య అందుకుని ఊగరా", శివుడి "నరుడో భాస్కరుడా" వంటి ఎన్నో పాటలు ఉదాహరణలు ఇవ్వొచ్చు. మావో అంటాడు "మన రచయితలు, కళాకారులు తప్పనిసరై శ్రామికవర్గంవైపు వుండి పనిచేయాల్సిన అవసరం వచ్చింది" అని! అందుకే నేటి ప్రజాకవులు, గాయకులు ప్రజల్లో కలిసిపోయి పనిచేస్తున్నారు.

"ఓలి ఓలీల రంగ వోలి శెమ్మ కేలీల వోలి
గట్టు గట్టు దిరిగినాడె వోలి ,,
గోగుపూలు దెచ్చినాడె వోలి ,,
రోట్లేసి దంచినాడె వోలి ,,

అనే పాట ఉద్యమ ప్రయోజనాన్ని ఆశించి మరోరకంగా మారిపోయ్యింది.

"వోలి వోలీల రంగ వోలి శెమ్మ కేలీల వోలి
యాడబుట్టి యాడబెరిగె వోలి ,,
యాడకొచ్చె యాడసచ్చె వోలి ,,
ఎవరి కొరకు వచ్చినారు ,,
ఎవరి కొరకు సచ్చినారు ,,
ఏ తల్లి కడుపు మంట లోలి - శెమ్మ కేలీల వోలి
కూలి తల్లి కంటి పాప లోలి ,, "

ప్రజలే నా పాటలకు ప్రాణం అన్న గద్దర్ పాట ఇది. ప్రజా జీవితాను భవాలే పాటకు పల్లవి అన్నారు అరుణోదయ రామారావు. ప్రజల్నించి తీసుకున్న రూపాలయితేనే ప్రజల్లోకి వెళ్తాయి - అని అంటారు వంగపండు ప్రసాదరావు. ప్రజల్లో అప్పటికే చలామణి అవుతున్న పాటల్ని తీసుకోవడమే కాకుండా, ఈయన పాటలేని ట్యూన్స్ కూడా తీసుకున్నారు. గిరిజనులు సొన్నాయి మీద పాడే ట్యూన్ తీసుకుని ఈ పాట రాయడం జరిగింది.

"తుతు తుతు తూ తూతుతు తూతు" (బాణి)

"అంబా తక్కాడే తుమ్మలు గట్టి
అజా మన్నారే అంబలి జుర్రి
కు యా ౹ రే కు యా౹రే......"

పీడన అధికమైన చోట, ప్రజలకు పోరాటం అనివార్యమైన చోట ప్రజా గాయకులు ప్రచారం చేసిన పాటలు బాగా వేళ్ళు తన్నుకుంటున్నాయి. ఈ పాటలు కూడా ఒక్కో ప్రాంతంలో కొన్ని కొన్ని మార్పులు చెంది మొదట సృష్టించ బడ్డ పాటలకు భిన్నంగా వుంటున్నాయి. ఇలాంటి వాటిని జన సాహిత్యంలో చేర్చుకోవడానికి ఏ విధమైన అభ్యంతరం ఉండకూడదు. ఒక ప్రయోజనం ఆశించి ప్రజల్లోకి వెళ్ళే ఈ పాటలు వాటి విధిని అవి నిర్వహిస్తున్నాయి.

సమాజంలో అనేక కార్యక్రమాలు చేపట్టే అనేక సమూహాలున్నాయి. ఈ సమూహాల్లో ఎక్కువ శారీరక శ్రమ చేస్తున్న సమూహాలు లేదా పరిపాలనా నియమ నిబంధనల్లో చిక్కుకుని అన్యాయం చేయబడుతున్న సమూహాలు, వారి అసహనాన్ని, కోపాన్ని కోర్కెల్ని తప్పకుండా పాటల్లో వ్యక్తీకరిస్తాయి. ఈ పాటలు అంతకు ముందున్న జానపద గేయల్లాగా వుండక పోవచ్చు, రెండు మూడు చరణాలే వుండొచ్చు. దాని ప్రయోజనం తాత్కాలికమే కావచ్చు, అది ప్రజల్లో తరతరాలుగా కొనసాగక పోవచ్చు అయినా పాట రావడం ఖాయం.

"పోరాటం! పోరాటం
..................."

"అంటాం
అంటాం
..........
అంటాం"

"గలీ గలీమె నారా హై
..................."

వంటి పల్లవితో వస్తాయి. వారి కోర్కెలు పైఖాళీలలో పూరించుకుంటారు. సమూహం మారినప్పుడల్లా ఖాళీలలో పూరించుకునే కోర్కెలు మారుతుంటాయి. ఉద్యమ ప్రభావం అంతగా లేని చోట కూడా ప్రజల పాటలు నశించి పోలేదు. పాతవే ఇంకా కొనసాగుతున్నాయి. కొత్తవి పుట్టుకొస్తున్నాయి. ఉదాహరణకు వసంతవాగు పాట - సూపర్ ఫాస్ట్ రైళ్ళలో ఇంకా మారు మ్రోగుతూనే వుంది. హైద్రాబాద్ - కాజీపేట రైలు మార్గంలో రఘునాథపల్లి రైల్వే స్టేషను వుంది. దగ్గర్లోగల వాగు పొంగి, బోగీలు కొట్టుకుని పోయి-సుమారు ముప్పయి అయిదేళ్ళ క్రితం ఎంతో ప్రాణనష్టం కలిగింది. సికింద్రాబాదు ప్యారడైజ్ సినిమా థియేటర్ స్వంతదారు, ప్రముఖ వ్యాపారస్థుడు అయిన అంజయ్య మృత్యుముఖంలోకి ఎలా పరిగెత్తాడో వసంత వాగు పాట వివరిస్తుంది. అతనికి సికింద్రాబాద్‌లో మద్రాసు మెయిల్ అందదు. కారులో ప్రయాణమై భువనగిరి చేరుకుంటాడు. అక్కడకూడా అందదు. అప్పుడు అతడు మద్రాసునుండి ఒక సినిమా ప్రింటు తీసుకుని రావడానికి వెళ్తున్నాడు. అందుకే ప్రయాణం మానుకోక అదే కారులో వెళ్ళి పై స్టేషనులో రైలు అందుకుంటాడు. కాని ఎక్కిన కొద్దిసేపటికే ప్రమాదం సంభవిస్తుంది. ఈ పాటను ప్రచురణకర్తలు చిన్న పుస్తకంగా కూడా వేశారు.

"ఎవడబ్బా సొమ్మని" - అంటూ తిట్టగల రామదాసువంటి భక్తులు ఆ కాలంలోనే కాదు. ఈ రోజుల్లో కూడా వున్నారు. యాదగిరి లక్ష్మినర్సింహ స్వామికి తమ గోడు వెళ్ళబోసుకుంటూ

"కొబ్బెర దినుకుంట
పులిగోర దినుకుంట
నీ అబ్బ సొమ్మేం బోయింది నర్సిమ్మా
నీ అబ్బ సొమ్మేం బోయింది నర్సిమ్మా"—

అని పాడుకుంటున్నారు.

ఆధునిక యుగంలో వుంటూనే ఆ పద్ధతులతో ఆ జీవన విధానాలతో ఇమడక దూరంగా వుంటూ తమ అసహనాన్ని అసహ్యాన్ని కొన్ని సమూహాలు ఈ విధంగా పాడుకుంటున్నాయి.

"రంగు పోడరు మూతులాయె
మే చైనా సొమ్ములాయె
మెచ్చ తిరుగ కారులాయె
చచ్చిపోయే ముసలి దానికి-అయ్యయ్యో
జబ్బలంటె రైకలాయెనో"

"నందామయా గురుడ నందామయా
ఆనంద జోతికి నందామయా
అత్తలకు పీటలు కోడలికి మంచాలు
మొగుడి నెత్తిన తట్ట పెడతారయా
వరికూడు తిని వావి వరుసలే తప్పారు
మగని పేరుపెట్టి పిలిచేరయా" — అంటూ బ్రహ్మంగారి తత్వాలు పాడుకోవడం ఇంకా కొనసాగుతూనే వుంది.

జన సంగీతంలోని గొప్పతనాన్ని గుర్తించి, అర్థం చేసుకుని ఆ బాణీలను రచనల్లో, నాటకాలలో చలన చిత్రాలలో ఇతర కళా రూపాలలో విరివిగా వాడుకున్నారు. బెథోవన్ దగ్గర్నుండి బీటిల్స్ వరకు అందరూ జన సంగీతాన్ని వాడుకున్నవారే. ప్రజా గేయాల మూల రూపాల్ని, వాద్య సహకారంతో పాడుతూ ప్రపంచం నలుమూలలా ప్రదర్శన లిచ్చారు - బీటిల్స్ సోదరులు. వీరికి బ్రిటిష్ ప్రభుత్వం 'సర్' బిరుదు లిచ్చింది. ప్రజా ప్రక్రియల్ని ప్రపంచంలో ఎందరో ఎన్నో ప్రయోజనాలకు వాడుకున్నారు. ఇరవై సూత్రాల పథకం, కుటుంబ నియంత్రణ, వయోజన విద్య మొదలైనవి ప్రచారం చేయడానికి మన ప్రభుత్వం వాడుకుంటోంది. దేశంలోని రాజకీయ పార్టీలన్నీ ఎన్నికల ప్రచారంలో వాడుకుంటున్నాయి.

1984 అక్టోబర్ 31న భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ హత్య చేయబడ్డప్పుడు హైదరాబాద్ నగరంలో ప్రతికూడలిలో ఆమె చిత్రపటాన్ని పెట్టారు. ఢిల్లీలో నవంబర్ 2న ఆమెకు అంత్యక్రియలు జరిగేంతవరకు ప్రజలు ఆమె అమరజీవి అన్న నినాదాలు చేశారు. అంతేకాదు అప్పటికప్పుడు ఆమెపై పాటలల్లుకుని రాత్రింబవళ్ళు పాడుకున్నారు.

"అమ్మా పలకదమ్మా
మనతో మాటలాడదమ్మా"

"కరుణించవే ఇందిరమ్మా
అమ్మా పల్లవా పావన తల్లి
నిన్నెట్లా మరతునె కల్పావల్లి"

"దేశము సల్లగ చూశావు
నువ్వు పేదల కొరకే నిలిచావు"

*　　　*　　　*

"నాగరికత పెరిగి - కార్లు రాగానే మనం నడక మానలేదు. కెమరాలు వచ్చాయని చిత్రాలు గీయడం మానలేదు. సినిమాలు వచ్చాయని కథలు చదవడం మానలేదు" అంటాడు పీటెసీగర్. బిషప్‌పెర్సీ అనే ఆయన పద్దెనిమిదో శతాబ్దపు వీరగాథలు సేకరించాడు. ఆ గాథలు పాడడం కొద్దిమందికే తెలుసు గనక, ఆ గాథల కళారూపం త్వరలో నశిస్తుందని జోస్యం చెప్పాడు. వంద సంవత్సరాల తర్వాత చైల్డ్ కూడా అలాగే అన్నాడు. యాభైయేళ్ళ క్రితం సిజిల్‌షార్ప్ అదేమాట అన్నాడు. కాని ఆ గాథలింకా ప్రపంచం నలుమూలలా పాడబడుతూనే వున్నాయి. ప్రజలు ఆదరిస్తూనే వున్నారు. కాని విమర్శకులు ఇంకా వాటి 'అదృశ్యం' గురించి చెబుతూనే వున్నారు. జనసాహిత్యం నశించిపోదని చెప్పడానికి ఇదొక మంచి ఉదాహరణ.

"Folk lore is an echo of the past but at the same time it is also the vigorous voice of the present." రిచర్డ్ యం. డార్సన్ అన్నమాట అక్షరాలా నిజం. శాస్త్ర సాంకేతికాభివృద్ధి జరిగినా, సమాజంలో వర్గాలున్నంత కాలం జన సాహిత్యం వుంటుంది. కొన్ని కళారూపాలు, క్రియలూ వుంటాయి. కాని అందులో వస్తువు మాత్రం చాలా వరకు ప్రజాస్వామ్య భావాలతో వుంటుంది.

